# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఫిబ్రవరి 1957

సంపుటము 34 : : సంచిక 2

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1957

# నీ డ వ యా రి

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

ఏనాటికిని మరపురానీని బాధ
ఎంకి నను చేపట్ట శంకించు గాథ !
వరమిడకె తా మరలి
ఇలు చొరబడిన రేయి—
గోడ దన నీడైన
చూడనే పొంచుంట
ఏనాటికిని...

నీడవయ్యారి నడ
యాడ నామేనిదడ,
నీడతలలో తలపు
జాడ గన నా తపన !
ఏనాటికిని...

నీడ నిశ్చింతగా
నిదురింప నావంత,
కదలె నానీడ—నా
కలలె యను నా జాలి !
ఏనాటికిని...

నీడొకటి—కనుచెదిరి—
జోడువలె నగపడుట
నీడలనె పట్టి తును
మాడ నే నెగబడుట !
ఏనాటికిని...

నీడలనె నమ్మి వే
లాడు చిత్తక్షోభ !
ఏనాటికిని...

# మంజు

శ్రీ అరిపిరాల విశ్వం

"మంజూ! మంజూ! నేను వచ్చానమ్మా నిన్ను తీసుక వెళ్ళటానికి. అవును నీ వివ్వాళ తప్పకుండా వస్తావనే చాల పెందలాడే వచ్చేశా! అయ్యో—ఏదీ!... ఈ పెట్టెలో వుందేమో!" అంటూ ఒక మనిషి ప్రతి పెట్టెదగ్గరకూ హడావిడిగా తిరుగుతున్నాడు. ఇంతలోనే రైలు పెద్దగా కూతవేసి గుప్పున పొగవిడుస్తూ వెళ్ళిపోయింది. పాపం అతనూ ఒక పెద్ద నిశ్వాసాన్ని వదలి రోజూమాదిరిగానే యీ వేళ కూడా నిశ్శబ్దంగా వెళ్ళిపోతున్నాడు.

ప్రపంచ దృష్టిలో అత డొక పిచ్చివాడు. నిజమే ఆచిరిగిపోయిన గుడ్డలూ పెరిగిపోయిన గడ్డాలూ మీసాలూ అతనికిచ్చే యోగ్యత అంతే. ఎవరు మాట్లాడించినా మాటాడడు కాబట్టి, తనలో తనే ఏమిటో యెప్పుడూ ఏదో చెప్పుకుంటూ వున్నచోట వుండక అంతటా తిరుగుతాడు కాబట్టి అతన్ని లోకం పిచ్చివాడనే పిలుస్తోంది.

కొందరు అదృష్టవంతులు మేడల్లో జన్మిస్తారు. మరికొందరు దురదృష్టజీవులు ఆ మేడల నీడల్లో అడుక్కుంటూ బ్రతికే అభాగ్యులకు అత్యంతభారంగా పుట్టుతారు. పుట్టిన ప్రతిజీవికీ ఆశ అనేది వుండటం సహజమే కావచ్చు. ఆ ఆశనే తమ ఆశయంగా కలలుగంటూ తమ జీవితంలో దాన్ని పొందగలిగేవారు కొందరు, చివరి క్షణందాకా దానికై బ్రతుకంతా బలియిచ్చి ఏమీ మిగులక బరువు గుండెలో మరణించే అనాథులు కొందరు.

జీవితంలో ఆశించింది లభించకపోవచ్చు, ఆశించనిది హఠాత్తుగా సంభవించి, భావించని రీతిగా అదంతా మాయమైపోవచ్చు. కాని దానితాలూకు ఛాయలు ఆ జీవిని అనవరతం వెంటాడుతూనే వుంటయ్. ఎండమావుల్లోని నీటితో, తన దాహం తీర్చుకోవాలని తీరని కోర్కెతో పరుగెత్తుతూ వుంటాడెక్కడికో అంతు తెలియని చోటికి. దానితో ఎప్పటికీ దాహం తీరదని తెలుసు కాబట్టి మనమంతా మామూలుగానే వున్నాము. ఆ యథార్థాన్ని తాను నమ్మలేడు కాబట్టి అతను పిచ్చివాడై తిరుగుతాడు.

ఈనాడు పిచ్చివాడైపోయిన అతనూ ఒకనాడు జన్మించింది సంపన్నగృహస్థుల యింట్లోనే. నాన్న దయాగుణం కలవాడు కాబట్టి అందరి కష్టాల్నీ తనవిగా భావించేవాడు. ఎంతో ఉదారుడైన వ్యక్తిగా జీవిస్తూ, తన ఏకైకపుత్రుణ్ణి చాల గొప్పవాడిని చేయాలని ఉవ్విళ్ళూరేవాడు. అమ్మ తనకు ఒక్కడే ఒక్కడని అబ్బురంగా పెంచుకుంటూ ఆశలన్నీ అతనిపైనే పెట్టుకొని బ్రతికేది. నాన్న ఒకనాడు వేలమైపోయేందుకు వచ్చిన ఆవూరి ఆసామి ఆస్తిని తానష్టంవుండి కాపాడాడు. పాపం పిల్లా జల్లా నిలువ నీడలేని నిరాధారులైపోతారని కనికరించాడు. దుఃఖంవెంట సుఖం, వెలుగువెంట చీకటీ—అలాగే కృతజ్ఞతను కృతఘ్నతా ఎప్పుడూ ఛాయలాగా వెంటాడుతూనే వుంటయ్. ఇంతెందుకు యీ సృష్టి సమస్తం పరస్పరవిరుద్ధశక్తుల సంఘర్షణా స్వరూపమైనది. అదే సర్వవిఘ్నాలకు సంగమతీర్థము.

సృష్టి పరిణామశీలమైనది. అందులోని ఉపాంగమైన జీవితమూ అంతే. ఆ జీవితముపైన బాహ్యపరిస్థితుల బహుళమైన ప్రభావం చాలా వుంటుంది. దానికి లొంగక జీవింపగలిగేవారు చాల తక్కువ.

ఎవరిని ఒకనాడు తాను కనికరించాడో ఆ వ్యక్తులు యీ రోజున తనను కరుణించవలసినవారుగా మారిపోయారు. తత్ఫలితమే యావదాస్తీ బాకీదారుల పరమైపోవటం. ఈ అవమానాన్ని సహించలేని నాన్న ఒకచెడ్డరోజున బలవంతంగా బ్రతుకు నంతమొందించుకొన్నాడు.

ఎప్పుడూ బయటిముఖం చూడని అమ్మ పొట్టకూటికోసం రహస్యంగా గౌరవనీయుల యిండ్లలో పని చేసి తనకు చదువు చెప్పించింది. ఆ ఊరిలో వున్న అయిదు తరగతుల చదువే గొప్ప అని అనుకొనేవాడతను.

నాన్నపోయిన దిగులుతోను, దుర్భరదారిద్ర్యంతోను, అవమానంతో క్రుంగిపోయే అమ్మ మంచమెక్కింది. అయినా తనను గొప్పవాడివి కమ్మని ఆశీర్వదించేది. సంవత్సరం తిరుగకముందే ఆ మహాసాధ్వి

* ఉస్మానియా విశ్వవిద్యాలయం జరిపిన పోటీలో ప్రథమ బహుమతి పొందినకథ.

పరలోకగతురాలైంది. ఉద్దేశరహితంగా అనాథలాగా అందరి విమర్శలకు గురౌతూ ఈ పల్లెటూళ్లో వుండలేక ఉద్యోగంకోసం దాపునవున్న బస్తీ చేరాడు గంపెడాసతో.

## 2

'దయగలబాబులు! ఓ కానీ ధర్మం చెయ్యండి స్వామీ! మీకు పుణ్యముంటుంది' అంటూ ఒక ఆరేళ్ళపిల్ల అందరిదగ్గరా అడుక్కుంటోంది.

బాగా బొజ్జలు పెంచి తిన్నది అరిగేవిధమేమిటా అని విచారపడే మహనీయులు పాపం ఆ పిల్లకు ఏమీ రాల్చలేదంటే అతిశయోక్తి కాకపోవచ్చు. జానెడు పొట్టకోసం యెలా బ్రదకాలా అనుకొనే అనేకమంది గుండెల్లో జీవిస్తున్న కనికారమే అప్పుడప్పుడూ ఆ చిన్నిపిల్లచేతిలో ఓ కానీ, అర్ధణాయో రాలిపిస్తోంది.

ఆ బస్తీప్రక్కనే పారే నదిఒడ్డున వేయబడిన బెంచీలపై కూర్చొని సాయంత్రం చల్లగాలికి కాలక్షేపం చేయటానికి అనేకమంది చేరుతూవుంటారు. చెట్లుకూడా బాగా పెంచబడినవి.

అప్పుడే చంద్రుడు ఆకాశంలో తన కిరణాలను ప్రకాశింపజేస్తున్నాడు. ఎక్కడో ఓమూల బెంచీపైన చిరిగిపోయిన గుడ్డలతో, రేగిపోయిన జుట్టుతో మోకాళ్ళపైన తలబెట్టి విచారంగా కూర్చున్న మన 'రామూ' దగ్గఱకు వచ్చిందాపిల్ల.

'బాబూ! ఓ కానీ యివ్వు బాబూ! దర్మప్రభువులు' అంటూ బిగ్గరగా అనేసరికి ఉలిక్కిపడి తలనెత్తిచూచాడు.

'మిమ్మల్నే సామీ! దరమం సెయ్యండి బాబూ!'

'నేను బాబునుకాదు. ధర్మం చెయ్యటానికి నా దగరేమీ లేదు.'

'మీరు మహారాజులు, బీదపిల్లకు దర్మం సెయ్యండి' అంది.

'ఏయ్ పొమ్మంటే నీకుకదూ!' అని రామూ మరల మోకాళ్ళపై తల ఆన్చి విచారంలో మునిగిపోయాడు:

పొమ్మంటే పోని ఆ కొంటెపిల్ల అంతకుముందే తాను కొనుక్కున్న మరమరాలు తింటూ కాళ్లాడిస్తూ, ఆ బెంచీపైన చతికిలబడి మెల్లగా కూనిరాగాలు తీస్తోంది.

ఇంతలోకే రామూ తలెత్తిచూచాడు. ఆ పిల్ల ఆకాశంలో చందమామనుచూచి మురిసిపోయి మరమరాలు తింటూ పాడుకొంటోంది.

'ఏయ్ నీ పేరేమిటి?' అన్నాడు.

ఆ అమ్మాయి ఉలిక్కిపడి........మెల్లగా 'మంజూ' అంది.

'అయితే మీ యిల్లెక్కడ?'

'పూలబావి దగ్గఱ.'

'మీ అమ్మా నాన్నా ఏం చేస్తూంటారు?'

'మా నాన్న చచ్చిపోయాడు' అంది.

'మరి మీ అమ్మో!'

'మా అమ్మ దగ్గుమనిషి. ఎప్పుడూ మంచంలోనే పడివుంటుంది.' అన్నది.

'అయ్యొ పాపం' అంటూంటే అతని కన్నుల్లోకి నీరు దానంతటదే వచ్చింది.

'అదేంటి బాబూ! కన్నుల్లో నీరెందుకు?'

'ఆఁ, ఏమీలేదులే యేదో జ్ఞాపకంవచ్చి' అని మరిపించబోయాడు.

'మనది యీ వూరేనా బాబుగారూ' అంది.

'కాదుయిప్పుడు నాది అనేది యేవూరూ లేదు.'

'అదేంటి బాబూ? మీ అమ్మగారూ నాన్నగారూ ఎక్కడున్నారు?'

'స్వర్గంలో'.

'అంటే...అదేంటి బాబూ? ఎక్కడది?' అంది,

'అంటే...చచ్చిపోయారులే' అన్నాడు.

'మరింకా ఇప్పుడెవరున్నారు బాబూ?'

'నేనొక్కణ్ణే...యింకెవరూ లేరు.'

'మీ యిల్లెక్కడ బాబూ?'

'ప్రస్తుతం యిదే నాయిల్లు'.

'మరి అన్నం ఎక్కడ తింటారు సామీ?'అంది.

'అన్నంతిని అయిదురోజులైంది. పోనీలే... రేపటినుంచీ నాకుగూడా అడుక్కోటం నేర్పుతావ్? నిజంగా...' కంఠం గద్గదమైంది అతనికి.

'బాబూ? యీ మరమరాలు కాసినీ తినవ్?' అని వాటిని తనముందు పెట్టింది.

'ఆహాఁ...అక్కర్లా...అక్కర్లా.'

'పోనీ మాయింటికెల్దాం అంది.'

'వద్దులే' అన్నాడు.

'అక్కడ మాకు బండీ ఎద్దూ వున్నయ్' అంది.

'మరి నీవు అడుక్కుంటున్నావెందుకు?'

'నాన్నపోయిన తరువాత తోలేవాళ్ళులేక... అమ్మకేమో జబ్బు...'అంటూ ఆ అమ్మాయి తుర్రున పారిపోయింది.

'అబ్బ! ఎంత తెలివైనపిల్ల. ఎంత అందమైనదీ... అయినా అడుక్కుంటోంది'. అనుకున్నాడతను లోలోపల. తనూ బహుశా రేపటినుంచీ అదే పనిచేయాలేమో' అని ఒక్కసారి జ్ఞప్తికి వచ్చి ముఖానికి చేతులు కప్పుకొని ఏడుస్తున్నాడు.

## 3

డాక్టర్ సరోజినీదేవి అప్పుడే హాస్పిటల్‌కు వెళ్ళేందుకు తయారౌతోంది. ఇంతలో బయట ఎవరో పాటపాడుతూ పెద్దగా 'బిచ్చమెయ్యమ్మా!'. అని అరుస్తూంటే వళ్ళుమండి చర్రున బయటికి వచ్చింది కోపంతో.

'జాలిగల్లాతల్లి జావైన పోయమ్మ!
కాలే కడుపుకు యింత గంజైన చాలులే—
అమ్మగారీయిల్లు దరమంలోగిల్లు'

అంటూ జాలిగొలిపే గొంతుతో పాడుతూ యింటిముందర నిలుచుంటే కోపమంతా ఏమయిపోయిందో—'అయ్యోపాపం చిన్నపిల్ల' మన ఉమ యీడుదే. ఎఱ్ఱగా ఎంతచక్కగావుంది!' అనుకుంటూ నిలబడింది.

ఇంతలో నే పాట ఆపి 'అమ్మా! ఇంత బిచ్చమేయమ్మా!' అంది మంజూ.

'ఏయ్ అప్పుడే తెల్లవారిందీ బయలుదేరావ్?' అంది సరోజినీదేవి.

'తల్లిగారూ! దయగలవారు, ఓ చినిగిపోయినదో, పాతదో, మీ బిడ్డలు దొడిగేసింది ఓ గౌనో, పరికిణో ధర్మంచెయ్యండి అమ్మా!' అంది.

'ఆ...ఎంత తెలివిగలది', అనుకుంది డాక్టర్.

'అమ్మా నాన్నా లేరూ? అడుక్కోటానికి బయలుదేరావ్ అప్పుడే' అంది.

'కాసిని బిచ్చమేయమ్మా' అంది మంజూ.

'ఏయ్ సరేగాని అడుక్కు తినకపోతే మా అమ్మాయికి తోడుగా ఉంటావేమో' అంది. 'రేపు మా అమ్మని అడిగి చెప్తానండీ!' అంది మంజూ.

* * *

ఆరోజు సాయంత్రం మామూలు వేళకు 'రామూ' అక్కడికు వచ్చేసరికి 'మంజు' వచ్చి, మోకాళ్ళపైన తలపెట్టుకొని కూర్చొంది.

'ఏమిటి మంజూ! ఎందుకట్లా వున్నావ్?' అన్నాడు రామూ. తలెత్తి, 'అమ్మకు బాగా ఎక్కువగావుంది. ఏమైనాసరే ఇవాళ నీవు నాతో రాకపోతే యిక నేను యిక్కడనుంచి కదలను. నిజం, ఎందుకో భయంగావుంది' అంటూ అమాయికంగా అతని భుజాలపైన తలపెట్టి ఏడుస్తోంది.

'ఛా...ఒచ్చిపిల్లా ఏడుస్తారా? పద వెళ్దాం' అంటూ మంజూను అనుసరించాడు రామూ.

తను ఆ పూరిపాకలోకి ప్రవేశించబోతూంటే దగ్గు వినిపించింది.

ఇంతలోకే మంజూ 'అమ్మా! కళ్ళు తెరిచూడవ్' అంది.

అమ్మ లేచింది మెల్లగా. నుంచున్న రామూను కూర్చోమని చేతితో సంజ్ఞ చేసింది. మంజూ చిన్న కుండతో నీరు తేవటానికి పోయింది.

అమ్మ చెప్పటం ప్రారంభించింది. 'నాయనా! మూడు నెలలనుంచీ రోజూ మంజూ నిన్ను గురించి చెప్పని రోజులేదు. ఇవేళటికి చూడగలిగాను. ఏం చేస్తాను నాయనా! తోటి పిల్లలంతా బడిలోకి పోతూంటే దాన్నేమో ఊరుపంబడి బిచ్చానికి పంపుతున్నాను. వాళ్ళ నాన్న వుంటే యీ పాటికి ఎంత చదువు నూరిపోసేవారో! ఆయన ఎప్పుడూ అంటూండేవారు—'మంజూని పెద్దడాక్టర్ చెయ్యాలని.' ఏదీచూడకుండానే ఆయన వెళ్ళిపోయారు, ఓ బండినీ, ఎద్దునూవదలి. ఆయన బడిచెబుతూ యీ బండినీ ఎద్దునీ ఎవరిచేతికైనా తోలించేవారు. సంపాదించే నాథుడు పోయినట్లే మా అదృష్టం కూడా వెళ్లిపోయింది ఆయనతోపాటే. ఈ సంవత్సరంనుంచి సరైన మనిషి లేక ఆబండి ఎద్దూ అట్లాగే వున్నయ్.

'ఆ బండి నేను తోలి సంపాదించి యిస్తా. నాకింత తలదాచుకోనేందుకు చోటివ్వండమ్మా!' అని అడిగాడు రామూ. ఇంకే మనాలో తెలియక అట్లాగే ఉన్నాడు.

'నాయనా! యీ వేళనుంచి యీ యింట్లో బిడ్డలాగా వుండిపో' అంది. ఇంతలోకే నీళ్లు తెస్తూన్న మంజూ! 'ఏయ్ బాబూ! లే అన్నం తిందాం.' అన్నది.

'ఇక నన్ను బాబూ! అని పిలిస్తే వూరుకోను.'

'మరి యేమని పిలవాలి?'

'అన్నా! అని పిలువమ్మా!' అంది మంజూతల్లి.

'ఓ అయితే యింకేం? అన్నా! అన్నా!' అని భుజాలుపట్టుకొని ఆడుతోంది మంజూ ఆనందంతో. ఈ క్రొత్త అన్న కన్నుల్లోని నీరు ఎంత ప్రవహించిపోతోందో చీకటిలో యెవరికీ కనుపించి యుండదు. అవి బహుశా ఆనంద బాష్పాలేమో?

## 4

'ఏయ్ మంజూ! నిన్నే ఎక్కడికి వెళ్ళావ్? తొందరగా రా, పెళ్ళివాళ్ళు అలిగిపోతున్నారు!' అని కేక వేసింది ఉమ.

'వస్తున్నా యిప్పుడే గుడ్డలు ఆరేస్తున్నా!' అంటూ మంజూ ప్రవేశం.

'చూడమ్మా! యీ పెండ్లివారికి లాంఛనాలు సరిగా జరగలేదట. బాండు మేళాలు, పల్లకీలూ, పాట కచ్చేరీలు, భరతనాట్యాలూ కావాలిట.' అని సాగదీసుకుంటూ చెబుతోంది ఉమ.

'మరేమిటనుకున్నావ్ పెళ్ళి అంటే. పెళ్ళి కూతురు వారన్నింటికీ తలవంచాలిసిందే' అంది మంజు.

అప్పుడు సాయంత్రమయింది.

'ఏయ్! ఇంకా ఎంతసేపు పెళ్ళికూతురికి చీర సింగారించటం. ఇక్కడ పేరంటాళ్ళంతా కూర్చుంటేను?' అని కేక వేసింది మంజు.

'వస్తున్నా అయిపోయిందమ్మా! అంత తొందరైతే ఎట్లాగ?' అంటూ పెళ్ళికూతురిని తీసుకొని వచ్చింది ఉమ.

ఎట్లాగో మేజువాణీ అయింది. వెంటనే ఊరేగింపు. ఓ కారులో వధూవరులు కూర్చున్నారు. ఎట్లా అయితేనేం నాలుగు బజార్లూ తిరిగి వచ్చామనిపించారు.

ఇక భరతనాట్యం ప్రారంభమైంది. ఉమ భరతనాట్యం చేస్తోంది. మంజు పిచ్చి పిచ్చి తాళం వేస్తూ.

సానిస ధనిపామ పధా
నీనిస రిపగమ రిసా——
రాముని పద పంకజములు
రంజిల్లవె కొలిచి మనస——

అంటూ పాడుతోంది. 'భేష్! భేష్! బాగుంది.' అంటూ చాలాసేపటినుంచీ చాటుగా యీ పిల్లల బొమ్మలపెళ్ళి వేడుకల్ని, తిలకిస్తున్న సరోజినీదేవి ఒక్కసారిగా సంతోషం పట్టలేక వచ్చి ఉమని కౌగిలించి ముద్దాడుతోంది.

ఆ యిల్లంతా ఆనంద పారవశ్యంలో మునిగి పోయింది.

# 5

'అయ్యగారూ! కూలండీ!'

'బాబుగారూ! బండి తీసుకురానా!'

'అయ్యగోరూ! రిచ్చా అండీ!'

'నా గుఱ్ఱం రాజాలా పోతుంది సార్! ఒక్కసారి ఎక్కితే మీకే తెలుస్తుంది' అంటూ కూలివాళ్ళూ, బండివాళ్ళు, రిక్షావాళ్ళు, జట్కావాళ్ళు ఊరికే గొడవ చేస్తున్నారు.

ఇదే ఆఖరుబండి అవటంచేత చెప్పుకోతగ్గ జన సమ్మర్దం లేకపోయినప్పటికీ ఒక మోస్తరుగా ఉన్నారు ప్రయాణీకులు. స్టేషన్‌లో వెలిగించిన గుడ్డిదీపాలు క్రమ్ముకున్న కారుమేఘాల్ని చీకటినీ ఏమీ చేయలేక పెద్దపెద్ద పొగలు విడుస్తున్నయ్. అందర్నీ వేరనూడి ఎవరూ కుదరక ఆఖరికి 'ఏయ్ ఒంటెద్దు బండీ వస్తావా?' అని పిలిచాడో దీర్ఘకాయుడు.

ఆయన పత్ని ఒక అర్ధ పర్వతాకారంలో నిలుచొని ఆవులిస్తోంది.

'చిత్తం బాబయ్యా' అంటూ ఆశగా ముందుకు వచ్చాడు.

'విజయలక్ష్మీపురానికి ఏమి తీసుకుంటావ్?'

'అర్ధరూపాయి దయచెయ్యండి బాబూ! వెళ్ళి పోదాం.'

'పావలాకంటే ఒకదమ్మిడీ యివ్వను. ఇష్టముంటేకట్టు, లేకపోతే లేదు.'

'ఇంకో అణా దయచెయ్యండి. చాలాదూరం పోవాలె.'

'ఏమీ లాభంలేదు' అన్నాడాయన.

'సరే తమదయ. ఎక్కండిబాబూ!' అన్నాడు బండివాడు రామూ.

ఈ యుభయుల బరువుకు ఎద్దుకుంగిపోయింది.

'ఏమోయ్! త్వరగా పోనీ, పైనవానకురిసేట్టుగా వుంది' అన్నాడు.

'అయ్యా! చిత్తం' అని ఎద్దుని అదిలిస్తున్నాడు.

బజారు దీపాలు వాటిఉపయోగాన్ని కోల్పోయి నిప్పులులాగా వెలుగుతున్నవి. అసలే వెధవగతుకుల రోడ్డు. అందులో అసామాన్య భారంగల ఆలిమగలు ఎక్కారు. ఇక మాడండి 'రామూ' బండిదిగి నడపాలిసి వచ్చింది ఎద్దును.

ఇదంతా చాలదన్నట్లు సన్నగా తుంపరలు సాగినయ్.

'తొందరగా పోనీ, వాన దంచేట్టువుంది'అన్నాడాయన.

వానజల్లు పెద్దదై పోయింది. 'రామూ' అలాగే తడుస్తూ బండి తోలుతున్నాడు. 'ఇంతలోకి' వెధవ బండి ఎరక్కపోయి యెక్కాం; బండిఅంతా వానే' అంటోంది సాధ్వి.

'అయ్యా! ఆ గుడిసె కొద్దిగా చిరిగిపోయింది ఉంచండయ్యా!' అని తలపంచె దానికి అడ్డంకట్టాడు. అది చినిగిపోయిందే కాబట్టి ఆశించినఫలితాన్నియ్యలేక పోయింది. అమ్మగారు పెట్టే శాపనార్థాలు వాన జోరులో కలిసి రొదచేస్తున్నయ్.

'అయ్యో! అయ్యో! బండిపడిపోతోంది' అని ఆమె గోలచేస్తోంది. నిజంగానే ఎద్దుకాలు మడతబడిపోయి గోతిలో కూలబడింది.

'బాబుగారూ! ఒక్కసారిదిగండి. ఎద్దును లేపిన తర్వాత ఎక్కుదురుగాని' అన్నాడు. చేసేదేమీ లేక విసుక్కుంటూ దిగాడాయజమాని. ఎట్లాగో నానాఅవస్థలూపడి ఎద్దునిలేపాడు. మళ్ళీ యథాప్రకారం పోతోంది.

ఎడాపెడా కొట్టేవానకు వంగివంగి అతిప్రయాస పైన నడవగలుగుతున్నాడు రామూ. వళ్ళంతా తడిసి

పోయింది. కట్టుకున్న పంచెనిండా బురదనీళ్ళు చింది మరకలైంది. మోకాళ్ళదాకా బురదఅయింది.

'ఏయ్; యిక్కడఆవు, ఆపెట్టే అదీ లోపల పెట్టు' అంటూ ఆయిద్దరూదిగి యింటిలోకి వెళ్ళారు. తానూ వెంబడే పెట్టెతీసికొని వెళ్ళాడు.

'ఏయ్ ఇదిగో బాడుగ' అని పావలాబిళ్ళ ముఖానవేశాడు.

'చాలాకష్టపడ్డాను దొరగారూ!ఒక్క అణా...' అన్నాడు చలికి వణికే రామూ. ఏక్షణాన వున్నాడో పాపం ఓ బేడబిళ్ళ తీసియిచ్చి పొమ్మన్నాడు. ఆడబ్బులు కళ్ళకద్దుకుని చెంగునకట్టుకున్నాడు. తన రోజు సంపాదనంతా అదే కాబట్టి.

కడుపులోఆకలి దహించివేస్తోంది. ప్రొద్దున ఇంటిదగ్గర బయలుదేరటం. ఇవ్వేళ అమ్మపని మరీ అధ్వాన్నంగావుంది. ఎట్లావుందో ఏమో? మంజా ఏమైందో? భయపడుతోందేమో అనుకుంటూ బండి యింటివైపు మళ్ళించాడు.

ఎద్దు ఇంటిముఖంపట్టి గబగబానడుస్తోంది.

ఆపేటఅంతా ఉండేది పేదవాళ్ళే. ఎక్కడా పెద్దగా చడీ చప్పుడూ కనిపించటంలేదు. అవును! అర్థరాత్రివేళ ఏముంటుంది?

ఇల్లు దాపౌతున్నది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నయ్. చలికి పెదవులు గడగడా వణుకుతున్నయ్.

ఏమిటబ్బా! కాస్త గల్లంతుగా వుంది! అయినా అలాగా జనానికి అది పరిపాటేగా చిటికీమాటికీ, కాస్తకీ, కూస్తకీ దొమ్ములాడుకోవటం అనుకుంటూ వస్తున్నాడు. అరె! మనయింటిదగ్గరే. ఏమయిందో? 'భగవంతుడా రక్షించు'అని రెండుచేతులూఎత్తి దణ్ణం పెట్టాడు. బండి అక్కడ విప్పి పరుగెత్తాడు. చుట్టు ప్రక్కలవాళ్ళంతా గుమిగూడారు. వారందరినీ తోసుకుని పాకలోకివెళ్ళాడు.

మంజా బావురుమని కాళ్ళకి చుట్టవేసింది. అప్పటికే అంతా అయిపోయింది.

'అమ్మ చచ్చిపోయింది అన్నా!' అంటూ మంజా యేడుస్తోంది. అన్న గుండెక్రిలి కుప్పలా కూలిపోయాడు. 'ఊరుకోండి' అని అందరూ సముదాయించినా తల నేలకువేసి బాదుకొంటున్నాడు.

రెండేళ్ళనుంచి బిడ్డకన్న మిన్నగా చూసుకొనే అమ్మ యీవేళ తనతో చెప్పకుండా వెళ్ళిపోయింది.

## 6

'ఏయ్ మంజా! యీ చొక్కా గూడుమీద చిరిగిపోయింది. కాస్త కుట్టిపెట్టు' అని తాను ఎద్దుకు మేత వేయటానికి వెళ్ళాడు రామూ.

పాపం మంజా చేతయీ, చేతగాక దీక్షగా ఆ చినుగు కుట్లతో నింపేసి కనిపించకుండా చేయాలని నానాబాధా పడుతోంది.

అమ్మ పోయి ఆరునెలలు దాటినయ్. కాస్త దుఃఖంనుంచి తెప్పరిల్లారిద్దరూ.

'తొందరగా కానీ...వెళ్ళాలి' అని నుంచున్నాడు రామూ.

'అంత తొందరైతే నా చేతగాదు' అంటూ కూనిరాగాలు తీస్తూ యింకా కుడుతూనే వుంది మంజా తలవంచుకొని.

'ఓహో! యీసంగీతం ఎక్కడ పట్టుకున్నావ్?' అన్నాడు నవ్వుతూ.

'మా డాక్టర్ గారి అమ్మాయికి భరతనాట్యం సంగీతం చెప్పటానికి ఓ మాష్టరుని పెట్టారు. ఆయన ఉమకు చెబుతూంటే విని నేర్చుకున్నదే. నాబొంద సంగీతం యిదో సంగీతమా?' అంది పెద్ద నాపసాని లాగా.

'ఓహో! అట్లాగా?' అన్నాడు.

'నిజంగా నన్నాయ్. నేను చదువుకోవద్దూ. నన్ను గనక బడికి పంపితే ఉమకన్న బాగా చదువుతా' అంది గర్వంగా.

'ఓ యింకేం నీవు కూడా డాక్టరమ్మదాకా చదువుతా నంటావ్,' అన్నాడు.

పాపం యీ కాస్తమాటకే ఆ లేతగుండె ఉప్పొంగిపోయింది.

'మరచిపోయా. వెళ్ళాలన్నాయ్ తొందరగా; ఉమకి చాల పెద్దజ్వరం వచ్చింది. అది నా కోసం కలవరిస్తూంటుంది. ఇందాకెప్పుడో వచ్చేయమన్నారు అమ్మగారు' అంటూ పరుగెత్తుకొని వెళ్ళిపోయింది.

'ఎంత అమాయికపు పిల్ల' అనుకుంటూ అటువైపే చూస్తూ నిలిచి నిట్టూర్చాడతను.

## 7

కాలం కళ్ళెంలేని గుఱ్ఱంలాగా పరుగెత్తిపోయింది చాలదూరం.

'తానొకటి తలచిన దైవమొకటి తలచు; తలచినా తలనొగ్గవచ్చు అది మనవాతీత మనుకొని' విధి చేసే పరీక్షలో మాత్రం వివశులైపోతారు మానవులు. అది సాంతం పట్టి బంధించగల బలంకలది కాకపోయినా, పట్టి తప్పక పీడించగలదు కొంతకాలం. కారణం అది కూడా సంకల్పాతీతశక్తిచేత ప్రేరేపబడుటవలన.

మంజా అప్పుడే చదువుతూ చదువుతూ కుర్చీలోనే పడి నిద్రపోయింది. అప్పుడే సరోజినిదేవి

వైద్యశాల నుంచి యింటికి వచ్చింది. ఆమె ముఖం ఎక్కువ అశాంతిమూలాన ముడతలు పడింది. ఏఉమకు పనికత్తెగా యీ యింటిలో 'మంజూ' ఒకనాడు ప్రవేశించిందో ఆ ఉమ అయిదేళ్లినాడు అమ్మవారుపోసి అకస్మాత్తుగా యీలోకం నుంచి నిర్గమించింది. అమ్మ గుండెల్లో అగ్గిరగిల్చింది. ఆ ఉమకోసం తినకన్నా ఎక్కువగా ఏడ్చి, అన్నంమానేసి ఆఖరికి జ్వరపడి నెలరోజులు మంచంమీద ఉండిపోయింది. అప్పుడే 'మంజూ' తన హృదయంలో స్థానాన్ని సంపాదించింది.

తన బిడ్డ పోవటంవల్ల ఏర్పడిన అనంతమైన దుఃఖాగ్నిని 'మంజూ' ప్రేమహృదయం క్రమక్రమంగా చల్లార్చగలిగింది. ఆనాడు తాను బిడ్డలేనితల్లి, యీ 'మంజూ' తల్లిలేని బిడ్డా. కానీ యీనాడో 'మంజూ'కు తను తల్లి, మంజూ తన బిడ్డ అయిపోయింది.

'అమ్మగారల్లా...ఇపుడు 'అమ్మ' అయింది సరోజినీదేవి మంజూకు. ఇంకా ఆమెకున్న ఆశలన్నీ యీబిడ్డపైనే. సృష్టివైచిత్ర్యం సాధ్యాసాధ్యాల నధిగమించిపోయినప్పుడు తనను తానే నమ్మలేడు మానవుడు.

తను నమ్మగలిగింది మాత్రమే సాధ్యమని భ్రమించే మానవునిలో తుదకు నిరాశా, నిస్పృహా, నిస్సహాయతా స్థానాన్ని నెలకొల్పుకుంటయ్.

# 8

'మా మంజూ తెలుసునా? ఇవేళ బడికి వచ్చిందా?' అంటూంటే ప్రతిపిల్లా 'ఏమో లోపలికి వెళ్ళి కనుక్కోరాదూ? ఎంతమందో 'మంజూ'లు వున్నారు. ఎవరో అందులో మాకేమి తెలుస్తుంది?' అంటూ వెళ్ళిపోయింది. అమ్మో! ఇంత పెద్ద.దింట్లోకి ఎట్లావెళ్ళేది. ఎవరన్నా ఏమన్నాఅంటే' అనుకుంటూ బండివిడిచి అట్లాగే ఎదురుమాస్తూ నిలిచిపోయాడు రామూ.

ఇంతలోకే అల్లంతదూరంలో ఓ పిల్ల గబగబా వచ్చినిలుచుని, 'ఏయ్! రిక్షా!' అని కేక వేస్తోంది. అప్పుడే తనయెద్దుకు గుప్పెడుపరకలు రాలుస్తున్నాడు. బండి అడ్డంగా వుండటంచేత కన్పించటంలా సరిగా. 'సరే యీ పిల్లన్నా చెప్పకపోతుందా' అని వెళ్ళాడు రామూ.

'అన్నా!' అంటూ పరుగెత్తుకుంటూ వచ్చింది. ఎవరోకాదు తన 'మంజూ'యే.

'బండెక్కమ్మా! నిన్నుదిగబెట్టి నేను స్టేషన్‌కు పోతాను!' అన్నాడు.

'వద్దులే అన్నాయ్, నేను రిక్షామీద వెళ్తాగా.' అంది.

'ఏమయినాసరే బండెక్కాలిసిందే!' ఎద్దునిలేపి బండికట్టాడు రామూ.

మంజూ! నీకోసం తెచ్చానమ్మా! తిను' అంటూ తన చినిగిపోయిన పంచెలో ఒకమూల భద్రంగా మూటగట్టుకొని తెచ్చిన బటానీలు, శెనగపప్పూ, చేతిలో పోశాడు.

'ఇటువంటి వెధవచెత్తంతా తింటే జబ్బుచేస్తుందన్నాయ్. అయినా యిప్పుడు నేనేమీ తినను' 'పోనీలే జబ్బుచేసేటట్లయితే వద్దులే తినకమ్మా! నీకోసం ఏదో పెద్దతాయం కొనితెద్దామని అనుకున్నా. కాని యింతకన్నా ఏమీ తేలేకపోయినానమ్మా!' అంటుంటే అతనిగొంతు బొంగురుపోయింది.

'అదేమిటన్నాయ్! అట్లావున్నావ్? ఒంట్లో బాగాలేదా?' అంది ఆదుర్దాగా.

'నాలుగురోజులకు యీ దినమే కాస్త లేచి బండికట్టానమ్మా!' అన్నాడు.

'అయ్యో! ఊరికే అన్నాను అన్నాయ్! ఇదుగోచూడు ఇప్పుడే తినేస్తున్నా' అంటూ తినటం ప్రారంభించింది.

'అమ్మగారు బాగుందా అమ్మా!' అన్నాడు.

'ఆ బాగానే ఉన్నారు. అది కాదన్నాయ్. ఎన్నాళ్ళని యిట్లా. ఒంట్లో బాగాలేకపోతే ఎవరికైనా కబురుచేస్తే అమ్మవచ్చి మందిచ్చేదిగా, ఇదేం బాగాలేదన్నాయ్. నేను అమ్మతో అంతా చెప్పేస్తా!' అంది.

'నామీద ఒట్టు, నేను చచ్చిపోయాననుకుంటే నన్నుగురించి ఆమెతో చెప్పు' అన్నాడు.

'మందులేకుండా ఉంటే జబ్బు ఎక్కడైనా నయమౌతుందా?' అంది.

'పేదవాళ్ళ రోగాలకి పెద్దపెద్ద మందులు పనిచేయవు మంజూ!' అన్నాడు.

'రోగానికి ఎవరైనా ఒకటేగా' అంది.

'ఉన్నవారికి వచ్చిన చిన్నచిన్న రోగాలకి కూడా పెద్దపెద్ద మందులు— లేనివాళ్ళ పెద్ద పెద్ద జబ్బులకు బహుశా ఏమందూ దొరక్కపోవచ్చు. ఒకవేళ ఉన్నా పంచకోలకషాయాలు! అంతే. ఉన్నవాళ్ళు జబ్బులు నయమైనా భయపడతారు. ఎందుకంటే వారిప్రాణం విలువైనది కాబట్టి. మరి లేనివాళ్ళో జబ్బు ఎంతపెద్దదైనా, నయమైనా, కాకపోయినా ఏమంత భయపడరు. ఈ మొండి ప్రాణం అంత తేలిగ్గాపోదని వాళ్ళనమ్మకం. దాన్నిగురించి వారికేమీ భయములేదు' అన్నాడు.

నిన్ను చూడకుండా వుండలేవన్నా. అసలీ కాలేజీలో చేరిన తరువాత అదివరకటిలా రోజూ రాకపోగా, ఎన్నాళ్ళకో యీ వేళ వచ్చావ్?' అంది.

'అదిగాదమ్మా! ఇదివరకు బడి నా దారిలో వుండేది కాబట్టి రోజూ వస్తూవుండేవాణ్ణి. ఇదేమో ఎక్కడో ఓమూల విసిరిపారేసినట్టుగావుంది. అందులో కొత్త, ఇక రాకంజేస్తాను. వస్తాగా' అన్నాడు.

'ఇంకా ఎప్పుడన్నయ్యా! మనం మళ్ళీ ఒకచోట వుండేది!' అంది.

'ఓ దానికేం; నీవు డాక్టరమ్మవయి, పెళ్ళి జేసుకుని బిడ్డని కనేసరికి నేను యింకా అప్పటికి నిన్ను విడిచి వుంటానమ్మా! ఎప్పుడూ నీబిడ్డని ఎత్తుకొని ఆడిస్తూ కూర్చుంటా' అన్నాడు నవ్వుతూ.

'పో! అన్నాయ్, నీదంతా...' అంది సిగ్గుతో.

'నిజంగా మంజూ, నేనుమాత్రం నిన్ను విడిచి ఉండగల్గుదునా?' అన్నాడు.

'ఇంక యిటునుంచి సేవన్ కుపళ్ళు అన్నాయ్. దగ్గిరగా ఇక నేను వెళతాలే. యికనుంచీ నీవు రాక పోతే ఊరుకోను చెబుతున్నా. రెండురోజులకైనా కనిపించాలి తప్పకుండా' అంటూ మంజూ బండి దిగింది.

'సరే అయితే వస్తానమ్మా!' అంటూ బండితోలు కొని వెళ్ళిపోయాడతను. కనిపించేమేరవరకు ఆ బండి లోని అన్నను చూస్తూ 'అన్న' ఎంత మంచివాడు. తనను వెతుక్కుంటూ వచ్చి, లోపలకు రాలేక, ఎంత మందిని బయటే నుంచుని అడిగాడో తనను గురించి ఛీ, పాపిష్టిదాన్ని అన్నదగ్గర వుండలేక ... అనుకుం టూండే బండి చాటయి వెళ్ళింది.

అయ్యో! యీ శెనగపప్పు యింకా చేతిలోనే వుందే?' అని చేయి విప్పేసరికి అప్రయత్నంగా ఆమె కన్నుల్లోని బాష్పాలు చేతిలో కురిసినై.

'అన్నయ్య ప్రేమగా తెచ్చియిచ్చినవి తానెం దుకు తినవాలి. పాపం అన్న మనసుకి అనవసరంగా కష్టం కలిగించానని లోలోపల తనని తానే శపించు కుంటూ వెళ్ళిపోయింది మంజూ.

# 9

'అవును, అన్నా! నీవు రోజూ యిట్లా నన్ను బండిలో తీసికెళుతూంటే అమ్మ చూస్తే ఏమనుకుం టుంది. ఇప్పటికే రోజూ పిల్లలంతా వెక్కిరిస్తున్నారు. ఆ రోజున అమ్మగారు పెంచుకుంటానన్నది అని చెబితే—

'సరే మంజూ నీవు తప్పకుండా వెళ్ళమ్మా! నీ అదృష్టం చాలా మంచిది. గొప్పవారింటికి బిడ్డవై పోతు న్నావు.' 'కానీ—నీ అన్నను గురించి ఎప్పుడూ ఎవరికీ చెప్పగూడదు అన్నావు. అయినా మంజూని పెంచు కున్నంత మాత్రాన, మా అమ్మ, అన్నయ్యను ఇక నీవు ఏ మాత్రం చూడకూడదు. మాట్లాడకూడదు. నీ విప్పుడు యిదివరకు 'మంజూ'వి కావు. నీఅన్నను ఎప్పుడూ కలుసు కొనేందుకు ప్రయత్నించకు మన హోదాకు భిన్నం అని అనలేదుగా. ఒకవేళ అన్నట్లయితే వచ్చినా నిన్ను విడిచి నేను పోయేదాన్ని కాదు.'

ఇలాంటి వాదనలతో జరిగిపోయిన చాలా రోజులు మంజూని యీ నాడు డాక్టరీ చదవటానికి తీసికొని పోతున్నయ్. రేపే వెళ్ళిపోతుంది.

తను చిన్నతనంలో చాల గొప్పవాణ్ణి కావాలని ఎన్నెన్నో కలలు కనేవాడు. అమ్మకూ, నాన్నకూ తన పైన ఎంతో వుండేది ఆశ. కానీ—తనకు చివరకు ఆశించినది, ఆశించనిది అకస్మాత్తుగా ఒకనాడు సంభ వించింది. అదీ ఒకందుకు మంచిదే అన్నట్లయింది.

ఆనాడు జీవితదీపమే ఆరిపోయేందుకు ఆఖరి సారిగా నిశ్చయించింది. ఇంత నిరాశల పెనుగాలి తాకిడులకు ఎక్కువకాలం మనలేనని తెలిసికొని.

అటువంటి సమయంలో తనకే అదృష్టంపట్టింది. దాని బలంచేతనే ఇంకా జీవించివున్నాడతడు. ఇక తనకే ఆశా లేదు.

"నావంటి అదృష్టవంతులు ఎవరూ కావద్దు." తనని చూచి తనచరిత్ర విని ఎవరైనా జాలిపడాలని తన ఉద్దేశం కాదు. అలా జాలిపడలేక హేయంగా చూచే మానవుల బారినుండి విస్మృతంగా జీవితయాత్ర గడపటం తన ఉద్దేశం. అందరి హృదయాలూ తనలాగే వుండవనే యథార్థాన్ని తానెప్పుడో గ్రహించాడు గనుక.

'మంజూ! నీమూలంగానే నేను బ్రతికివున్నా' అందుకే నిన్ను దేవుడు కరుణించాడు. నీవు తప్పక గొప్పదానివి కావాలి!' యిలా ఆలోచింపమకుంటూ, ఆవేళ చాలరాత్రివరకు నిద్రపట్టక మేల్కొని గతాన్ని కళ్ళముందు కట్టించుకుని వున్నాడు రాము.

# 10

'అబ్బ! ఎంతజనం, ఎంత కోలాహలం! ఎవరో? ఆ వెళ్ళేది? ఏంచేయటానికో' అని తమలో తాము చర్చించుకొనే ప్రయాణీకుల గుంపుల్ని చీల్చు కుంటూ, అప్పటికే వచ్చివున్న బండిదగ్గరకు వాడా విడిగా పరుగెత్తాడు రాము.

'నిజంగానే ఎంతమంది వచ్చారబ్బా పంపించ టానికి' అనుకుంటూ ఆ జనం చేరిన పెట్టెదగ్గరకు

పోయి నిలిచాడు. ఎవరికోసం తన కళ్ళు వెదుకుతున్నాయో అతను వచ్చేసరికి ఒక్కసారి 'మంజూ' గంతువేసి రాబోయింది. 'వద్దని' వారించాడు.

అంతే. మంజూ ముఖంలో సంతోషం మాయమైంది. 'అమ్మా! మంజూ శ్రద్ధగా చదువుకో!' అని తన దగ్గరకువచ్చి చెబుతున్న అమ్మను కౌగిలించుకొని భావురుమని చిన్నపిల్లలా ఏడ్చింది.

'ఇటువంటి సమయాన ఏడువవచ్చా! పిచ్చి పిల్లా!' అని సరోజనీదేవి ఓదారుస్తుంటే అందరూ 'అబ్బా' పెంపుడు బిడ్డైనా ఎంత ప్రేమ. అలా వుండాలి' అని మెచ్చుకొన్నారు.

కానీ యీ మంజూ గుండెలో గుబులుకొన్న దుఃఖం నిశ్శబ్దంగా మూచి సహించే 'రామూ' కోసమని అతనికి తెలుసు.

వచ్చిన బండి వెళ్ళకవుంటుందా? రైలు కదలబోతూంటే చేతులాడిస్తూ సాగనంపారు. మంజూ చేతి రుమాలు ఊగిస్తూ అన్నవంకే చూస్తూ వెళ్లిపోయింది, కన్నుల్లో ఆణిముత్యాలవంటి అశ్రుమాలికలను నింపుకొని చాల దూరదేశానికి.

# 11

సుఖంగావున్నప్పుడెవ్వరూ కాలము ఎలా గడిచిపోయింది? అనే విషయాన్ని ఆలోచించరు. అత్యంత ఆప్తులనుండి విడిపోయి ఒంటిగా బ్రతికేవారికి యీ కాలంయొక్క విలువ తెలుస్తుంది. అది ఎంత బరువుగా గడిచిపోతుందో వారొక్కరికే అనుభవమైన విషయం.

అయిదు దీర్ఘమైన సంవత్సరాలు అతి సుదూర దేశంలోవున్న మంజూనుండి తనను వేరుచేస్తూ వెళ్లిపోయినవి. మరచిపోలేని ఒక సంఘటన తాలూకు మందచ్ఛాయలు తిన్నావరించి విడువకుండా వున్నవి. అదే చేతి రుమాలు విసురుతూ, కన్నుల్లో నీరుండగా జాలిగా ఆనాడు వెళ్లిపోయిన 'మంజూ'యొక్క మహిత మంగళమూర్తి. ఆమె యీనాడు ఏ రూపంలో తిరిగివస్తుయున్నదో అనే విషయాన్ని గురించిన తర్జన భర్జనలెన్నో చేసుకుంటూ స్టేషన్ చేరాడు రామూ.

అవును ఉత్తరం వ్రాసినా స్టేషన్‌లో కనిపించకపోతే 'మంజూ' తప్పకుండా బాధపడుతుంది. కోపం కూడా వస్తుంది.

ఆఖరి బండి వచ్చింది వెళ్లింది. కాని ఎవరి కోసం వెదుక్కుంటూ వచ్చాడో ఆ వ్యక్తి అగుపించలేదు. ఎంత ఆలోచించినా ఏమీ బోధపడటంలేదు. ఈ అదృష్టహీన అభిశప్తజీవి అజ్ఞాతహృదంతరాల్లో ఆ ఆగంతుక వ్యక్తినిగురించిన అశుభశంక పొడసూపింది. 'ఛా! ఎంత పిరికివాడిని. ఆమెకు శుభాన్ని కలిగించు' అంటూ భగవంతుని ప్రార్థించాడు.

కాళ్ళీడ్చుకుంటూ ఆ చీకటి రాత్రి డాక్టరమ్మ యింటి దాపుకు చేరాడు. ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపించి గుండె లవిసిపోయినవి. అయినా ఉండబట్టలేక బయట ద్వారంవద్ద నిలుచున్న దర్వాన్‌ని సమీపించి దీనంగా'

'అయ్యా! యేమిటి?' అన్నాడు రామూ.

'ఏమైతేనీకెందుకుపోరాదూ నీదారిని? అందరూ పుట్టెడు దుఃఖంలో వుంటే నీకేమో ...' అంటూ విసుగ్గా చడామడా అంటూంటే—తను మధ్యలో కల్పించుకొని—'కోపమువస్తే అడగనులే బాబూ! ఊరుకోలేక అడిగాను. ఎవరికష్టమైనా ఒకటే'నని అన్నాడు.

'ఆఁ...ఏం చెప్పను...డాక్టరమ్మగారి అమ్మాయి అని యింకా చెప్పబోతూంటే...'ఏమయింది? చెప్పు' అని ఆ దర్వాన్ని పట్టి గట్టిగా ఊపేశాడు.

'ఏం చెప్పను...ఆడెక్కడో రైలు...'అంటూ ముఖానికి చేతులు కప్పుకొని చతికిలబడ్డాడు వాడు.

అంతే....ధూమ్యాకాశాలు ఒక్కసారి నెత్తిమీద విరిగిపడినట్లయింది. ఆ కటికచీకటిలో గుండె బాదుకుంటూ 'మంజూ! మంజూ! అంటూ' పిచ్చివాడై పరుగెత్తిపోయాడతను.

# విగ్రహారాధన

శ్రీ జి. టి. అక్కులయ్య దీక్షితులు

భారత సంస్కృతిలో విగ్రహారాధన గలదు. ఆరువేలేండ్లకు పూర్వమున సైతము విగ్రహము లున్నట్టు మొహెంజోదారో భూగర్భ పరిశోధన రుజువుపరచినది. నర్మదలోయ పరిశోధనలనుండి అంతకు పూర్వముననే విగ్రహము లున్నట్టు తెలియవచ్చినది.

మనదేశమందలి విగ్రహ రచనలో నర, వానర, అశ్వ, గజ, సింహ, వృషభ, నాగ, గరుడ ముఖములు గలిగి మానవుల కరచరణములు గల్గియున్నట్లు రూప రచనలుగల పలువిధ విగ్రహములు గలవు. మరియు ఒకటి మొదలు పదితలలు గలిగియు, నూరారు చేతులు తీర్చిన విగ్రహములును, సాధు,క్రూరరూపములుగల విగ్రహములును వివిధాయుధములు, వివిధ వాహనములు, స్త్రీ పురుష అర్ధనారీశ్వరాది ఆకారములు గల విగ్రహములు గలవు. నాలుగు వేదములందును చెప్పబడిన పురుష సూక్తమున వేయితలలు వేయికన్నులున్న పురుషుడు వర్ణింపబడినాడు. శతపథ బ్రాహ్మణము (1-8-16) న మత్స్యరూపమును; తైత్తిరీయారణ్యకము( 1-3-5-7)న కూర్మరూపమును ; ఋగ్వేదము (1-22-17-18) వామనరూపము వర్ణింపబడియున్నది.

విగ్రహములలో స్వామిత్వము, దాసత్వ పరివార కత్వము, సతీత్వము, వాహనత్వము గలవియుగలవు.

విగ్రహముల నిర్మించుటను దెల్పునట్టి శిల్పశాస్త్రములు అనేకము రచితములైయుండినవి. ఆయతత్వం, కాశ్యపశిల్పం, చక్రావళి సంగ్రహం, దేవతామూర్తి ప్రకరణం, బుద్ధప్రతిమాలక్షణం, భద్రమార్తాండం, మనుష్యాలయచంద్రిక, మయమతం, మాతంగలీల, రూపమండనం, విశ్వకర్మప్రకాశ, శిల్పదీపకం, శిల్పరత్నం, మానసారం, మొదలగునవి యిప్పటికిని యున్నవనుచున్నారు. మానసారమను శిల్పశాస్త్రమునకు ఆంగ్లేయ అనువాదము జరిగినది. వీనిలో విగ్రహ నిర్మాణపు కొలతలు, రూపురేఖల రీతులు చెప్పబడినవి.

విగ్రహముల పుట్టుకనుగురించి పలువిధములైన భావము లున్నవి. ప్రాకృతములగు పదార్థములే పురుష విధానమొంది దేవతారూపమున పూజింపబడినవని, ఏ. మ్యాక్డనల్ గారు (హిస్టరీ ఆఫ్ సాన్స్క్రిట్ లిటరేచర్ అండ్ సైన్స్) తెల్పిరి. భారతీయులు అజ్ఞానదశలో యుండి క్రూరములు, భయంకరములు అయినట్టివాటిని జూచి అవి తమకు హానిగల్గించునను భయముచే వాటిని వాటి రూపములను పూజింపుచు వచ్చిరనీ, తద్విధముగ విగ్రహారాధనగల్గినదని మరికొందరు పాశ్చాత్యపండితులు దెల్పిరి. అట్లైన భయంకరత్వ, క్రూరత్వములతో బుట్టియుండినయడల రాక్షస పిశాచవిగ్రహములుపుట్టి వాటి ఆరాధనలు జరుగుచుండవలసినది. అట్లు జరుగుచుండ లేదు. అదియే సరియైన ఊహయైయుండిన బ్రతికిన నాగుపాములను చంపుచు శిలలోతీర్చిన నాగుపాములను పూజింపుచుండరు. కనుక యీవిధమైన నిర్ణయములు అర్థరహితము లవక తప్పదు.

భాగవత పురాణము 1 స్కంధము 3వ అధ్యాయమునందు పృథుచక్రవర్తి, కపిలాచార్యుడు, వ్యాసుడు, మొదలగువారు అవతారమూర్తులుగా చెప్పబడియుండిరి. అవతారమూర్తుల విగ్రహములను పూజించుట మనము జూచుచున్నాము. పెక్కురు మహారాజులు, తత్వవేత్తలు, శూరులయొక్క యలౌకిక గుణములనుజూచి యితరుల కట్టిగుణములు లేకపోవుటచే, యమానుష విషయములనియు, ఈశ్వరాంశజులనియు దలంచి వారి మరణానంతరము క్రమముగ వారియద్భుత చర్యలనుగురించి గాథలుపెరుగుచు వారుదేవత్వమును బొందియుందురు. వారి రూపచిత్రములు విగ్రహములై ఆరాధింపబడుచున్నవని కొందరి భావనగలదు. కాని, యిట్టివారి చరిత్రలనుదెల్పు (పురాణములు) గ్రంథముల రచన అంత ప్రాచీనముగాదనియెదరు. ఇంచుమించు క్రీ॥ శ॥ 500 నుండి 1200 వరకు పురాణ రచనాకాలమై యుండునని హిందూదేశ కథాసంగ్రహ గ్రంథకర్త అభిప్రాయ మొసంగినారు. ఆరువేలేండ్లకు పూర్వమె విగ్రహము లుండినవని తెలియవచ్చుటయు, ఋగ్వేదమున (6 24-10; 7-1-5) ఋషులు విగ్రహారాధన జేసియుండిరనుటకు ఆధారములు గలవనుటవల్లను, మరియు దక్షిణఅమెరికాయందలి పెరూ, మెక్సికో ప్రాంతములందు జరిపిన భూగర్భ పరిశోధనలలో గణేశవిగ్రహము చిక్కినదని పరిశోధకులు తెలుపుట, ఐరోపాఖండమున 'ఓగ్లానది సముద్రములో గలియుచోటునగల అస్ట్రికాన్, అనునగరమున గౌరీశంకర విగ్రహములు తీర్పబడినవని చరిత్రములు తెల్పుట, శివలింగ విగ్రహములు ప్రపంచమున పలుస్థలములలో గలవని పరిశోధకులు దెల్పుచుండుట, భారత పౌరాణిక ధర్మాచరణ మెరుగని యీప్రదేశములలో విగ్రహము

లగపడుచుండుటవలన విగ్రహసృష్టి, చనిపోయినమహాత్ములను పురస్కరించుకొని పుట్టినదిగాదని ధృవపడును.

విగ్రహనిర్మాణములో మహాకాయుడగు గణపతికి అల్పజంతువగు ఎలుకయు, అనంగుడగు మన్మధునకు చిలుకయు, అబలయగు పార్వతికి క్రూరమగు సింహమును, సర్వము దహించు అగ్నికి పొట్టేలును వాహనములుగా నిర్మితములైనవి. ఇట్లు అస్వాభావికములు అనుపమయోగములు అసాధ్యములైన రీతులు గల్గియుండుటయు, "దర్శయేత్ ప్రతిమాముద్రాం కల్పయిత్వా చ సన్నిధిమ్." విగ్రహారాధనవేళలో ప్రదర్శింపవలయునని దెల్పు ముద్రలలో బ్రహ్మముద్ర, విష్ణుముద్ర, రుద్రముద్ర, శివలింగముద్ర, దశావతార ముద్రలు మరియు ఇతర దేవతలను, వాహనములను, పూజోపచారములను దెల్పు ముద్రలు అనగాచేతితో చూపు సైగలు విధించి యుండుటయే గాక ఆయా విగ్రహారాధనలో ఆయా దేవతలకై సంకేతముగా కల్పించిన ముద్రలనే ప్రదర్శింపవలెనని విధించియుండుటయు ఆరాధనాకాలమందు పోయు ముగ్గులు కేవలము అలంకారములే గాక "తత్త్వమండలము" మొదలైన పేర్లు గలిగిన ముగ్గులు పోయవలెననుటయు వాటిలో తత్త్వము లెరింగించు లక్షణములు గలిగియుండుటయు, ఆరాధనలో అర్చన ఉపచారము లనేక విధములు గల్గియుండుటయు, యొక్కొక్క కోరిక గలవారు యొక్కొక్క రూపము గల దేవతనారాధింపవలెనని జెప్పియుండుటయు గలదు.

శిల్పమునుగురించి దెల్పుచు, సంస్కృతిచిత్రము అనగా జీవితమును పరిశీలించిన పూర్వజ్ఞానము ననుసరించి మూర్తి కల్పన జేసుకొనుట అనాదినుండియు భారతీయ, శిల్పమునకు ముఖ్యసూత్రమైన పునాది. భారతీయ శిల్పములో బాహ్య ప్రకృత్యనుకరణకు ప్రయత్నములేదు. భారతీయ శిల్పమెప్పుడును సర్వానుభూతి సంగ్రహదృష్టి స్వరూపము. ఈ దృష్టి ప్రథమములో యుద్భవించి సహజముగా రాను రాను అత్యంత సమగ్రమైన శాస్త్ర రూపము దాల్చినది యని శిల్పములలో అధికానుభవము పొందిన ఆనంద కుమారస్వామిగారు వ్రాసిరి. కనినుండి భారత సంస్కృతికి చెందిన విగ్రహములు ఇప్పుడు మనలోని కొందరు భావించు విధముగ పుట్టినవిగావని దెలియ నగును. అయితే మరేవిధముగ విగ్రహరూపరచన, ఆరాధనగల్గినదను ప్రశ్న యుదయించును.

మానవులు అనాగరికదశలో నుండిన మొదటి రోజులలో వారికి భాష లేకుండెననియు ఆస్థితిలో వారి మనోభావములను ఒండొరులు సంజ్ఞ (సైగ) లతో తెల్పుకొనుచుండిరని పరిశోధకులు, తెల్పుచున్నారు. ఆగమశాస్త్రములలో దెల్పినముద్రలు, నాట్యశాస్త్రములలో దెల్పిన అభినయముల నన్నిటిని ఏక మొనర్చి ప్రదర్శించినంతట భారతీయ ధర్మ సంస్కృతి వ్యవహారము లన్నిటిని నోటమాటలేకనే చేసైగలతో సాక్షింగింప నగునని తెలియును. భరతనాట్యమును చూచిన వారికి ఈవిధానము గొంత పరిచయమై యుండును.

ఎదుటనుండువారి మనోభావములను ఒండొరులు తెలిసికొనుటకు ఈ హావభావము లనుకూలించినవి గాని పరోక్షమున నుండువారికి ఈ విధానములు ఉపయోగింపకపోయినవి. అందుచే వారు మరొకపద్ధతి అవలంబించిరి. దానినే బొమ్మలవ్రాత యనుచున్నారు. ఇదియే శిల్పము. దీనినుండియే అక్షరసమామ్నాయము పుట్టినదని పరిశోధకులు నిర్ణయించిరి. 'మనిషి' అని తెల్పుటకు, 'అజీలియన్' శిలల చిత్రములలో యొకనిలువు గీత దానిపై రెండు చిన్న అడ్డగీతలు చిత్రించబడినవి. చీనాదేశపు భాషలో దేవుని 亓 ఈ గుర్తుచే పూర్వమున వ్రాయుచుండిరి. ఇప్పుడు ≟ ఈ విధముగ వ్రాయుచున్నారు. చీనాదేశమువారి లిపిచూచిన చిత్రలేఖనము (బొమ్మలవ్రాత) అక్షరలిపికి మూలమని తెలియగలదు.

శిలాచిత్రములందు కథ వస్తువిన్యాసముగూడ సంక్షిప్తసంగ్రహముగ చూపబడినది. ఇట్లు సంగ్రహముగుట వలన విషయములను చాలవఱకు వదలివేయుటయేగాక సముదాయబద్ధులై సాంకేతికపద్ధతి నుపయోగించిరి. ఇట్లు సంకేతముల నేర్పరచుటవలన చిత్రితమైన కథావస్తువు ఆ కాలమువారికి సుబోధకమైనను ఏ విషయమున కేవిసంకేతితము (గుర్తు)లో తెలియక ఇపేటి వారికా చిత్రరంగములు దురవగాహములైనవని పరిశోధకు లనుచున్నారు.

బుద్ధశిల్పములను పరిశీలించి అందలి చిత్రములలో ఉపయోగించిన సంకేతములనుగురించి దెల్పుతూ బుద్ధజననమునకు పాత్రిశ్నలో బుద్ధపాదములు లేక పద్మము, బుద్ధుని సర్వభోగ వర్జనమునకు రాజులేని వట్టిజీనుతో నుండు గుఱ్ఱము, బుద్ధుని ధర్మబోధకు బోధి వృక్షముము, దానిక్రింద బుద్ధపాదములు, బుద్ధుని మొదటిబోధకు చక్రమును దానిక్రింద మృగములను, ఆయావిషయములను బోధించు సంకేతములుగా చిత్రించినారని పరిశోధకులు తెల్పినారు. ఇట్లు సంకేతము లేర్పరచుకొని చిత్రరచనలు జేసియుండుటచే వీటిని జూచి ఊహలతో విషయములు నిర్ణయించుట మిగుల ప్రమాద భరితమగును.

"దేవాలయములు మొదలగునవి నిష్ప్రయోజన మనుట సులభమే. ఆధునికకాలమున ప్రతిభాశాలురు

నిట్లు చెప్పుచున్నాడు. కాని విగ్రహముల నారాధించు వారికిని ఆరాధింపనివారికిని పెక్కువిషయములలో భేద మున్నదని జనులు బాగుగా గుర్తింపవలయును. విధులు కొన్ని మతసర్మములతో నన్వయించుటచే ఆయా మతసర్మముల నవలంబించువారలకు ఆరూపములు దేనికి సంబంధములై యున్నవో ఆ భావముల స్మరింపజేయునని స్వానుభవముపొంది ఖండాంతరములలో అఖండ గౌరవమొందిన స్వామి వివేకానంద 'కర్మయోగము' అను గ్రంథమున దెల్పిరి. అందరికిని స్వానుభవములో ఇది నిజమని దెలియును.

పాఠశాలలో భూగోళమును బోధించుటకై గోళాకారముగల బొమ్మ నొకదానిని ఉపయోగించెదరు. దీనికి గ్లోబ్ (Globe) అనిపేరు. ఇది భూసాకారములలో నిర్మించిన సంకేతము. అయినను పాఠశాల ముఖ మెరుగని నిరక్షరాస్యునకు దీనిని చూపి ఇది యేమని అడిగిన ఏమి చెప్పగలడు. బొమ్మ అనిమాత్రం చెప్పగలడు. లేక మరికొంత తెలివిగలవాడైయుండిన ఇది పచ్చనిబొమ్మల తయారీలో చేసిన సుమ్మిడిపండన వచ్చును. త్రిప్పితిరుగుటను చూచిన యిదేవో (మిషన్) యంత్రము అనగలడు. దీనినే విద్యార్థికి చూపి ఇది ఏమని అడిగిన ప్రపంచము గోళముగా యుండుటను దానిభ్రమణమును, అందులోనికొండలు నదులు దేశముల రూపములను వివరించిచెప్పి ఇది భూగోళమునకు సంకేతమనును. కనుక దేని కేది సంకేతమో తెలిసికొనిన గాని విగ్రహరూపరచనకుగల కారణములు తెలియవు. పాఠశాలల నెఱుంగని నిరక్షరాస్యునివలె మనము దేవతావిగ్రహములను విమర్శించుచున్నాము. తాంత్రికాగమశాస్త్రములలో నొకటగు వాతులాగమ మను గ్రంథమున తత్త్వభేదపటలమున ఈశ్వరుడు ధరించు ఆయుధముల ప్రశంసగలదు. అందు త్రిగుణములకు త్రిశూలము, కర్తృత్వమునకు పరశువు, ప్రతాపమునకు ఖడ్గము, అభేద్యతకు వజ్రము, విఘ్నలకు నాగము, మాయకు పాశము, అనుగ్రహమునకు అభయహస్తము, వివర్తములకు అంకుశము, నాదమునకు గంట, సర్వసంహారశక్తికి అగ్ని, ఈశ్వర విగ్రహమున ఆయుధములుగా జూపబడినవని వివరింపబడినది. అనగా యీ భావము గల్గించుటకు వీటిని సంకేత మొనర్చి ఈశ్వరునిచే ఆయుధములుగా ధరింపజేసినారనుట తెలియనగును.

ఇటువలెనే విగ్రహములందలి శిరస్సులు వాని నవరసభావములు నేత్రములు చేతులు చేష్టలు ఆయుధములు, వాహనములు అన్నియు వివిధ విషయములను తెల్పు సంకేతములై యున్నవి.

విగ్రహారాధనను ఎక్కువగా ప్రతిపాదించిన గ్రంథములు తంత్రశాస్త్రములు. వీనికే ఆగమశాస్త్రములను పేరు సైతము గలదు.

ఈ తంత్ర, ఉపతంత్రశాస్త్రములు పెక్కులుండినవి. 'సమ్మోహనతంత్ర' మనెడి గ్రంథములో శాక్తేయప్రతిపాదితములైన తంత్రములు 64, ఉపతంత్రములు 327, శైవ ప్రతిపాదితములు 32, వాని ఉపతంత్రములు 127, వైష్ణవ ప్రతిపాదితములు 75, వాని ఉపతంత్రములు 205 ఉండినట్లు చెప్పబడినది. మరియు బౌద్ధాది ప్రతిపాదితములును ఉండినవి. వీటి రచన 2000 ఏండ్లకు పూర్వమనుచున్నారు. వాటిలో ఏకొద్దిపాటి గ్రంథములో ఇప్పుడు లభ్యమగుచున్నవి. అవి సైతము అసంపూర్ణములుగనే యున్నవి. వాటిని చదివి సంకేతముల విషయము తెలిసిన వారుగూడా మనలో చాల తక్కువని తెలియును. ఈ స్థితిలో విగ్రహముల రూపరచనలను విమర్శింప బూనుచున్నాము.

ఒకే దైవమును భావించువారిలోనే ఈశ్వరునకు ఏ ఆకారము రచింపని లింగము, గౌరీశంకరుడు, అర్ధనారీశ్వరుడు, యోగమూర్తిగ దక్షిణామూర్తి, నాట్యభంగిమలలో నుండు నటరాజు, పంచముఖుడు, త్రిముఖుడు, గల విగ్రహములున్నవి. విష్ణువునకు ఏ ఆకారము రచింపని సాలగ్రామము, దశావతారరూపములు, నిలుచున్న వెంకటేశ్వరుడు, కూర్చున్న లక్ష్మీనారాయణుడు, పరుండిన అనంతపద్మనాభస్వామి, మొదలుగాగల విగ్రహములు, స్త్రీ దేవతలకు యిదే విధముగ అనేకవిధ రూపములు గల విగ్రహములు కల్పించి శిలలో శిల్ప మొనర్చినారు. ఇట్లు ఒకమూర్తిని పలువిధములైన రూపములతో, శిల్పమొనర్చుటకు అనేక భావములను దెల్పుటకొఱకై కల్పించిన సంకేతములే కారణమగుచున్నవి. కనుక విగ్రహ నిర్మాణము అనేక భావములను ఎదుట జూపింపగల సాంకేతిక సముదాయమనియు, ఇది మొదట బొమ్మల వ్రాతగా బుట్టి శిలలో శిల్పమొందివిగ్రహములు, ప్రతిమలు అనబడుచున్నవని తెలియనగును.

ఏ సంకేతము యే విషయబోధనకై కల్పింపబడినదో తెలిసికొనిన కొన్ని క్షణములలో ఒక విగ్రహమునుండి అనేక విషయములు గ్రహింపవచ్చును నటరాజనృత్యము ప్రపంచ సృష్టిహేతుభూతమైనది, నటరాజ విగ్రహమును చూచి ఎడ్వర్డు కార్పెంటర్ (Edward Carpenter) మొదలగు పాశ్చాత్య పండితులు సైతము విస్మితులయి వ్రాసిన వ్రాతలు సాక్ష్యమిచ్చుచున్నవి. భారతీయ సంస్కృతి వారి ఆచార వ్యవహారము లెరుంగని పాశ్చాత్యులే విగ్రహములనుండి ఇట్లు విషయములను గ్రహించుచుండ భారతీయులు ప్రయత్నించిన ఇంకను ఎక్కువగా గ్రహించగలరనుట సువిదితము. అనేక విషయము లెరింగించు సాంకేతిక సముదాయముగా విగ్రహము రూపొందించబడి కట్టెదుటనుండి కనుమాపుతో గ్రహింపగలదగుటచే మిగుల సులభసాధ్యమగును.

# దాంపత్యం

శ్రీ జి. కె. మూర్తి

## పాత్రలు:



| | |
|---|---|
| రఘు | శారద |
| సుందరయ్య | నరసమ్మ |
| శంకరయ్య | చంద్ర |

★

## రంగము: 1

** సుందరయ్య ఇంట్లో వసారా. గోడ దగ్గరగా ఒక బెంచీ. మధ్యనే ఒక బల్లా, దానిచుట్టూ మూడుకుర్చీలు, టేబిలుమీద పూలు అల్లిన టేబిలు గుడ్డ, పైన రెండు బౌండు పుస్తకాలు, ఆనాటి తెలుగు పత్రికా వుంటాయి. శారద బెంచీమీద పడుకొని ఏదో ఇంగ్లీషు నవల చదువుతుంటుంది; సుందరయ్యగారి పెద్దమ్మాయి; వయస్సింకా ఇరవై దాటలేదు. ఇంట్లోంచి నరసమ్మగారొస్తారు. పూలదాన్‌లో క్రోటను రెమ్మలూ, పూలూ పేర్చి బల్లమీద ఉంచుతుంది. ఇల్లంతా అలంకరింపబడకపోయినా శుభ్రంగా ఉంటుంది. సమయం మధ్యాహ్నం రెండు గంటలు చూపిస్తుంటుంది గోడనున్న గడియారం.

నరసమ్మ : అమ్మాయ్! శేవనం, తలదువ్వుకోవడం ఏమయినా ఉందా...లేక ఆ వెధవ నవలపట్టుకొని ఏడవడమేనా?

శారద : వెధవ నవలకాదమ్మా! నాన్నగారు చదువుతున్నదే! (లేచికూచుంటుంది)

నర : మా దొడ్డనాన్నగారు! కావాలని మీ అందర్నీ యిలా తయారుచేస్తున్నారు... తరువాత చదువుకొందువుగాని లే—సంగతీ సందర్భం లేకుండా ఎప్పుడూ పుస్తకాలేనా? అయితే చదువూ, లేకుంటే రాతా! మరేం అక్కర్లేదూ?

శార : అబ్బ! ఏమిటమ్మా! పనులన్నీ తీరినతరువాత చదువుకుంటున్నా తప్పేనా?

నర : నిన్ను చదువుకోవద్దు అనలేదు నేను...అన్నా మానతావా నువ్వు!...కానీ...వాళ్ళు వచ్చే వేళయిందీ, పుస్తకం కొంచెం మూసి, ఆ తల కొంచెం దువ్వుకొని చీరమార్చుకోమని అంటున్నాను...అంతే!

శార : మీకు మతులుపోయాయమ్మా?

నర : పోతేపోయాయిలే!...నువు ముందువెళ్ళు!

శార : నోరుమూసుకొని, మీరుచేస్తున్న ఈ పెద్దరికాన్నంతా చూస్తూ ఊరుకోమంటావు! అంతేనా?

నర : ఏమిటమ్మా! ఆ చేయరానిపనులు మేం చేస్తున్నది?

శార : తెలియనట్టు అడగడమెందుకు?...నీ మనస్సుకి తెలియదూ?...యిప్పుడెందుకమ్మా పెళ్ళి?

నర : మరి?

శార : రోజులు కలిసొస్తే...

నర : ఆ! యీజన్మలో కలిసిరావనమే!...రోజు రోజుకీ ఎలకతోకవాటం తేలుతూఉంది సంసారం!

శార : అదితెలిసుండీ మరి నాన్నగారి నలా వేధిస్తావేం?

నర : నేను వేధిస్తున్నానా?...సాటివారిలో తలెత్తి తిరగలేకుండా నేను చిమిడి పోతుంటే...నువ్వా ఆమాటే అన్నావ్?

శార : ఎందుకు తలెత్తి తిరగలేకపోవడం? మనం ఏం అపచారంచేశామే?

నర : మనఖర్మ!...లేకపోతే మీ ముగ్గురిలో ఒక్కరికైనా పెళ్ళికాకపోవడం ఏమిటి? యింట్లో నామాట ఏం నిలుస్తున్నది గనుక... అనేవాళ్ళు నన్నంటారు!

శార : అమ్మా! అలాఅంటే నేనొప్పుకోను. మేమేమయినా హద్దుమీరి నడిచామా చెప్పు?...మాకుమాత్రం తెలీదూ...మావల్ల మీరు తలదించుకోవలసిన పనులేమయినా చేశామే! ఎందుకలా అంటావ్?

నర : దేవునిదయవల్ల యింతవరకూ లేదు ఏమచ్చా!

శార : నీబిడ్డలమీద నీకే నమ్మకంలేదమ్మా!...మాకు వయసొచ్చింది...నిజమే!...అది నేరమా?... నేరమేఅయితే పెళ్ళి దానికి పరిహారమా?... ఈ ఆడబ్రతుక్కి ఒక్క వివాహమేనా పరమావధి?......అందుకోసమేనా ఈజన్మ ఎత్తింది?

నర : ఒసే, కాస్త మెల్లగామాట్లాడు...మీ నాన్న గారి చెవిలోపడితే ఇకేవుంది...అసలే శోంగ పెట్టుకున్నారు.

శార : అతెంగే ఒద్దంటున్నా! పెళ్ళి మాకుగాని మీకుకాదుగా...వద్దమ్మా...మాకిప్పుడు పెళ్లి అక్కర్లేదు!

నర : బాగుంది! బాగుందేవ్!... అలాఅయితే లోకంనోరు మూయ్యగలమటే?

శార : లోకం! వెగవపిరికిలోకం! ప్రతియింట్లో విషయం లోకానికే కావాలి!...ఎవరెలా చస్తే దానికేం?...అణుమాత్రం సహాయం, సానుభూతి చూపించలేదు కాని అభాండాలు విసరగలదు. ఎందుకమ్మా మనకాభయం నా విషయమై మీరు తలబ్రద్దలు చేసుకో వద్దు! కట్నాలకోసం తీర్చలేని ఋణాలుచేసి చితికిపోవద్దు! ఏమవుతుందో చూద్దాం.

నర : ఇలా మాట్లాడి కొంపకి అగ్గిపెడ్తావ్. నాకు తెలుసును! నువ్వల్లాంటిదానివే!

శార : నువ్వేమయినా అనమ్మా!.....ఈ వధవ కట్నాల పెళ్లి నాక్కర్లేదు. గొంతుక్కి ఉరిపోసుకు చచ్చిపోతా గాని యిందుకు ఒప్పుకోను!

నర : పిచ్చిమాటలు మాట్లాడకు. ఈ రోజుల్లో కట్నం లేకుండా వరుడెవడొస్తాడే?

శార : రాకపోతే పోనీ...ఇలానే ఉండిపోతా!... నాకేం పెళ్లి కాలేదని చింతలేదు.

నర : బాగున్నాయే మాటలు?...మే మందరం కావలిసే చేసుకున్నామటే?...మరీ వొచ్చిందమ్మా కాలం!

శార : మీ రోజులు వేరమ్మా! చంకలో చంటి పిల్లల్ని పెట్టుకొని పెళ్లి చేసినట్టు ఈ రోజుల్లో ఎలా అవుతుంది? ఆ పని ఏనాడో చెయ్యవలసింది మీరు...యిన్నేళ్లు ఎదగ నిచ్చారు, చదువు చెప్పించారు... ఇంకా చంటిపిల్లలమనే భావిస్తున్నారు. మేమేమి బొమ్మలమా? ముక్కూ, మొగ మెరుగని వాణ్ణెవణ్నో పట్టుకొచ్చి కట్నా లిచ్చి కట్టబెడ్తామంటే మాట్లాడకుండా ఊరుకోడానికి?

నర : చదవేస్తే ఉన్నమతి పోయిందట...మర్యాదా మంచీ తెలిసినవాళ్లు అనవలసినమాట లివా?.. నాన్న విన్నారంటే వీపుబ్రద్దలు కొడ్తారు... భద్రం.

శార : ఏం భయంలేదు. అందుకైనా సిద్ధమే! కాని కట్నంయిచ్చి అల్లుణ్ణి తెస్తామంటేమాత్రం.. ఇప్పుడే చెప్తున్నా నేనొప్పేదిలేదు.

నర : నా దగ్గర అంటే అన్నావుగాని, ఆ కూతలు ఆ మంకలదగ్గర, కుయ్యకు! వాళ్ళా ఆ

కూతురే కూస్తే నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకోవాలి! యిదుంది బ్రతుకు!

శార : వాళ్లకి మాత్రం విచక్షణ లేదూ! వాళ్లకి మాత్రం మంచి చెడూ విభేదం తెలీదూ? నేను చెప్పాలా అమ్మా! పాపం పాలుతాగే చంటిబిడ్డలా! ఒక్క రెక్కమీద వొచ్చే జీతం కుటుంబ పోషణకే చాలకపోతుంటే ఈ పెళ్లిళ్ల కోసం వేలకు వేలు ఖర్చు చెయ్యడం! ఉంటే చెయ్యండి! ఒద్దన్నవారెవరు? అప్పులకు పరిగెత్తేకూడా మేం నోరు కదపకూడదేం?

నర : నిజమేనే! నీవన్నది నిజమే! లోకంలో అందరూ ఉంటేనేనా పెళ్లి తలపెడ్తున్నారు? రోజు లెల్లప్పుడూ ఈలాగే ఉండిపోతాయటే?

శార : అదే నేనూ అంటున్నది. రోజులు మారి నాలుగు డబ్బులు చేతిలో ఉంటే అప్పుడే తలపెట్టండివన్నీ!

నర : చాల్లే! నీతో వాదించలేను...నీ ఈడువాళ్లు అప్పుడే నలుగురు బిడ్డల తల్లులై సంసారాల్ని దిద్దుకుంటుంటే......

శార : ఇతర్ల విషయం సాటితేస్తా రెందుకు? అందరిలా మనం వున్నామా? మన విషయం మనది. ఎవరిలోనో మన కెందుకు సాటి? మనకి చెందిన సమస్యల్ని మనం మనకు నచ్చినట్టు ఎదుర్కొంటాం!..అంతేగాని లోకాని కోసం అని...

నర : సరేలే! నువ్వెళ్ళు!...నీతో మాటకిమాట మొదలెడితే ఈ రోజు పనులైనట్టే!...లే... వెళ్ళు.

శార : కాదమ్మా! నామాట విను. ఈ యేడాదితో నా చదువై పోతుందా...నేను ట్రైనింగుకి పోతే నాగొడవుండదుగా!...యిక...

నర : ఒసేవ్! చెఱకు తీపని ఎవరైనా మెచ్యు వవుల్తారటే! దేనికైనా ఒక హద్దూ పద్దూ ఉండక్కర్లే?...ఈ వెధవ చెవులకే నా బుఱ్ఱమీది వెంట్రుకలు లేచిపోతున్నాయి! యిక ఉద్యోగంకూడానా? ... ఊరొదిలి పోవాల్సిందే! అయినా యింటా వంటా లేని పనులు చేస్తానంటావేమే?

శార : అలాఅయితే మమ్మల్ని చదివించడంలో మీ ఉద్దేశం ఏమిటమ్మా?

నర : ఉద్యోగాలుచేసి ఉళ్లేల్తారని!...నన్నడిగి చదువుకున్నట్టు...వెళ్లు! వెళ్ళు! మాటలకేం? నాన్నగారు వచ్చేవేళయింది. ఆయన నామీద విరుచుకుపడ్తారు యింకా సిద్ధంగా లేరా అని...అన్నింటికీ నేను దొరికాను దవగ్గా!

శార : బాగున్నాయమ్మ నీమాటలు...యీమాత్రానికే...

నర : అదుగో ఆయన వొచ్చేశారు.

శార : ఈ వేళ వేగం వచ్చేశారే నాన్నా!

సుంద : (ప్రవేశిస్తూ) ఏమిటె తల్లీకూతురూ మహా నింపాదిగా కూచున్నారు...ఏమిటో విశేషం వుంది!

నర : అబ్బే! ఏమీ లేదు...మీరు త్వరగా వచ్చేశారని...

సుంద : మరి రాకపోతే ఎలా చెప్పు?...వాళ్ళొస్తున్నారా...ఏమమ్మా శారదా!...ఏమిటలా చూస్తున్నావ్?...ఏమిటే?

నర : ఏమీ లేదండి!

శార చెప్పడానికి జంకుతావేమమ్మా? చెప్పూ!

సుంద ఏమిటే?

నర ఏమీ లేదన్నాగా! ... దాని మాటలకేమిటి లెండి!

శార అమ్మా! అలా నువ్వు కప్పిపెడితే లాభం లేదు; నీకు చెప్పడానికి భయమైతే...

నర భయం దేనికే! నువ్వెళ్ళు! చెప్తాలే!...వెళ్లు.
[శారద లోపలికి పోతుంది. సుందరయ్య కోటు విప్పుతాడు]

సుంద : ఏమిటే సందడి?

నర : దానికి వికారం ఎత్తింది...అంతే!

సుంద : అంటే?

నర : పెళ్ళి పెటాకులూ ఒద్దట!...యింకా చదువుకుంటుందట!...ఉద్యోగంచేసి మనల్ని ఉద్ధరిస్తుందట!

సుంద : మంచిదే!

నర : మీరలా అంటారని నాకు తెలీదూ? నా కొచ్చిందికాదు చావు!...

సుంద : నరుసూ నామాట వింటావా?

నర : అందరి మాటలూ వినడానికే నేనున్నాను. నా మాట పాటించే నాథుడే లేడు!

సుంద : అబ్బ! చెప్పేంది వినవు పూర్తిగా...శారదకి ఈ సబంధం ఖరారైనట్టే.

నర : ఆ! నిజమే!...హాస్యమాడుతున్నారా?

సుం : నిన్ను చూస్తే హాస్యమాడాలనే వుంటుంది మనసులో!

నర : చాల్లెద్దురూ...కట్నం విషయం?

సుం : అదే యింకా ఏమీ తేలలేదు.

నర : కట్నం యిచ్చారంటే ఉరిపోసుకుంటానంది తెలుసా?

సుం : ఎవరు? శారదే!...అదెప్పుడు?

నర : మీరొచ్చేటప్పటికి ఆ గొడవే జరుగుతుంటే!

సుం : హుఁ...

నర : ఏం అలా అన్నారు?

సుం : పసివానికున్నంత వివేకం యిలిస్ల కెందుకు లేదా అని!

నర : ఆచారం అలా ఒస్తుంటే ఒద్దనగలం? మీకు మాత్రం మా నాన్న యివ్వలేదూ?

సుం : ఆ!...అదంతా నేనే తివేశాను. నీకూ పెట్టారుగా బంగారం ఆ కట్నంమీద వెయ్యి హెచ్చువేసి!

నర : అదంతా మా వాళ్ళింటికేగా నేను పట్టుకుపోయింది! మా వాళ్ళంటే మీకు కోప మొస్తుందేమో!

సుం : కోపం కాదు...ఎంతయినా పుట్టింటి అభిమానం పోతుందీ?

నర : సరేలెండి...కుర్రవాడి విషయాలు చెప్పండీ! మంచి సంప్రదాయమేనా?

సుంద : కాకుంటే మనకెందుకు?...మంచి సంప్రదాయమే! ఒక్కడే కొడుకు.. ఆస్తిపాస్తులు లేవనట్టే...మొన్ననే పాతికేళ్ళు దాటాయి. ఎమ్మే పాసయి కాలేజిలో పనిచేస్తున్నాడు ...మూడువందల జీతం...ఒక్క ముసలితల్లి మాత్రం వుంది. శంకరయ్యగారి అన్న కుమారుడు.

నర : శంకరయ్యగారా?...ఆయనే కదూ...మన చంద్రా...

సుంద : ఆ! ఆ! వాళ్ళమ్మాయి మన చంద్రా ఒక్క క్లాసే చదువుతున్నారు.

నర : మంచి సబంధమండీ! తప్పిపోనివ్వకండీ!

సుంద : మన చేతిలో ఏముందీ—ప్రయత్నిస్తున్నా ...నాకు నచ్చా డన్నివిధాలా!...కానీ...

నర : ఏమిటి సంశయం......శంకరయ్యగారికీ మీకూ బాగా పరిచయం ఉందిగా!

సుంద : అవుననుకో!...కాని కట్నం విషయమే... ఏమీ తేలలేదు!

నర : ఇంత మంచిసంబంధం ఒదులుకుంటామండీ! ఎలా అయినా సరే ఈ యేడు పెద్దమ్మాయి పెళ్ళి అయి తీరవలసిందే!

సుంద : ఒక్క నీకే ఉంది తొందర!...నాకు లేదను కుంటున్నావు కదూ ఈ విషయంలో!

నర : అదికాదండీ! మన పరిస్థితుల్ని చూచి అలా అంటున్నదిగాని...దానికి మాత్రం మొగుడూ పిల్లలూ అన్న ఆశలేదనుకుంటున్నారా? దానితోటివాళ్ళు అప్పుడే సంసారాలు దిద్దుకుంటున్నారు...దానివేపు చూస్తుంటే..

సుం : నరుసూ! నాకివేమీ తెలియదనుకున్నావా? నేనేం మనిషినికానూ?...యేం చెయను... నీకు తెలీనిది ఏముందని? నాస్వంతంకోసం ఒక్కరూపాయికూడా తీసుకోకుండా తెచ్చిన జీతం నీచేతిలో పోస్తున్నాను. నీ పెరుగని ఆదాయం ఉందా చెప్పు?

నర : నెలనెలా అప్పులు చెయ్యాడమే తప్ప దమ్మిడీ మిగిల్చే ఆస్కారం లేకుండాపోయింది. ఈ వడ్డీలకే తూగలేకపోతున్నాం. ఎన్నాళ్ళో ఈ దరిద్రం?

సుం : ఏంచెయ్యమంటావునన్ను? ... నా మనసులో ఎలా ఉందో తెలుసా?...నీ ఒంటిమీద ఒక్కనగకూడా ఉంచలేక పోయాను. నేను యివ్వటం పోయింది— నీదగ్గర్నుంచి ఒక్కొక్క నగ తాకట్లపాలు చేశాను. అవి విడిపించే ఆస్కారం కూడా కనిపించదు.

# దాంపత్యం

నర : పోతే పోతాయి! మీరు విచారించకండి! ఒంటినుంటే మాత్రం కడుపునింపుతుందా? అవసరాని కక్కరకు రానిది ఉంటే మాత్రం లాభం ఏమిటి? మీరేం దుబారా చేశారు గనుకనా? ఇంటికోసమేగా వాడారు! ఈ వేళ కాకపోతే రేపొస్తాయి. దానికి విచారం ఎందుకు?

సుంద : విచారం కాదు నరసూ! ఆ మిగిలిన కొంచెం పల్లం అమ్మితేగాని పెద్దమ్మాయి పెళ్ళికాదు. అదే ఆలోచిస్తున్నా! ఇక వచ్చే ఆ గింజలు కూడా కరువైపోతాయి. అంతిటిలో మన బాధలు తీరితే బాగానే ఉంటును. ఇంకా యిద్దరున్నారు. తయారుగా!...ఏమిటో నరసూ! బ్రతుకింత బ్రష్టలైపోయి ఇంత చేతకానివాడినయిపోతానని ఏనాడూ అనుకోలేదు.

నరు : మన దినాలు బాగాలేవు. ఊరుకోండి!...ఈ కష్టాలు కలకాలం ఉండిపోతాయా? మీరిలా అధైర్యపడకండి! ఇన్ని యిబ్బందుల లోనూ ఇంట్లో లోటు రాకుండా చూస్తున్నారు. ఏ విషయంలోనూ...

సుంద : ఆ! చూస్తున్నాను! ఎందుకొచ్చిన మాటలే! వెళ్ళు! వెళ్ళు! మన కష్టాలు ఎప్పుడూ ఉన్నవే. వాళ్ళు వచ్చేటప్పటికి కాఫీ కావలసి ఉంటుందేమో చూడు. అన్నట్టు వాళ్ళిద్దర్నీ కూడా కొంచెం తల లవి దువ్వుకుని మంచి బట్టలు కట్టుకోమని చెప్పు...ఏమి కానీ...పైన భగవంతుడున్నాడు.

నర : ఇప్పుడే వస్తారా? ... అయితే యింత సేపూ చెప్పరేం? ఇల్లంతా అపవిలా వుంది. ఒసే చంద్రా! (అని పిలుస్తూ లోనికి పోతుంది, సుందరయ్య కుర్చీలో చేరగిలబడి ఆలోచిస్తూంటాడు. శారద మెల్లగా వచ్చి తండ్రి వనక నిల్చుంటుంది.)

శార : నాన్నా!

సుంద : (తల తిప్పకుండానే) ఏమమ్మా!

శార : ..............

సుంద : ఏమిటమ్మా!...చెప్పు!

శార : నేనింకా చదువుకుంటా నాన్నా!

సుంద : అలాగే నమ్మా!

శార : ......అమ్మ మీతో యింకేం చెప్ప లేదూ?......

సుంద : అన్నీ చెప్పిందమ్మా!......అలా కూచో. (కుర్చీలో ఎదురుగా కూర్చుంటుంది.) నీకెందుకమ్మ యీ గొడవలన్నీ! చూడూ! పెద్దవాళ్లం మేమున్నామా? మా బాధలేవో మేం పడ్తాం...నీవేం బాధపడకు!

శార : అది కాదు నాన్నా!......

సుంద : ఏమిటమ్మా?...చెప్పు...సంకోచించకు!

శార : ఈ ఏడాదీ అయిపోయినతరువాత ట్రైనింగుకి పోతా నాన్నా! ..ఉద్యోగం చేసి...

సుంద : సంపాదించి యిల్లు గడపడంలో సాయం చేద్దామని వుందా?

శార : అవున్నాన్నా!

సుంద : అంతకన్నానా అమ్మా!...కొడుకులు లేని లోటు నీవైనా...

శార : కోపమొచ్చిందా నాన్నా?

సుంద : నీ మీద కోపమా?...పిచ్చినాన్నా!...... ఈ వయసులో, ఉత్సాహంగా ఏ చింతా, చీకూ లేకుండా గడపవలసిన ఈ వయసులో, నీమనసులో యిల్లాంటి ఆలోచనలు పుట్టించే పరిస్థితిని కలిగించిన నా చేతకానితనానికి...

శార : మీరలా అనకండి నాన్నా! అలాఅంటుంటే నాకెంత బాధగా ఉంటుందో మీకు తెలీదు. మీరు మాకు ఏంలోటు చేశారు?...మేం దౌర్భాగ్యులం! ... వృద్ధాప్యంలో మీకు గడ్డు సమస్యలమై కూర్చున్నాం. మీరు విచారించకండి...మాకోసం మీరు ఇలా కృంగిపోతుంటే, మాకు బ్రతుకుల మీద అసహ్యం పుడ్తూవుంది!

సుంద : శారదా! ఏమిటామాటలు? అనవసరంగా మీ రెందుకు బాధపడాలి తల్లీ!...పరిస్థితులు ప్రస్తుతం బాగులేవు...నిజమే! ... చెయ్యి యిరుకున పడింది! అయితే మాత్రం?... రోజు లెల్లప్పుడూ యిట్లానే ఉండిపోతాయా?...

శార : అదికాదు నాన్నా! తీర్చలేని అప్పులు...

సుంద : ఎందుకు తీర్చలేం? మనకీ ఆస్తులున్నాయిగా! నాకింక మీముగ్గుర్నీ తప్పించి ఎవ

రున్నారే? మీసుఖాల కోసం ఆపాటి కష్టం సహించలేమా మేము?...నువ్వు విచారించకు. నీకోసం ఎలాంటి అల్లుణ్ని తెచ్చానో తెలుసా?...వెళ్ళు! తలదువ్వుకో! మంచి చీర కట్టుకో! ఏదీ మొన్న కొన్న నీలం జార్జెట్టు...వాళ్ళొస్తున్నారు...వెళ్ళు!

శార : నాకిప్పుడు పెళ్లి అక్కర్లేదు నాన్నా!

సుంద : ఆమాట అల్లుణ్ణి చూచిన తర్వాత చెప్పుదువు గానిలే!
సిగరెట్టు కూడా త్రాగే అలవాటు లేదట! ...తెలుసా!

శార : మీ రెప్పుడూ యింతే నాన్నా! మాట వినిపించుకోరు!......అప్పులు సప్పులు చేసి కట్నాలుపోస్తేమాత్రం నా ఆశ వొదులుకోండి! అంతే! ముందే చెపుతున్నా తర్వాత విచారించి లాభంలేదు!

సుం : అమ్మాయి! ఒక మాట చెపుతాను వినూ... యిచ్చే కట్నం ఎవరికమ్మా యిస్తున్నాను?

శార : ఎవరికైనా కానీ! యివ్వటానికి వీలులేదు!

సుంద : అల్లుడికేగా యిస్తుంట! అంటే నీకే అన్న మాట! తల్లితండ్రులు కోరేది పిల్లల సౌఖ్యం కాదూ?

శార : డబ్బిచ్చి కొనుక్కునే ఆ సౌఖ్యం నాకక్కర్లేదు.

సుం : ఆస్తిపాస్తులు యివ్వలేని తండ్రి అంతకంటే యింకేమి యివ్వగలడమ్మా కూతుళ్ళకు?

శార : ఉంటే యిచ్చుకోవచ్చు మరి!...

సుంద : శారదా! నీ అభ్యంతరం ఏమిటి?...నిజం చెప్పు!

శార : కట్నాల పెళ్లి నా కవసరంలేదు.

సుంద : ఎవరికిమాత్రం యిష్టం ఉందమ్మా కట్నాల పెళ్లి? నాకిష్ట మనుకున్నావా?...ఇన్ని వేలు కట్నం యిచ్చా నని గొప్ప చెప్పుకోవాలని నే నుబలాటపడుతున్నానని అనుకుంటున్నావా?...ఆలోచించు...ఏం చెయ్యడం? విధిలేదు...

శార : ఎందుకులేదు?..చెప్పానుగా నేను ఉద్యోగం చేస్తానని...

సుంద : పిచ్చినాన్నా! యింత అందం, యింత చలాకీ ఉద్యోగంకటే! వెళ్లు.....అదుగో వాళ్ళొచ్చారు!

[శారద లోపలికి పోతుంది ముఖం ముడుచుకుని. సుందరయ్య వెలుపలకి వెళ్ళి ఆహ్వానిస్తాడు.లోనికి సుందరయ్యతో శంకరయ్యా, రఘు వస్తారు. శంకరయ్య వయస్సు 50 దాటింది. రఘు వయస్సు 26 సంవత్సరాలుంటుంది. పరస్పర నమస్కారా లయిన తర్వాత అందరూ కూర్చుంటారు]

సుంద : మీ కోసమే ఎదురుచూస్తున్నా! ... అమ్మగారు రాలేదేం బాబూ?

శం : ఆవిడ దొక పిచ్చిమతం...

రఘు : అదికాదండీ! ... రావాలనే అనుకొంది ...

శం : శుభమా అంటూ తలచెడ్డ తనెందుకు రావాలని నన్నే అన్నీ చూడమని కబురెట్టింది... పాతకాలం ఆచారాలు యింకా ఆవిడలో వున్నాయిగా!

సుంద : అలాగా!...దానికేమయినా...ఏమేవ్! శంకరయ్యగారు వచ్చారు!...కాఫీ పట్రా!

శం : అబ్బే! యిప్పుడేమీ అక్కర్లేదయ్యా! ఎందుకు శ్రమ?

సుంద : అహా! అలా అంటే ఎలా చెప్పండి! శ్రమేం ఉంది?... ఏం బాబూ కాఫీకావాలా టీ కావాలా?

రఘు : ఏమీ అక్కర్లేదు. మంచినీళ్లు తెప్పించండి చాలు!

[తొందరగా సుందరయ్య లోపలికి వెళ్తాడు]

శం : ఏమిట్రా మరీగాని పోలేదుకదా?

రఘు : ఏం బాబాయ్?

శం : ఆయన తెస్తాననడం, నీవు తెమ్మనడం... బాగుంది! కలికి లే అలకదంటారు పెద్దలు?

రఘు : నిజంగా దాహంవేస్తోంది నాకు..అంచేతే...

శం : చాల్లే! సమయాసమయాలు చూడవూ?... ఇంకా మాటా మంతీ లేకుండానే ... వస్తున్నట్టుంది.

[శంకరయ్య భార్యతో ప్రవేశం. ట్రేలో రెండు కప్పుల్లో కాఫీ తీసుకొస్తుంది చంద్ర, ఆఖరమ్మాయి. టేబిలుమీద ఉంచి పోబోతుంటే]

సుంద : ఇదే ఆఖరిది! చంద్ర...

శేం : మా శశితో చదువుకుంటున్నదేగా! బావను చూడగానే సిగ్గొచ్చినట్టుంది!

నర : ఏమిటో అంతా మీచేతుల్లో వుంది.

సుంద : చూశారా! మన స్నేహాలు బంధుత్వంక్రింద మార్తున్నాయి! మీ ద్వారా!

శేం : మనలో ఏముంది చెప్పండీ!...భగవంతుడు కలపాలేగాని మనలో ఏముంది!

నర : కాఫీ పుచ్చుకోండి! చల్లారిపోతుంది!

శేం : ఫరవాలేదమ్మా! (అంటూ తీసుకుంటాడు)

రఘు : (అయిష్టంతో కాఫీ పెదవులకు తగిల్చి ట్రేలో పెట్టాడు)

నర : వదినెగారు కులాసాయేకదండీ! చంటివాడికేమన్నా...

శేం : ఏమిటోలే తల్లీ! వాడి నక్షత్రం అల్లాంటిది! దానికీ వాడికీ ఒకటే నలతలు!...ఆ! ఒకసారి అమ్మాయిని పిలుస్తారా? మళ్ళీ ముహూర్తం జారిపోతుంది! సరిగ్గా నాలుగు నలభై అయింది. కొంచెం తొందరగా!...

[నరసమ్మగారు లోపలికి పోతారు.]

సుంద : ఇప్పుడే వొస్తుంది! వొస్తుంది...(అంటూ భార్యవెంబడి లోపలికి పోతాడు. చంద్ర గ్లాసుతో మంచినీళ్లు పట్టుకొస్తుంది. టేబిలు మీద ఉంచి కప్పులు తీయబోతుంటుంది.)

శేం : బుద్ధిగా చదువుకుంటున్నావే?

చంద్ర (నవ్వి ఊరుకుంటుంది)

శేం మీ అక్క యింకా ఏం చేస్తున్నాది?

చంద్ర ఏ అక్క?...

శేం ఆ! ఏం వంగనాచివే! తెలీదూ నీకూ... బావ నచ్చాడా నీకు?

చంద్ర. మన్యా నన్నడుగుతారేం! నేనా పెళ్ళాడేది?

శేంక : ఆరోజు రానీ నువ్వూ పెళ్లాడ్తావు!

[చంద్ర కూడా గ్లాసు తీసుకొని లోపలికి పోతుంది.]

రఘు : చలాకీగా ఉందే...

శేంక : నీకూ తెలుస్తుందిలే దాని చలాకీతనం అదెలాంటి పెంకి ఘటమో! మహా పెంకి ఘటమట! మన శశీ యిదీ ఒకే క్లాసు చదువుతున్నారు.

రఘు : అలాగా!

శేంక : చాలా తెలివైందికూడా!... ఏరా!... అన్నట్టు కాకినాడ నించి ఏదో సంబంధం వచ్చిందికాదూ!...

రఘు : ఆ! వచ్చింది! పదివేలు కట్నం కూడా!

శేం : మరి?

రఘు : పిల్ల నాకు నచ్చలేదు బాబాయి!

శేం : ...ఏవిటో ఈ రోజుల్లో ఈ రోగాలు!... అందం కొరుక్కుతింటార్రా! పదివేలు ఒదులుకున్నా వన్నమాట!

రఘు : డబ్బుమాత్రం కొరుక్కుతింటారేమిటి బాబాయి! నేను కాదనేసరికి అమ్మ నామీద అగ్గయిపోయింది! తను మాటకూడా యిచ్చేసిందట!...

శేం : కాదుమరీ! ... ఈయనమాత్రం ఏమంత కట్నాలకని యివ్వగలడు? మనిషంటావా మంచి మనిషే!...చిదికిపోయాడీమధ్య మరీన్ని!...అటు ఆ బేంకు దివాలా తియ్యడం...యిటు ఈ కేసు ఓడిపోవడం.. పాపం అతన్ని చూస్తే జాలివేస్తుంది నాకు! ఏదోవిధంగా సాయంచెయ్యాలనే వుంది నాకు!

రఘు : అమ్మ ఎటువంటిదో మీకు తెలుసుగా... ఆవిడ మాట కెదురు చెప్పడం నా కిష్టంలేదు.

శేం : అవును చచ్చేకాలానికి ఆవిడ మన సిందుకు కష్టపెట్టడం? మంచిదికాదు కూడా!

రఘు : మనసుకష్టంతో తీరితే బాధేలేదు. ఎన్నిసార్లో చెప్పిచూశాను కూడా! లాభం లేదనిపించింది. అసలు నాకూ యీ కట్నాల పెళ్ళిళ్లు యిష్టంలేదు-కానీ గత్యంతరం లేదు. అమ్మ వినదు—మాట కొట్టిపారెయలేను.

శేం : నిజమే!... అదిగో అమ్మా యొస్తున్నట్లుంది! ఏమయినా అడగాలని ఉంటే బిడియపడకు. అడుగు!

రఘు : అలాగే లెండి!

సుంద : (ప్రవేశిస్తూ) క్షమించాలి! ఆలశ్యం అయిపోయింది!

[ఆయనవెంటనే తల వంచుకొని శారద వొస్తుంది. తొందరలో ముస్తాబైనట్లుంటుంది.]

శంక : ఇలారా అమ్మా. ఫరవాలేదు! మనవాళ్లే!

[కొంచెం ముందుకొచ్చి శంకరయ్యగారికి నమస్కరిస్తుంది. ఆయన ఆశీర్వదిస్తాడు. చాటునుంచి యిద్దరుచెల్లెళ్ళూ, తల్లీ చూస్తుంటారు]

శంక : కూచో తల్లీ!

శార : ఫరవాలేదండీ!

రఘు : (నమస్కారం చెయ్యబోయి లేవబోయి కుర్చీలో ఆమెనుచూస్తూ కూర్చుంటాడు. తలవంచుకొని అట్లానే నిలుచుండిపోతుంది శారద. కొంచెంసేపు నిశ్శబ్దం. ఎవరి నోటంటా మాటపెగలదు.)

శం : రఘూ!

రఘు : అఖర్లేదు బాబాయ్!

[అందరి మొఖాలు వెలవెలబోతాయి.]

సుంద : (నిరాశతో) ఆ!

శంక : (తీవ్రంగా) ఏమిట్రా?

రఘు : (సర్దుకుంటూ) యేంలేదు బాబాయ్! అడగాల్సింది ఏమీ లేదు!

సుంద : ఓహో! అలాగా!

రఘు : ఇక లోపలికి వెళ్ళొచ్చని చెప్పండి...కాని ముఖ్యంగా మరీమరీ అడిగి కనుక్కోండి ఈ పెళ్ళి యిష్టమేనా కాదాఅని!

శంక : అది నువ్వే అడగరాదటోయ్! ఎదుట్నే ఉందిగా! ఏమమ్మా! చెప్పు వరుడు నచ్చాడా?

[క్షణం నిశ్శబ్దం. ప్రక్కనుంచి తొంగి చూస్తున్న చంద్ర]

చంద్ర : మామయ్యగారూ! ముందు అటునుంచి నరుక్కురండి!

శం : ఏమిటమ్మా! నరకడం మేమిటే?

చంద్ర : ముందు అక్క నచ్చిందో లేదో కనుక్కోండి.

రఘు : (శారదను చూస్తూ) నచ్చకపోతే మనం నచ్చామో లేదో అన్న ప్రశ్న ఎందుకు వస్తుంది?

[శారద చిరునవ్వు నవ్వుతుంది. తల ఎత్తడంలో యిద్దరిచూపులూ కలుస్తాయి! ఆమె సిగ్గుతో తల దించుకొంటుంది.]

శంక : బాగుంది! ఎటూ తేలని కథ అయిపోయింది. ఎంతసేపని యిలా కూచుంటాం!... చెప్పరే ఎవ్వరూ?

చంద్ర : మా అక్కమాత్రం తనకి నచ్చకపోతే ముఖం మీదే చెప్పేస్తుంది ఆమాట!

శం : నచ్చితేనేనా చెప్పడానికి సంకోచం? మా మంచి ప్లీడరువి దొరికావే మీ అక్కకి!... సరే వెళ్లమ్మా లోపలికి!

[శారద లోపలికి వెళ్తుంది. రఘు అటువేపు చూస్తూ కళ్లు మూసుకుంటాడు.] ఏంరా! అలా మన్ను తిన్న పాములా కూర్చున్నావేం? ఏమేమి అడగదలచుకున్నావో?

రఘు : ఏముంది గాలి బాబాయి! ఏ క్లాసు చదువుతున్నావు?... హిందీ వచ్చా?... ఎంబ్రాయిడరీ వచ్చా?... వంట చెయ్యగలవా? ఈ సర్వీస్ కమీషన్ ప్రశ్నలేగా?

సుం : అవి తెలియకపోవడం ఎక్కడైనా ఉంటుందా? అందులో మాయింట్లోనా?

రఘు : అందుకనే అడగలేదుగా మరి?

శం : అయితే. ఒరే!... నువ్వు యింటికెళ్లు... కొంచెం విషయాలు మాట్లాడుకొని వస్తున్నా.

రఘు : అలాగే బాబాయ్...మరి...

శం : ఏమిటా సందేహం?

రఘు : వెళ్ళొస్తున్నానని...

సుం : ఓ!... యిదిగో అమ్మాయి చంద్రా! అమ్మకి చెప్పు యిలా రమ్మని...

నర : (ప్రవేశించి) పిల్చారా?

రఘు : వెళ్ళొస్తానండీ!

నర : మంచిది! అలాగే నాయినా!

[రఘు నిష్క్రమణ]

శంక : కూచో అమ్మా! నించోబడి పోయావేం?... నాదగ్గిరే యీ మర్యాదలన్నీ!

నర : ఫరవాలేదన్నయ్యగారూ!

శంక : నీకు అబ్బాయి నచ్చినట్లేనా?

నర : అలా అంటారేమిటండీ అన్నయ్యగారూ! లక్షణంగా చక్కని ఈడూ జోడూ...

శంక : మీరేమంటారు బావగారూ!

# దాంపత్యం

సుం : చెప్పండి మీరే!... అంతా మీచేతిమీదు గానే నడవాలి.

శంక : అదికాదు. చూశారూ!... మా వదినెగారు న్నారే!... అదో పాత తరహా మనిషి... మొన్న కాకినాడనుండి పదివేలతో వచ్చిన పిలని కాదన్నాడని నానామాటలూ అందట!

నర : పదివేలా!

సుం : ఏం ఎక్కువైపోయిందా? ఉన్నవాళ్లు కదో లెఖ్ఖ! మనకి తలకిమించినదిగా ఉంది గాని!

శంక : మన సంబంధం ఎలాఅయినా కలవాలనే నా కోరిక!... అంచేత మీరు...

సుం : అంత పెద్ద మొత్తానికి తూగలేమండీ బావ గారూ...

శంక : మరి?

సుం : చూశారూ!... శారద ఒక్కర్తే అయినే నా తల తాకట్టుపెట్టి అయినాసరే మీరు కోరిన మొత్తం యిచ్చేవాడిని.

నర : అబ్బాయిని చూస్తే అలానే అనిపిస్తుందండీ! ...కాని ... యింకా దానివెనక యిద్ద రున్నారు మరి!...

శం : అయితే ఎంతకి మీరు తూగగలరు?

సుంద : అదయినా చూశారూ!...మీకు తెలియని రహస్యాలు లేవు...ఆ మిగిలినపల్లం పదెక రాలూ అమ్మి దీనిపెళ్లి చేయాలనుకుం టున్నా!...మీరన్నదాంట్లో సగం...

శం : అయిదువేలా?......అనుమానమే! ఆవిడ ఒప్పుకోరు!...మాటిస్తే మళ్ళ నన్ను ఆడి పోస్తుంది!

సుంద : అంతకు మించి యిచ్చుకొనే శక్తి మాకు మరి లేదు. ఉంటే మీ రిన్ని చెప్పాలటండీ?... ఇప్పటికే తలకిమించిన ప్రయత్నం యిది... మిగిలిన ఆ యిద్దరిగతి ఏమవుతుందో... ముందు ఈ బరువు తీరనీ అనే ఆ అయిదు వేలు కట్నం యిస్తానంటున్నాను!

శం : అంతే అంటారు!

సుంద : మీరే ఆలోచించండి! మీ రెరుగని బండా రమా మాది!...మొదట్లో అయివుంటే...

నర : సరే! యిప్పుడెందుకా పాతవన్నీ.

శంక : సరే! వేవస్తా! త్వరలోనే ఏదో తెలియ జేస్తా.

నర : మరి మీదే భారం! ఏదో మీ పుణ్య ముంటుంది.

శం : మీ రింత చెప్పాలటమ్మా!

సుంద : బావగారూ! మీరు చెప్తే ఆవిడ కాదనలేరు! మీ మేలు మరచిపోను.

శం : అంత చెప్పాలటయ్యా నువ్వుకూడా!... నిశ్చింతతో ఉండండి మీరు. నాపాట్లేవో నేను పడ్తాగాం; అన్నట్టు!...ఒక్కమాట... కట్నం తీసుకోవడం రఘుకి అసలు యిష్టం లేదు. స్నేహితులకు తెలిస్తే గేలిచేస్తారన్న భయముంది. అటు కొట్టలేడు, తల్లిమాట! అంచేత కట్నంవిషయం కొంచెం లోలో పల ఉండడమే మంచిది. పైకి పొక్క నివ్వొద్దు!

సుంద : అవశ్యం అలాగే చేద్దాం! ఆ మూడుముళ్లూ పడితే అదే పదివేలు.

నర : నలుగురితో చెప్తే మాత్రం ఒరిగిపోయే దేముంది?

శం : ఏమీ లేదు. అయితే మరి నేనువొస్తా.

సుంద : మంచిది. (యిద్దరూ లేచి వీధిలోకి నిష్క్ర మణ. లోనించి శారద వొస్తుంది. చేతిలో పుస్తకం).

శార వెళ్లిపోయారేమిటమ్మా?

నర మళ్లీ పుస్తకం నువ్వు తయారు...ఏం?

శార ఏమీ లేదు.

నర ఏమి టలా ముఖంపెట్టావ్?

శార ఎన్ని వేలు నిర్ణయించారు?

నర ఏమిటే?

శార ఏమిటంటూ వేమిటే?

సుందరయ్య [ప్రవేశం...ఆలోచిస్తూ]

సుంద ఏమిటమ్మా ఆ కేకలు?

నర చూడండీ ఆ పొగరుమోతుతనం!...బాగా నెత్తికెక్కించుకున్నారు కూతుళ్ళని!

శార : నామాట అసలు వినిపించుకోరేం మీరు?

సుంద అబ్బాయి నచ్చలేదేమిటమ్మా?

శార అదికాదు నాన్నగారూ!

సుంద ఓ! కట్నం సంగతా?

శార : (ఔనన్నట్లు తలూపుతుంది.)

సుంద : అబ్బాయికి కట్నంపెళ్ళి యిష్టంలేదట!

శార : (ముఖం విప్పారుతుంది) ఆ! నిజమే!

సుంద : నిజమమ్మా! అమ్మనడుగు. ఏమన్నారే శంకరయ్యగారు?

[శారద సంతోషాన్ని ఆపుకోలేక లోపలికి పోతుంది.]

నర : అదేమిటండీ! అలా చెప్పారు. తర్వాత కొంపలంటుకుంటాయి!

సుంద : నేనేం అబద్ధం చెప్పలేదే!

నర : అబ్బాయికిష్టం లేకపోయినా పుచ్చుకోవడం మానుతున్నాడా?

సుంద : బాహాటంగా కాదుగా! ఎవరికెందుకు తెలియాలి?

నర : ఎంత ఆలోచనండీ మీది?

సుంద : ఏం లాభం? ఈ దరిద్రాన్ని, కష్టాల్ని తప్పించలేక పోతున్నాంగా!

నర : చాల్లెండి! యథాస్థమానం ఆపాలేనా![తెర]

## రంగము: 2

* * సారెగది. బాగా అందంగా అలంకరించబడి వుంటుంది. రఘు నిండు ఉత్సాహంతో ఉంటాడు. పాన్పు అంచున కూర్చొని మిఠాయి తింటుంటాడు. గదినిండా సువాసన. పాన్పు నిండా చల్లిన మల్లెలూ, సన్నజాజులూ, గులాబీ రేకలూ మత్తెక్కిస్తుంటాయి. కిటికీలోనుంచి నూరు వరాలతీగ సందులనుండి చంద్రుడు కనిపిస్తుంటాడు. చక్కని శోభనపు రాత్రి. గడియవేయని తలుపులకు చేరువగా శారద నిల్చొని ఉంటుంది. ముఖంలో అణచిపెట్టబడిన కోపం, దుఃఖం కనిపిస్తూనే ఉంటుంది. క్రింది పెదవిని పంటితో నొక్కి నేలను చూస్తుంటుంది నిశ్శబ్దంగా. రఘు కొంచెంసేపు ఆగి తలెత్తి శారదవేపు చూస్తాడు. తినడం ఆపి, మంచం దిగి, చేతులు దులుపుకుంటూ శారద దగ్గరికి వస్తాడు. శారద చూడదు.

రఘు : (ఆమె కళ్ళల్లోనికి చూడాలని ప్రయత్నిస్తూ భుజంమీద చేయివేసి) ఏం...అలా నిల్చుండిపోయావ్? (ముందుకి లాగి తలుపు గడియ వేస్తాడు.)

శారద : (మాట్లాడదు.)

రఘు : (శారదను మంచంవేపు లాగుతాడు. ఆమె కదలదు. మెల్లిగా నడిపిస్తూ మంచం చేర్చి) కూచో!

శారద : (కూచుంటుంది మంచానికి ఒకప్రక్కగా.)

రఘు : (బల్లమీది ద్రాక్షపళ్లు రెండందుకొని, ఒకటి నోట్లో వేసుకొని, రెండోది ఆమె నోటిదగ్గర పెట్టి) ఆ అనూ.

శార : (తలతిప్పివేసి నోటిని దాచుకుంటుంది.)

రఘు : అందని ద్రాక్షపళ్లు పులుపన్నారు. (అని అదీ నోట్లో వేసుకుంటాడు. ఆమెప్రక్కనే కూర్చొని భుజమ్మీద చేయివేస్తాడు. ఆమె ఆ చేయి తీసివేయాలని ప్రయత్నించి ఊరుకుంటుంది. ఆమె శరీరం వణుకుతుంటుంది.)

రఘు : ఏం అలా ఒణికిపోతున్నావ్?

శార : ............

రఘు : భయమా?...నేనేం పులినికానుగా?

శార : ............

రఘు : మాటలురావూ? చూడూ ఎంచక్కని రాత్రో! ఈ పువ్వులూ, ఈ అగరొత్తులూ, యీ చల్లనిగాలీ...వెలుపల నిండువెన్నెల.. కంటిముందు అందాలరాణీ...ఈ పాన్పూ, ఈ పళ్లూ...మిఠాయీ...నిజంగా కవిత్వం చెప్పాలనివుంది. జన్మకల్లా యీ దినమేకదూ మనం మరిచిపోలేనిది! నా హృదయం ఎలా వుందో చెప్పేదా? అంచులంటిన ఆనందం.. ఉరకలేస్తున్న ఉద్రేకం...ఊపివేస్తున్న ఉత్సాహం, నిలువంతా నిండిపోయి

తుఫానులోని సముద్రంలా వుంది. నిజంగా ఆనందంలో కూడా ఎంత భరించలేనిబాధ! చూడూ!...నిన్నేమని పిలవాలి? శారదా అని పిలవాలంటే యీ మూడుకురాలే ఎంతో పెద్దపేరులా అనిపిస్తాంది.
ముద్దుగా శారీ అని పిలిచేదా?...ఏం?

శార : (మాట్లాడదు. కంటినుంచి నీరుకార్తుంటుంది)

రఘు : నన్నుకూడా నీవు అందరిలా "ఏమండీ" అని పిలుస్తే నేను ఒప్పేదిలేదు..."రఘూ" అని పిలవాలి. ఆపేరే నాకు అమిరి నట్టుంటుంది... (ఆమె కన్నీటినిచూచి) అరె!...ఏం?... ఏమిటయింది?...ఏంఅలాఉన్నావ్? (గడ్డం పట్టుకొని ముఖం పైకెత్తి) ఎందుకేడుస్తున్నావ్?...చెప్పవూ?...ఛీ! ఏమిటది?... ఎందుకు కన్నీళ్ళుపెట్టుకుంటావ్?...నాతో చెప్పకూడదా?...పోనీలే!... (రుమాలుతో కన్నీళ్లు ఒత్తి) ఎందు కేడుస్తున్నావో చెప్పేదా?...నాకు తెలీదనుకున్నావ్ కదూ? చెప్పేదా?

శార : (తలెత్తి చూస్తుంది)

రఘు : ఎందుకు విచారిస్తున్నావో చెప్పేదా... ఈనాటినుంచీ నీదగ్గరనుంచి వెళ్లిపోతున్న ఒంటరితనాన్ని తల్చుకొనికదూ ఏడుస్తున్నావ్?...కాదూ...పోనీ... నేటినుంచీ ఎంతోజాగ్రత్తగా, ఎంతో ఆప్యాయంగా కాపాడుకున్న...హు!... నేనెందుకనాలి ఆమాట! అంటే నీదృష్టిలో నేనొకదొంగని అన్నమాట! అంతేనా?...సరే!... దోషి నీముందర చేతులుకట్టుకొని నిల్చున్నాడు ఏమిశిక్ష విధిస్తావో విధించూ!...యింకా ఏడుపే?...చెప్పవూ ఎందుకలా బాధ పడ్తావు? (నడుంమీద చెయివేసి దగ్గరిగా తీసుకుంటాడు. శారద చేతినివిప్పి లేచి నిల్చుంటుంది. రఘుచేతిలో ఆమెచెయి వుంటుంది. ఆమెవేళ్ళతో పరధ్యానంగా ఆడుకుంటుంటాడు) ఏమిటిది శారదా? (తానులేచి నిల్చుంటాడు) నేనంటే నీకిష్టం లేదూ?...ఎందుకలా కంగారుపడ్తావ్? ఎంత ఆశపెట్టుకొని ఈదినంకోసం కాచుకొని ఉన్నానో తెలుసా?...ఆనాడునిన్ను చూచిన క్షణంలోనే నామనస్సు హరించావ్!... నిన్నుతప్ప యింకెవ్వర్నీ పెళ్ళిచేసుకోకూడదనే నిశ్చయించుకున్నాను...నీకు నేను నచ్చలేదేమో అని భయపడ్డాను...నచ్చినావనీ, నీకీపెళ్ళి యిష్టమేఅని చెప్పారునాతో! నీకు ఈపెళ్లియిష్టంలేదని ముందుగానే తెలిసి వుంటే, ఎందుకు తెలియచేయలేకపోయావ్ ముందుగానే? నీజీవితం,...నాజీవితం యిక నరకంకాక యింకేమిటి?...మాట్లాడవేం?... నీకుయిష్టంలేని భర్తతో నీవూ...యిష్టపడని నీతోనేనూ...యీజీవితం యిలా వెళ్లవలసిందేనా?...చెప్పుశారదా...ఏడుపు ఆపి నిజం చెప్పు?...

శారద : (నిట్టూర్పువిడిచి) ఏమిటిచెప్పమంటారు?

రఘు : (గొప్ప బరువు దిగినట్లు) అబ్బా! ఎంతసేపటికి ఆనోటిలోంచి ముత్యాలు జారాయి!... (ఆమెకళ్లలోకి ప్రేమగాచూస్తూ) నిజంగా గాభరాపెట్టి విడిచావ్!

శార : (చూపు తప్పించుకుంటూ)ఒద్దు! నావేపలా చూడవద్దు! నాకుభయంవేస్తుంది. (ఏడుస్తూ) బాధగా ఉంటుంది!

రఘు : మరెలా చూడమంటావ్?...పిచ్చి దానా! బాధ ఎందుకు?...నా చూపులో నీకఠినత్వానికి కొట్టుకుంటున్న నా హృదయం కనిపించడం లేదూ?

శార : అతిస్పష్టంగా కనిపిస్తుంది...అందుకే భయం వేస్తుంది...(కళ్లు మూసుకుంటుంది.)

రఘు : అంత బాధ కలిగించేటంత భయంకరంగా ఉందా? (ఆమె వేళ్ళను పెదవులకు తాకించి చెక్కిలిపై ఉంచుకొని) ఎంత అందంగా ఉన్నావో నీవు తెలుసా? ఏమి పెక్కినా నీకళ్లలో ఆకర్షణ (కళ్ళను ముద్దు పెట్టుకో బోతుంటే)

శార : (వారిస్తూ) ఒద్దు! నన్ను తాకవద్దు! నా మనసేం బాగు లేదు. గుండెల్లో బాధగా వుంది!

రఘు : బాధా?...

శార : క్షమించండి!...చెయితీయండి!...

రఘు : (చిన్న బుచ్చుకొని దూరంగా పోతాడు అభిమానం దెబ్బతిన్నట్టుబాధతో) మనస్సులో ఏదో పెరపెట్టుకొని వస్సేందు కిలా ఆడిస్తావ్ ? ... ఏమిటెదంతా ? లోపల ఏముందో చెప్ప కూడదు ?...నా లాంటి అదృష్టవంతుకు లేడనుకున్నాను...విద్య, అందం అనురాగంతో కూడిన లక్షణమైన భార్య దొరికిందని పొంగిపోయాను! యిలా అవుతుందని అనుకోలేదు...ఎంతరాసి తెచ్చుకుంటే అంతే!...

శార : అదికాదండీ!

రఘు : మరి?

శార : ఒక విషయం అడుగుతా కోపంరాదు కదా?

రఘు : ఏమిటి?

శార : అబద్ధాలన్నా...దొంగతనం, కపటం, మోసం అన్నా నాకు అసహ్యం...నా వాళ్లే ఆ పనులు చేస్తే నాకెలా ఉంటుందంటారు?

రఘు : ఏమయింది?

శార : మీరు అందరికీ తెలిసేటట్టు, బాహాటంగా కట్నం ఎందుకు తీసుకున్నారు కారు?

రఘు : మన యిద్దర్నీ అందరూ చూచేటట్టు బాహాటంగా నడివీధిలో వొదలక ఈ నాలుగు గోడల మధ్య ఎందుకు మూసి పెట్టారు?

శార : ఇదా నాప్రశ్నకి జవాబు!

రఘు : అదికాదు శారదా! చూడూ! అది నలుగురికీ తెలిస్తే తలెత్తి తిరగ్గలనా?

శార : అయితే కట్నం తీసుకోవడం అవమానకరం అని నమ్మి కూడా రహస్యంగా తీసుకున్నారేం?

రఘు : బావుంది...వొస్తున్నది వదులుకోవాలా?

శార : ఇచ్చేవారి శక్తి, సామర్థ్యాలూ, స్థితిగతులూ చూడ నక్కర్లేదన్నమాట !...అవతలి వారు వీధి పాలయితే నేం అడుక్కు తిరిగితే నేం... మీకట్నం మీకు ముడితే సరి ! పైపెచ్చు హృదయం దొంగలింపబడిందని నమ్మ విలువ లేని మాయ మాటలా! కట్నం కోసంగా పెళ్ళాడింది నన్ను? మీ కిచ్చిన దానికంటె ఎక్కువ కట్నం యిస్తే నన్ను విడిచి పెట్టేస్తారు కదూ?

రఘు : శారదా!.. బావున్నాయి నీ మాటలు! అయినా ఆకట్నం నేనొక్కణ్ణీ మోసుకు పోతానా చెప్పు! యిప్పుడు నాదీ నీది అన్న భావనకి తావేదీ? నా సంపాదనంతా ఎవరి కోసం?

శార : ఏమో!

రఘు : తెలియనట్టుమాట్లాడకు. మనకోసం—నీ కోసం—మనకి పుట్టిన బిడ్డలకోసం... యిప్పుడు పిల్లలులేరుగనక నీ కోసం అన్న మాట!

శార : మీ అమ్మగారి కోసం అని కూడా ఎందుకనరు?

రఘు : అది నిజమే!...అసలు నిజం చెప్పేదా? నాకూ ఈ కట్నాలు, గిట్నాలూ అంటే అసహ్యమే! కట్నం లేకుండానే పెళ్ళి చేసుకుందామనే ఆశగా వుండేది...కాని ఏం చేసేది? కాటికి కాళ్లు చాచుకుని ఉన్నమాఅమ్మ...కని, అష్టకష్టాలు పడి, పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించి యింతవరకూ రావడానికి కారణమైన... అమ్మమాట ఎలా కాదని కొట్టి పారేయగలను?...అసలు పది వేలుకట్నం యిస్తామంటూ వచ్చే సబంధాలే అక్కర్లేదని అన్నాను. డబ్బంటే నాకు వ్యామోహం వుంది గనుకే అక్కర్లేదన్నాను కదూ?

శార : అయితే మా నాన్నగారు ఎంతిచ్చారు?

రఘు ఏం?...నీకు తెలీదూ?

శార నాకా!...నాకు మొదట్లో తెలిసి ఉంటే...

రఘు తెలిసుంటే?

శార మన పెళ్ళికాకపోయుండేది!

రఘు ఏం?

శార కట్నం యిస్తే నా మీద ఆశ వదులుకోమన్నాను ! నిజానికి ఒట్టుపెట్టుకున్నాను. కట్నంతో పెళ్ళిచేసుకోనని......

రఘు : ఓ!...అదా సంగతి...బోధపడింది!

శార : ఏమిటి?

రఘు : మామగారు రహస్యంగా కట్నం యివ్వడానికి అంగీకరించడం అందుకేనా!

శార : ఇంతకీ ఎంతముట్టిందో చెప్పారు కాదు?

# దాంపత్యం

రఘు : అయిదు వేలు!

శార : మీకు ఎవరో యిస్తామన్న దాంట్లో సగం అన్న మాట!...హుం!

రఘు : ఏమలా అన్నావ్?

శార : ఏమీ లేదు! ఆడపుట్టుక ఎంత నీచమైందో ఆలోచిస్తున్నా!

రఘు : నీచమా? ఆడవాళ్లలో యింత అందం ఎందుకుందో నేను ఆశ్చర్యపోతున్నా! అందం అంతా మీలోనే ఉంచాడు దేవుడు!

శార : ఏంలాభం!...తలకిమించిన దక్షిణ కూడా కావాలంటున్నారుగా పూజారులు!

రఘు : శారదా! (దగ్గరగా తీసుకుని) నాకే దక్షిణా అక్కర్లేదు!...నీవిలా నాలో కలిసిపోతే చాలు.

శార : (మైకంతో కళ్లు మూస్తుంది...వెంటనే తేరుకొని) వదలండి! వదలండి! నా నిశ్చయాన్ని చెదరగొట్టకండి! మీ పాదాలు పడ్తాను. దూరంగా ఉండండి!

రఘు : (విభ్రాంతితో) ఏమిటి శారదా! యిది?

శార : నానోటితో చెప్పించకండి!...కాదు...నేను చెప్పలేను...అటు విచారంతో కృంగిపోలేను...ఇటు ఆనందాన్ని అనుభవించలేను!... నేటివరకూ ఏ యింట్లో పెరిగానో ఆయింటిని కూలదోసి, ఆ కుటుంబాన్ని వీధిపాలు చేసి, యిక్కడ మీతో కులుకుతూ, ఈ యింట్లో పంచభక్ష్యపరమాన్నాలు ఎలా తినగలను?...చెప్పండి! మీరే చెప్పండి! నేనేం చేసేది?...

రఘు : ఏమిటా ఉద్రేకం...కాస్త స్థిమితపడు?

శార : నా మనస్సు విచారంలో కృంగిపోతూ ఉంది ...నా హృదయం అవమానంతో కుమిలిపోతూ ఉంది...

రఘు : శారదా!

శార : ఈ దౌర్భాగ్యపుజన్మఎత్తి కుటుంబంలో అరిష్టాన్ని నింపా! ఆడపుట్టుకపుట్టి యింటిని అగ్గిలో కలిపి...

రఘు : ఎందుకలా బాధపడ్తావ్?

శార : ఈ పెళ్లికోసం...ఈ కట్నంకోసం...నాన్న ఆ నాలుగు ధాన్యంగింజలూ వచ్చేభూమిని అమ్మేశారు ... యిక ఎలా గడుస్తుందో ఏమిటో!

రఘు : ఇప్పుడేమయింది?

శార : ఇంకా ఏంకావాలి? మీ కట్నం మీకు ముట్టిందిగా!

రఘు : శారదా! ఏమిటామాటలు? లోకంలో అందరూ చేస్తున్న పనేగా!... నేనేం తగని నేరం చెయ్యలేదే!...అందుకోసం యిలా నానాగల్లంతుచేసి అల్లరిచేస్తావా?

శార : ఎవర్నీ నిందించడంలేదు...నా కర్మకి ఏడుస్తున్నా ... కానీ ... మీకొకమాట చెప్పదలచుకొన్నా! ... మీరెలా భావించినా భావించుకోండి!...నన్ను మీరేమనినాసరే ...నా నిశ్చయాన్ని మార్చుకోలేను.

రఘు : ఏమిటది?

శార : మీరు బలవంతంచేసినా లాభంలేదు...బెదిరించినా సరే!...చివరికి మీరు అసహ్యించుకొని తిట్టినా, కొట్టినా, ముక్కలు ముక్కలుగా చీల్చినా నా అభిప్రాయం మార్చలేరు.

రఘు : ఏమిటో చెప్పకుండా అలా అయిపోతున్నావేం?

శార : మీరు చేసింది మీకు నేరంగా కనిపించకపోవచ్చు! అది దోషంగా తోచకపోవచ్చు! ...దోషం కాకపోయినా...నాకు మట్టుకు అది హృదయం ఉన్నవాళ్ళు చెయ్యవలసిన పనిగా కనిపించదు. ప్రేమా, అభిమానం, గౌరవం, కనికరం, స్నేహం కల మనుష్యులు అలాంటి పనులకు పాలుపడలేరు! మీరు... నాకు అతి సన్నిహితులైన మీరు, భవిష్యంలో నేటినుంచీ సర్వస్వం కావలసిన మీరే అంత హృదయహీనంగా, కనికరం లేకుండా...

రఘు : ఏమంటున్నావో నాకేం అర్థం కావడంలేదు!

శార : అర్థం చేసుకోవద్దు!...అర్థమైతే మనుష్యులవలె ప్రవర్తించే అవసరం పడుతుంది!

రఘు : అయితే నేను అమానుషంగా నడిచానంటావ్?

శార : ఆ ప్రశ్న నన్నడగవద్దు...మీ అంతరాత్మనడగండి!

రఘు : కట్నం తీసుకోవడం అంత పెద్ద నేరమన్న మాట?

శార : పెద్ద-చిన్న ఆ తారతమ్యాల విభేదాలు మీకు చెప్పగలిగినంత సామర్థ్యం నాకు లేదు. చదువుకున్నవారు, విజ్ఞానులూ—హృదయం ఉంది, ఇంగిత జ్ఞానం ఉంది ఆలోచించండి! ఆడపిల్లల్ని కన్న తలిదండ్రుల స్థితిని మనసులో ఉంచుకొని ఆలోచించండి! రేపు మనకూ పిల్లలు పుడతారు...ఆడపిల్లలూ పుట్టొచ్చు! ఈ పరిస్థితులే ఎల్లకాలం ఉంటే...మీకు ఎదురు చెప్తున్నానని భావించకండి!

రఘు : సరే! అయితే నన్నేం చెయ్యమంటావ్?

శార : ఏది చెయ్యాలో, ఏది చేయకూడదో తెలియని పసిపాపలు కారు మీరు. నా దొక్కటే ప్రార్థన! నాకూ హృదయం ఉంది. నాకూ ప్రేమించే బలహీనత ఉంది. నా నోటంట మిమ్మల్నే ప్రేమిస్తున్నానని చెప్పను. అది గొప్పకాదు-అది నా ధర్మం! అగ్నిసాక్షిగా మీరు చేపట్టిన భార్యను! కానీ! నావాళ్లు నాకు తలపుకు ఒస్తున్నన్నాళ్లు నేను ఆనందంతో ఉండలేను!...అలాచేస్తే కావాలనే పాపం చేస్తున్నట్లు భావిస్తున్నా! నా హృదయం మీ ఒళ్లో తలదాచుకోవాలని ఉరుకు లేస్తుతూంది!...మనస్సు పగ్గాల్పట్టి నిరోధిస్తోంది! మీ కర్థంకాదు. నేను పడే యాతన...ఈ సంఘర్షణలో నాకు పిచ్చెత్తేటట్టుంది!

రఘు : అసలు విషయం చెప్పవేం?

శార : అసలు విషయం!...ఆదిలో మీరు కట్నం తీసుకున్నారని తెలియగానే నన్ను నేనే నమ్మలేకపోయాను! మీరు అంత నీచాని కొడిగడతారని అనుకోలేదు. మిమ్మల్ని ఆదర్శం క్రింద లోకం తీసుకుంటుందని మురిసిపోయాను!...ఇది కళంకంలా కనిపించింది! సహించలేకపోయా! చచ్చిపోదా మనిపించింది! ఆ విషయం నాకు ఇంకా ఈ నిమిషం వరకూ తెలియదనే మా యింట్లో అందరూ అనుకుంటున్నారు. అంతా అయిపోయింది! చెయి జారిపోయింది. నేను మీ సొత్తునయిపోయాను. ఏం చెయ్యగలను? కసిదీర మీకు అనుతాపం కలిగించి చద్దామనుకున్నా!... ఏం లాభం...ఎలాగూ కష్టాల్లో మునిగిపోడానికే తెగించిన మావాళ్ల కష్టాలు గట్టెక్కవు...నేను చస్తే యింకొకర్తె మరో పదివేల కట్నంతో మీకు భార్యగా వస్తుంది.

రఘు : శారదా! ఏమిటా మాటలు? మతి ఉందా లేదా?

శార : మతి ఉండడంవల్లనే యీ నాడు మీతో యిలా మాట్లాడుతున్నా...యిన్నాళ్లూ ఆతురతతో ఈ రోజు కోసమే కాసుకొని ఉన్నా!....యీ మాటలు చెప్పడానికే! నా హృదయ పూర్వకంగా, నా మనస్ఫూర్తిగా-మీరు కోరే ఆనందాన్ని నేనివ్వలేను...యిది మన శోభనం గదికాదు! ...యిది ఆ పర్వదినమే కాదు....

రఘు : ఏమిటా పిచ్చివాగుడు?

శార : మీ రేమనుకోండీ! మనసులో మాట చెప్పా!...మీ యిష్టం!...మీరు బలవంతం చేసి నన్ను బాధించరనే నమ్మకం ఉంది నాకు!...మీరు నన్ను ప్రేమిస్తున్నారన్న మాటకూడా తెలుసు...కానీ...

రఘు : అన్నీ నువ్వే అను...యిక మరి నేను వింటూ తల ఆడిస్తుంటాను.

శార : కోప మొచ్చిందా?

రఘు : రాదా?...ఎంతకాలం వృధాచేశాం?..... ఈ రోజుకోసం ఎంత ఆతురతతో నిరీక్షించాను...ఎన్ని కలలు కన్నాను!...

శార : మీ రలా నిస్పృహ పడొద్దు!...నేను దగ్గిరే ఉన్నాగా!

రఘు : ఎందుకు?...ఊరిస్తూ బాధ పెట్టడానికా?... అసలు నీ అభిప్రాయం ఏమిటి?...దగ్గరకు రావొద్దు అంటే వెళ్లిపోతాను...బలవంతం చేసి నిన్ను బాధపెట్టడానికి నేనేం రాక్షసుడిని కాను.

శార : నేను కోరేదీ అదే.

రఘు : ఎంతకాలం?...ఎంతకాలం దేవిగారి అనుగ్రహానికి ఈ భక్తుడు తపస్సు చెయ్యాలి?

శార : ఏమో !...భర్తునిహృదయం పరిపక్వమైతే... లేదా హృదయంలో పరివర్తన కలిగితే.....

రఘు : బాగుంది! బాగుందీ వేషం! ..... అయితే కట్నం తీసుకున్నానని, నీవు నాకు భార్యగా ఉండడానికి యిష్టపడడం లేదన్నమాట ?... అంతేనా ?

శార : మీ రలా అంటే నే నే మనగలను ?

రఘు : చివరికి తేలిందదేగా !...నీ మాటమీద నేను నడవాలన్నమాట ? అంతేకదూ ?

శార : నే నలా అన లేదే !

రఘు : అనకపోయినా అర్థం అదే!...ఈ బెట్టు సరి ఏమిటో నేనూ చూస్తా !

శార : అదుగో పంతాలుదేనికి చెప్పండీ! ఎందు కంతకోపం ?

రఘు : కోపంకాదూ ?...నే నేం మనిషి ననుకున్నావా మాను ననుకున్నావా ?...సరే!... నీ యిష్టం కానీ !...ఎన్నాళ్లో యీనాటకం చూద్దాం!...యిదుగో యిప్పుడే చెప్తున్నా... నేనయిదేహీ అని నీదగ్గరికి వస్తానన్నమాట కల్ల!...ఆ ఆశ జన్మలో పెట్టుకోకు!...నాకూ అభిమానం వుంది!...పట్టింపులో నేనూ గట్టివాణ్నే!

శార : (కన్నీటితో) ఏమండీ!...అంత హృదయం లేకుండా మాట్లాడకండీ!...యింత చిన్న విషయానికే మీరింత కోపగించి మాట్లాడతా రనుకోలేదు.

రఘు : అసలు మాట్లాడే వలుచుకోలేదు! నేను పోతున్నా!...

[తలుపు దగ్గరకు వెళ్లిపోతాడు]

శారద : (గాభరాతో ఆపి) నామీద ఒట్టు!...తలుపు తియ్యవద్దు...బైటివాళ్ళందరికీ మన గొడవ ఎందుకు తెలియాలి?...వెళ్ళకండి!...వెళ్ళారంటే...

రఘు : మా నూతిలో నీళ్ళుకూడా లేవులే పడి చావడానికి!...అయితే ఏం చేయమంటావ్? అసాధ్యమయిన కోర్కెలు కోరుతున్నావే!

శారద : అత్తగారికి కూడా తెలియనివ్వకండి మన విషయం. ఎవరైనాసరే మనల్ని వేలెత్తి చూపించి నవ్వితే నేను భరించలేను.

రఘు : అంత పతివ్రతవు మరి ఈ వ్రతం దేనికి?

శార : మంచివారే నండి మీరు (నవ్వుతుంది).

రఘు : ఏం లాభం?...(ఆవలిస్తాడు)

శార : నిద్రవస్తోందా?...పడుకోండి...కాళ్ళు రాచేదా?

రఘు : (మంచంమీద పడుకోబోతూ ఆగి) అక్కర్లేదనసూయగారూ నేనేం ముసలివాణ్ని కాను. ఒంటిమీద చెయిపెయ్యొద్దు.

శార : ఏం?

రఘు : వేశావంటే నీ పట్టుదల, నియమాలూ వన్నాప లేవు ముందే చెపుతున్నా-(నిట్టూర్పుతో ఒత్తిగిలతాడు)

శార : పోనీ లెండి!...ఆదిండు యిలా పారేయండి!

రఘు : నేల పండుకుంటావా?

శార : తివాచీ ఉందిగా!

రఘు : బావుంది! ఏం చక్కని శోభనం?...సరె యిందు (దిండు విసురుతాడు...ఆమె పరుచుకొని పడుకోబోతుంటుంది) జాగ్రత్త సుమీ నిద్రలో యిక్కడికి వెళిపోరాగలవ్!
[శారద చిగునవ్వుతో అటు తిరుగుతుంది]
అప్పుడే నిద్రా!...పోనీ మాటలైనా చెప్పు. అది కూడదా?

శార : చల్లగా నిద్రపొండి!

రఘు : ఎంత చక్కగా చెప్పావ్!...నీ వక్కడ ఉంటుంటే నాకెలా నిద్రపడుతుంది? (లేచి ఆమె ప్రక్కకి వస్తాడు. శారద కూడా లేచి కూర్చుంటుంది)

శార : వెళ్ళి పడుకోండి!... నా మాట విని వెళ్లి పోండి! నేను రెండు మాటలు చెప్పేమనిషిని కాను!

రఘు : నే నొప్పుకోను...నువ్వు వచ్చి తీరాలి!... ఏమిటీ నాటకం?...రా!...యిలారా!...లే!

శార : మీరు యింత కఠినంగా పిలువగలరని అనుకోలేదు నేను...మీరేమనండీ!...నేనురాను !

రఘు : శారదా ! దేనికైనా హద్దుంది! నన్ను విసిగించకు ... నీవువచ్చితీరాలి !... బలవంతంగా...నీకు కష్టంగలిగినా సరే !

శార : మీకు మతిపోయిందీ?...బలవంతం దేనికి? ఇదా మీ ప్రేమ అనురాగమున్నూ!... వెళ్ళండి! అల్లరిపెట్టకండి! వెళ్ళండి!

రఘు : ఏమిటీపంతం? నాకుకోపం వచ్చిందంటే...

శార : ఏమొచ్చినాసరే...క్షమించాలి! ఈ విషయంలో మీమాట వినదలచుకోలేదు... అంతే! నన్నుమరి విసిగించకండి మీకు పుణ్యముంటుంది...యిప్పటికే పాపం చాలా శ్రమపడ్డారు—నిద్రపొండి.

రఘు : భార్య చెప్పాల్సిన మాటలుకావివి!

శార : సరే?

రఘు : అయితే నామాట వినవన్నమాట!

శార : ఈ ఒక్క విషయం లోనే!

రఘు : సరే!...నీమాటే కానీ...అనుభవించేది నీవు.

శారద : కానివ్వండి!

రఘు : మూర్ఖం! చెపితే వినకపోతే.. ఎందుకు నన్నిలా అల్లరిపెడ్తావ్ శారదా?...

శార : అనవసరంగా మాటలు వృధాచేయకండి! నాకు నిద్రొస్తున్నది. వెళ్ళండి! చెప్పిన తరువాత...

[తిరిగి నిద్రపోతుంది.]

రఘు : (మంచంమీదికి కోపంగాపోతూ) సరే! నా ఒక్కడికే నేమిటి యీబాధ—చూద్దాం ఈ పంతం ఎంతసేపో!... [తెర]

## రంగము: 3

* * రెండవ రంగంలోని దృశ్యం: పడకగది: బిల్లమీది గడియారం మధ్యాహ్నం గం॥ 2-45 లు సూచిస్తుంటుంది. శారద మంచం మీద పడుకొని చదువుతూ వుంటుంది. వీధి తలుపు తట్టి పిలిచిన శబ్దం...లేచి వెళ్తుంది! తలుపు తెరిచినచప్పుడు... కొంత సేపటికి గదిలోనికి సుందరయ్యా, అతని వెనుక శారద ప్రవేశం. శారద ముఖం విప్పారుతుంది.

శార : ఈ బండిలోనేనా రావడం నాన్నా! ఉత్తరం కూడా రాశారుకాదు.....స్నానం చేస్తారా?

సుంద : (కూచోకుండానే) అక్కర్లేదమ్మా! తొందరగా వెళ్ళాలి...అక్కగారేరీ?

శార : కోవల కెళ్ళారు. గీతోపన్యాసాలు అవుతున్నాయట...కబురు పెట్టేదా...ఎందుకు?

సుంద : అక్కర్లేదమ్మా...ఆ...నీ వంట్లో ఎలా వుంది?

శార : నా వంట్లోకేం...నిక్షేపంగా వుంది.

సుంద : మీ ఆయనేరి? సెలవలేమో!

శార : మొన్ననే ఏదో కాలేజి పనిమీద వాల్తేరు వెళ్ళారు. నిన్ననే వచ్చేస్తానని చెప్పారు. రాలేదు! ఈ వేళా రాలేదన్నమాటే! మీరూ ఆ బండిలోనేగా వచ్చారు.....అమ్మ బావుందా?

సుంద : ఎప్పట్లాగే! ఇప్పుడు సీతకీ, చంద్రకీ కలిపి ఒక్కసారే పెళ్ళి చెయ్యమంటూ గోల!

శార : స్కూలు మానిపించేశారేమిటి?

సుంద : లేదమ్మా! ఇంట్లో కూచుని ఏం చేస్తారు? వాళ్ళ గురించే యిప్పుడు రావడం. ఇక్కడే ఎవరో ఇద్దరు అబ్బాయిలు ఉన్నారట... మీ ఆయనే వ్రాశారు. వీలయితే కలిసివెళ్దామనుకున్నా, మీ ఆయన్ని...

శార : వొచ్చేస్తానన్నారు. వొచ్చేదాకా...

సుంద : వీలులేదమ్మా! వాళ్లు కాసు కూర్చుంటారు. వస్తున్నానని ఉత్తరంకూడా వ్రాసేశాను. నేను వెంటనే వెళ్ళకపోతే ఆఖరి బస్సుకూడ తప్పిపోతుంది. అది కాకుండా యిక్కడికి రావడంలో యింకో విషయం కూడా వుంది తిరిగి వచ్చి మాటాడుతాలే!

శార : ఏమిటది నాన్నా?

సుంద : అమ్మాయి! నా దగ్గిర మర్మం లేకుండా చెప్పు!...నిజం చెప్పాలిసుమా దాయకుండా.

శార : ఏమిటి నాన్నా?

సుంద : రఘు నిన్నెలా చూస్తున్నాడు?

శార : ఏం?...బాగానే చూస్తున్నారే!

సుంద : ప్రేమగా...ఏమీ కష్టం కలగకుండా?...

శార : ఆ! ... ఏం ? ... మీకెందుకా అనుమానం కలిగింది ?

సుంద : ఏమీ లేదూ! ఊరికనే అడిగా. రఘు యీ మధ్య ఒక ఉత్తరంలో...

శార : (గుండెలు కొట్టుకుంటుంటే) ఏమని వ్రాశాడు ?

సుంద : కట్నం తీసుకున్నందుకు పశ్చాత్తాప పడ్తూ, క్షమించమంటూ, మనం ఇచ్చిన ఐదు వేలూ వడ్డీతో సహా త్రిప్పివేశాడు. (ఉత్తరము కూతురికిస్తాడు.)

శార : (చదువుకొని) అయితే ?

సుంద : ఛీ! సిగ్గుచేటు!...కక్కినది ముట్టామటమ్మా... చీవాట్లు పెట్టి ఆ చెక్కు తిప్పేశాను.

శార : అలాగా! ... నాకు తెలీదు.

సుంద : వాడుత్తరానికి వ్రాశిన జవాబు చూశావా (యింకో జాబు యిస్తాడు. చదువుతుంటే ఆమెముఖం జేవురిస్తుంది) చూశావ్!... కట్నం తిరిగి తీసుకుంటే తీసుకోండి లేకుంటే మీ అమ్మాయిని మీయింటికి తీసుకుపొండి అని రాస్తాడుగదా దీని అర్థం ఏమిటి?

శార : ఆ డబ్బు తీసుకోండి నాన్నగారూ, ఆయన అక్కర్లేదంటూ యిచ్చేస్తున్నారుగా!

సుంద : అమ్మాయి! డబ్బుకాశ్వతం కాదు. తెలుసా!

శార : అదికాదు నాన్నా! సీతకి, చంద్రకి పెళ్ళిళ్లు తలపెట్టారా...

సుంద : తలతాకట్టుపెట్టి చేస్తానమ్మా!... కన్నవాణ్ణి నాకర్మం నేను చెయ్యనూ?...అసలు నాకు బాధిస్తున్న విషయం అదికాదు. మీ యిద్దరిలో ఏదో చెడిసింది. ఏవో పొరలు పెట్టుకొని బాధపడ్తున్నారేమో అని నాభయం లేకుంటే యిలా రాయడానికి అవకాశం లేదు.

శార : మాయిద్దరి మధ్య ఏచికాకులూ లేవు నాన్నా!

సుంద : అమ్మాయి! నీవిషయం నాకుతెలీదూ? నాకళ్లే కప్పాలని చూస్తున్నావ్!...సరే! అసలు అనుమానానికి కారణం చెప్పేదా? ఈ కట్నం త్రిప్పివేయడం మీ అత్తగారికి తెలియనివ్వకూడదట!

శార : బావుంది!

సుంద : బావుందీ!...ఏమిటి బావుంది?

శార : నాన్నగారూ! ఈవేళ మిమ్మల్నడుగుతున్నా! నేను మొట్టమొదట మీతో ఏం చెప్పాను?...కట్నం యిచ్చిన పెళ్లి నాకక్కర్లేదని చెప్పలేదూ? దీని మాటలక్కర పెట్టడమా అన్న • భావమేకదూ...రహస్యంగా, దొంగతనంగా కట్నం యిచ్చి మీ ఋణం తీర్చుకున్నామని చేతులు దులుపుకున్నారు. ప్రాణం అంటేతీపి...చస్తానన్నదేకాని నిజంగాచచ్చి పోతుందేమిటి అన్న ధైర్యమేకదూ మీది?...

సుంద : అమ్మాయి! నన్నేం చెయ్యమంటావ్? ఆ పరిస్థితిలో అలా చెయ్యక తప్పిందికాదు. ఇంకా కోపం ఉంచుకున్నావమ్మా మీ నాన్నమీద?

శార : కోపంకాదు నాన్నా! అపారపాటే ఈ నాటికి మా మధ్య కదలని గోడయి నిలిచి పోయింది! మీ కర్థంకాదు!...నిజంగా బ్రతుకంటే అసహ్యం అయిపోతూవుంది! నాకూకష్టంగానే వుంది...మీరా కట్నం తీసుకున్నా సరే లేదా...నన్ను యింటికి తీసుకుపోయినా సరే...లేదా...

సుంద : శారదా! ఏమిటంటున్నావ్? తెలిసే అంటున్నావా? ఇంతబాధపడ్తున్నావటమ్మా నువ్వు?...అయ్యో!...

శార : మీరేమీ చెయ్యలేరునాన్నా!...అది నేను నాచేతులారా చేసుకున్నదే...ఆయన గారిని అనరాని మాటలన్నాను...ఆయన హృదయానికి నొప్పి కలిగించాను. నన్ను నేను బాధ పెట్టుకున్నాను...

సుంద : బావుంది!...అందరిలో నువ్వే నయమనుకున్నా!

శార : సరే నాన్నా కొడుకున్నది కొడుకమానదు. మీరేం విచారించకండి.

సుంద : అటు అక్కగారి అత్తరికం హద్దుమీరినా, అల్లుడు చేరదీస్తున్నాడు గదా అని యిన్నాళ్ళూ తృప్తిపడుతుంటినమ్మా!

శార : ఆవిడ తీరే అంతనాన్నా!...ఒక్కనామీదే కాదు...ఆయనగారి మీదకూడా అలాగే... ఆవిడ తత్వం అది!...అయితే ఈ విషయం అత్తగారికి తెలియనీయవద్దన్నారా?

సుంద : చూశావుగా ఉత్తరం!...ఈ చెక్కూ ఈ ఉత్తరం, ఆ రెండో ఉత్తరం కూడా ఉంచు ...రేపుగాని ఈ వేళ రాత్రికో గాని, వస్తే ఆలోచిద్దాం...రఘుతో చాలా మాట్లాడా లన్నమాట ..బస్సు తప్పిపోతుంది...వచ్చా నని అక్కగారితో చెప్పు...వస్తాను. (అంటూ లేచి తండ్రి, వెనుక కూతురూ వెళ్ళిపోతారు. అయిదునిమిషాల తర్వాత శారదవస్తుంది... చెక్కూ, ఉత్తరాలూ మంచంమీద దిండు క్రింద ఉంచుతుంది. ఆలోచిస్తూ కూచుం టుంది. గడియారం మూడుగంటలు కొడ్తుంది. లేవబోతుంటే వీధి తలుపు చప్పుడు ... వెళ్తుంది. రఘు సరసగా లోపలికివచ్చి కోటు విప్పి స్టాండుకి తగిలిస్తాడు. అతని వనక నే శారద ప్రవేశం)

రఘు : (ఆమెను చూడకుండానే) అమ్మ పురాణానికి వెళ్ళిందా?

శార : .............

రఘు : కాఫీ ఏమయినావుందా?

శార : ..................

రఘు జవాబు లేదేమిటి?

శార ఎవర్నడుగుతున్నారు?

రఘు ఆబీరువా నడుగుతున్నా!

శార చెపుతుందేమో జవాబు చెవిచ్చి వినండి!

రఘు ఇన్నాళ్లా ఎలా వొచ్చేవి జవాబులు?

శార ఈ రోజునుండీ ఈబీరువాలూ, మంచాలూ, చెంబులూ, తపేళాలాలూ, పుస్తకాలూ మానం వహిస్తాయట...పాపం! పూర్తిగా సంవత్సరం మధ్యవర్తిత్వం చేశాయి చాలదూ?

రఘు : పాపం! అందుకు నేనేకదూ కారణం?

శార : మీరు కాదు నేను! సరా?

రఘు : ఏం యిలా మళ్ళింది గాలి?...యింకో తుపాను సూచనకాదు కదా!

శార : తుపాను వెలిస్తే చక్కని ప్రశాంతత వస్తుందిగా!

రఘు : ఒద్దుగాబూ! ఆ తుపానూ వద్దు! ఆ చక్కని ప్రశాంతత వద్దు!

శార : ఏం అంత విరక్తితో మాట్లాడుతున్నారు?

రఘు : ఇదిగో శారదా!...

శార : శారీ! అని పిలువకూడదూ?

రఘు : ఎందుకు పిలవాలి?... నేను పిలవను!

శార : ఏమిటి చెప్తూ ఆగిపోయారు?

రఘు : మధ్య అడ్డు తగిలావు—మరచిపోయాను.

శార : కాలేజీలో యిలాగే చెపుతుంటారేమిటి?

రఘు : హాలులో నీవుంటే అలానే చెప్పాల్సి వస్తుంది.

శార : ఆ!

రఘు : నిన్ను చూస్తే చెప్పదలచింది మరచిపోతాను. ఈవేళ యింత దయకలిగిందేం ఈ దీనుని మీద?

శార : నిజమే!

రఘు :కాని...యిదిగో శారదా-

శార శారి! అనండి!

రఘు సారీ... యిదిగో శారీ!... మళ్లీ మరచి పోయా!

శార నేను చెప్పేదా?

రఘు చెప్పు!...

శార "యిదుగో శారీ!... యిలా నీవు నన్ను అల్లరిచేసి విడిస్తే నేనొప్పుకోను... ఏమిటే నాటకం?... నీకు తెలియదు నేనెంత బాధ పడుతున్నానో!... గృహస్థుడై, చక్కని భార్యనుంచుకొని నాకీ బ్రహ్మచర్యంగడిపే గతేమిటి?... పగ్గాలుతెగిన రేసు గుర్రాల్లా కోర్కెలు పరుగెడ్తూంటే, వాటి కీకలు బల వంతాన నొక్కేస్తున్నా! ఎన్నాళ్లీ నరకం? ...నేనొప్పుకోను... నేనింక ఓర్వలేను... నీదింత బండబారిన హృదయం అనుకోలేదు! నీలో యింత కఠినత్వం ఉందనుకోలేదు...

శాకీ!... నీవు రాక్షసివి!... భూతానివి! దెయ్యానివి!... మారివి!... మహామ్మారివి!... నీకు కనికరం లేదు!..."

రఘు : హియర్! హియర్!! ఎంత చక్కగా చెప్పావ్! ఎలా తెలిసింది నా మనసులోని మాట నీకు?

శార : మీ కళ్ళే చెపుతున్నాయి!

రఘు : అయితే జవాబుకూడా నీవే చెప్పు!

శార : జవాబు మీరివ్వాలి!

రఘు : నేనా?... కోపం రాదుకదా... అయితే విను... "ఏమండీ!... మీకు తెలుసును... నేను మిమ్మల్నే అహర్నిశం కోరుతుంటానని...

శార : వేరింకేం పనులు లేనట్టు?

రఘు అన్యాయం!... నీవు చెపుతుంటే నేనడ్డొచ్చానా?

శార అయితే చెప్పండి! అడ్డురాను.

రఘు చెప్పను...

శార చెప్పండీ!

రఘు సరే! "చూడండీ!...మీరు కోపగించుకోవద్దు!...క్షమించరాని దోషం చేశారు మీరు. నేను క్షమించను. క్షమించలేను. అందుకు మీరు ఈ శిక్ష అనుభవించాల్సిందే! తిరుగు లేదు. దీనివల్ల మీకూ నాకూ బాధే!

శార : అంచేత...

రఘు : పూర్తిగా చెప్పనిదే...

శార : మరి చెప్పనక్కర్లే! అన్నీ అబద్ధాలూ మీరూ!

రఘు : అదిగో! అబద్ధాలంటే నాకసహ్యం! ఈ నాటకాలంటే మరీ అసహ్యం! కదూ!

శార : కాదండీ!...మా నాన్నగారు వచ్చారు!

రఘు : స్టేషనునించి అలా కాలేజీకి వెళ్ళిరావడంలో ఆలశ్యమైంది...ఎక్కడికి వెళ్లారు.

శార : పల్లవరం...మీరేగా రాకారట!

రఘు : మీ చెల్లెళ్ళ సంబంధం కోసం కదూ!...వాళ్ళిద్దరూ కాలేజీలోనే చదువుతున్నారు— యింటరొకడూ—బి. ఎ. ఒకడూ...తెలివైన వాళ్లే...బావుంటారుకూడా?

శార మీకేనేమిటి మధ్యవర్తులూ, పెళ్లి పెద్దలూ!

రఘు ప్పుతుందా! రాణీగారి చెల్లెళ్లు.

శార రాజాగారి కెంత అభిమానం;

రఘు కట్నాలగొడవ ఉండదులే! యిద్దరూ సంస్కారులే!

శార మీరుమాత్రం కారూ?

రఘు . ఆ! నేనూ ఒక సంస్కారినే! నిజం చెప్పాలొస్తే నీకున్న గుండె దిటవు నాకు లేదు.

శార : నాది రతిగుండె అన్నారుగా!

రఘు : నిజం! దాపరికమెందుకు?...ఒక్క గదిలో మనం పడుకుంటూ యిన్నాళ్ళయింది...క్రింద చాపమీద నిద్రపోతున్న నీ దగ్గరికి రావాలని ప్రతిరోజూ మనసు పీకుతుండేది!...ఎంత అణచుకున్నా ఆగేది కాదు...నిద్ర పట్టేది కాదు...అప్పుడప్పుడు నడిరాత్రి మెలుకువస్తే, నిశ్చలంగా నిద్రపోతున్న నీ అందాన్ని చూస్తూ, దగ్గరికి తీసుకొనే ధైర్యం లేక బాధపడేవాణ్ణి!...ఏ నాటికైనా నీవు నా దగ్గరికి రాకపోతావా అని ఆ ముహూర్తానికై రోజూ ఎదురు చూస్తూ ఉండేవాణ్ణి!

శార : నిజం?

రఘు : ఒకొక్కప్పుడు ఒంటరి తనం భరించలేక డాబామీదికి పోయి గంటల తరబడి చీకటిలోకి చూస్తూ నిద్రకోసం వెతుకుతుండే వాణ్ణి! నీవుమాత్రం... హిమాచలం లాగు చలించక ఆ చిరుచాప వంటిపెట్టుకొని నిద్రపోయేదానివి నిశ్చింతతో...ఆచాప తగలెట్టేయాలనిపించేది!

శార : తగలెట్టేసినా పాపం అది ఎదురు తిరుగుతుందా?...

రఘు : చివరికి అమ్మకంట కూడా పడనీయకుండా దాన్ని కాపాడేవు యిన్నాళ్లూ!...అయితే యింకెన్నాళ్లు ఆచాపతో కాపరం?

శార : నన్నడుగుతారేం?......యిప్పుడు పారవేసి రమ్మంటే పారేస్తాను.

రఘు : అయితే దీనికీవాళ విడాకులన్నమాట! నిజమా? ఊరికే ఆట పట్టిస్తున్నావా?...ఏమో నిన్ను నమ్మలేం! ఇంతకాలం ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకొంటున్న నన్ను చూస్తుంటే నీకు చీమయినా కుట్టినట్టు లేదు...నమ్మలేను!

శార : ఏం? నేను మాత్రం బాధపడలేదూ? మీతో సరిగ్గా నేనూ అవస్థలు పడ్డాను. నేనూ ప్రతి రోజూ అనుకునే దాన్ని 'ఈరోజు రాక పోతే నేనే వెళ్తాను తెగించి' అని...కాని వెళ్ళలేకపోయే దాన్ని! మీ అవస్థా, మీ చిరాకూ, వినిట్టూర్పులూ, నిద్రరాకుండా పడేపాట్లూ అన్నీ గమనించే దాన్ని...... ఒక్కసారి లేచివచ్చి హృదయానికి మరె ప్పుడూ విడిపోమన్నట్లు హత్తుకోవాలని ఓంచేది! అభిమానం అడ్డు పడేది! ఇన్నాళ్లూ మీరు ముఖాముఖిని మాటలాడక పోయినా, కుర్చీలనూ, బెంచీలనూ ప్రశ్న లడుగుతున్నా, మీరు నిద్రలో 'శారీ'అని ప్రేమగా కలవరిస్తుంటే హృదయంనీరయ్యేది! ఏం చేసేది? మనిద్దరి మధ్య యిసప తెర... మీరు రాలేదు...నేను రాలేకపోయాను.

రఘు : శారీ! యిదంతా కలా! నిజమా! చెప్పు! నిజం చెప్తున్నావా?...నా చెవుల్ని నేనే నమ్మలేకపోతున్నా!

శార : ఈ క్షణంకోసం ఎన్నాళ్లు తపస్సుచేశాను!

రఘు : ఎన్నాళ్లు తపిస్తూ బాధతో గడిపాం!

శార : మరి ఆ నరకం మనకొద్దు!

రఘు : నీవు కావాలన్నా నేనొప్పుకోను (దగ్గరకు తీసుకుంటాడు).

శార : (కౌగలినుంచి విడిపించుకొని) నాన్నగారు ఈ ఉత్తరాలూ, యిదీ ఉంచమని యిచ్చారు.

రఘు : (ఉత్తరాలూ, పెట్టె చూచి) ఒద్దు! యిదే మన బాధలకి కారణం!...అది నీది!... నీదగ్గరే ఉంచనీ! నాకొద్దు-

శార : అత్తగారితో చెప్పొచ్చా?

రఘు : (ఆలోచించి) చెప్పు! భయందేనికి?...వీధి తలుపు వేశావా?...

శార : ఏం?......వేశాను...కాఫీనీళ్లు పెట్టాలి కుంపటి ముట్టించి...

రఘు : కాఫీ వొద్దు—గీఫీ వొద్దు ఈ మధుర క్షణా లలో నిన్ను విడిచివుండలేను.

శార : (చిరునవ్వు నవ్వుతూ అతన్ని సమీపించు తుంది.)

[బైట తలుపుతట్టిన శబ్దం—"శారదా" అని అత్తగారి పిలుపు—శారద తలుపుతీయ టానికి బయటికి వెళుతుంది. రఘు నిస్పృహతో నిట్టూర్పు]

[తెర]

* చివరిమాట:—కట్నాల నిరోధానికిది ఒక సూచన అనిమాత్రం పొరపాటున కూడా భావించవద్దని మనవి. —రచయిత.

# నివృత్తి

**'శాండిల'**

అనుకున్నంతా అయింది—

మేష్టారు పడుకున్న మంచం వార గోడ చీట వారి వుంటుంది—"దభీ" మంది. అప్రయత్నంగా లేచారు. చీకటిలో తడుముకుంటూ వీధి గుమ్మంవైపు వస్తున్నారు. దారిలో మంచం ఎవరు ఎప్పుడు వాల్చారో తెలీదు. పట్టుకుతాకింది మోకాలి క్రింద పొడుచుకు వచ్చిన ఎముక. చటాలున పడిపోయారు మేష్టారు. పడిపోకూడదనుకుంటూనే, నిలదొక్కుకోవడానికి తాపత్రయపడుతూనే పడిపోయారు. మేష్టారు మంచంమీద పడ్డారు. వద్దపళంగా లేద్దామనుకో లేకపోయారు. కాళ్లు చేతులు, మెలి తిరిగినట్లు, ఆయన మనసు ఇచ్చే ఆజ్ఞలను పాలించలేదు.

మంచంపై పడిన వెంటనే కోడుకొసకు ఆయన నుదురు కొట్టుకుంది. దిమ్మెక్కిపోయి వుంటుంది.

మంచంపై పరున్న వ్యక్తి లేచింది. మెలుకువ పొందింది. తన మీద నున్న వ్యక్తిని చివాల్న నెట్టి నెయ్యడానికి కలగ్రదొక్కుకుంది. మేష్టారు లేవ గలిగారు. గడప దాకా నడవ గలిగారు—అగ్గిపెట్టెకోసం ఆయన చేతులు గూటిలో తడుముకుంటున్నాయి. ఇంతలో మంచంమీదినుంచి లేచిన స్త్రీ వ్యక్తి ఆవేశంతో కోపంలో అంటున్న మాటలు స్తంభీభూతులై వింటున్నారు మేష్టారు.

"—ఛీ! ఇన్నేళ్ళుగా కనిబూనిన త్రాచు పగను కానుకోలేకపోయాను. పురుషులు మాత్రం అంతా నీచంగా వుంటారా అని భ్రమించాను—ఎంత పని జరిగింది! ఒంటరిగా నిద్రలో వున్నదాన్ని, అర్ధరాత్రి వేళ, దీపం ఆర్పేసి—మీదబడడం—ఛీ! ఛీ! ఎంత దారుణం—ఎన్నేళ్ళొచ్చి ఏం ప్రయోజనం? అంతా అంటూంటే అడిపోసుకుంటున్నారనుకున్నా గాని నిజం గమనించలేకపోయాను—" శిష్యురాలు సుశీల అంటున్న దూషణ వాక్యాలు వినలేక చెవులు గట్టిగా మూసుకున్నారు మేష్టారు. ఆయన అవయవా లేవీ పని చెయ్యడం లేదు. ప్రపంచంలో ఎందరు తన్ను గురించి ఎన్ని కట్టుకథలు ఎలాగ ప్రచారం చేసుకున్నా లక్ష్యం చెయ్యలేదు మేష్టారు. సుశీల నన్ను అనుమానించనంత వరకు ఈ సమాజం మధ్య నిర్భయంగా మసల వచ్చు ననుకున్నారు.

అంతపనీ అయి పూరుకుంది—సుశీలే ఆయన్ను అనుమానించేసింది— 'రేపు ప్రొద్దు మొగం చూడడం ఎలాగ? సుశీలతో మళ్ళీ మాట్లాడ గలనా? అరే—ఇప్పుడు నేను ఏ ముక్కన్నా వ్యర్థ వివరణ కాగలదే' మననపడుతూ గడపకు అవతలనే కూలబడి పోయారు. అరిచి అరిచి నోరు నొప్పిపెట్టి ఊరుకుంది సుశీల. మిగిలినరాత్రి ఇక అవతల మేష్టారికీ లోపల సుశీలకు నిద్ర కూడా లేదు.

తూరుపురేఖలు పొడిచినై. సుశీలే ముందుగా ఈవలకువచ్చింది-కాదు ఈసరికే మేష్టారుబయటవున్నారు. ఆమె ఆయన్ను చూసింది. ఆయనా చూశారు ఆమెను. అయితే సుశీలే మేష్టార్ని సరిగా చూడలేదనాలి. నిన్నటి సుశీలే అయితే ఆయన్నిపాటికి ఎన్నో ప్రశ్నలు వేసి ఉండేది. ఆపరిస్థితిలో ఉన్న మేష్టార్ని చూస్తూ ఊరుకోవడం మటుకు ఆమె వశంలో ఉండదంటే అతిశయోక్తి కాదు. ఒకరినొకరు చూసుకునీ మాట్లాడుకోలేదు. సుశీల ముఖంతీరు చూడగా మేష్టారు మాట్లాడకపోవడం ఆమెను మరీ కలవరపెట్టినట్లు అవుపిస్తుంది. మంచం ఎత్తి గోడకు చేరవేసింది. చీపురు తీసుకుని వాకిలి ఊడ్చింది.

హాలుకూడా శుభ్రం చేసి మేష్టారి మంచం క్రింద గోడవార తుక్కు, సున్నపు పెల్లులూ ఉంటే తుడుద్దామని వంగింది. చేతిని చాచి చీపురు కోసను ఆడిస్తోంది "సుశీలా! ఇలావచ్చెయ్. తొందరగా! రావాలి" మేష్టారు అన్న మాటలు ఉరిమినట్టు ఆమెకు వినిపించాయి—ఆమెలో రాత్రినుంచీ గూడుకట్టుకుని

ఘనీభవించిన అవమానాన్ని అనుకోకుండా వ్యక్తం చేస్తూ, "హమ్మయ్య!" బ్రతికి పోయాను అనుకొంటూ ఆమె చేసే గాఢమగు నిట్టూర్పును విడిపిస్తూ, రాత్రి అవగా బీటలు వారిన గోడ 'ఫడక్' మని ఒక్కసారి కూలి పోయింది. రెండు పెద్ద అండలుగా చీలిపోయిన గోడ పైన బడటంతో, మంచం, కోళ్ళకొసకు విరిగి, చాప వత్తుగా నేలకరిచింది. నిజంగా ఆ క్షణంలో మేష్టారు మాట్లాడి ఉండకపోతే సుశీల ఈ పాటికి పచ్చడై పోయేది. ఈ ప్రమాదం చూడలేక చటుక్కున కళ్లు మూసుకుంది.

సుశీల కళ్లు తెరిచింది. విడివడ్డంతోనే ఆ నేత్రాలనుండి వికసించిన కలువలనుండి సౌరభం విరజిమ్మబడ్డట్లు ఆనిన నూతన కాంతుల్ని చూసిన మేష్టారు ఆవేళకు తొలిసారిగా చిరునవ్వునవ్వారు. సుశీల చుట్టు ప్రక్కల్ని సరిగా చూడగలిగింది. వస్తువులన్నీ కనబడ్డాయి- మేష్టారిని మరీమరీ చూసింది. "అయ్యో! ఎంత బొప్పిగట్టిందో" అంటూ అప్రయత్నంగా ఆయన నుదుటి మీదికి తనచేతిని పోనిద్దామని ముందుకు దూసుకు వచ్చింది. "రాత్రి దీపం కొండెక్కితే వెలిగిద్దామని వెడుతూంటే దారిలో మంచం తగిలి పడి పోయాను. నుదుటికి కోడుకొస తగిలి బొప్పిగట్టింది." ఆయన ప్రత్యుత్తరం అతిభారంగా దిగమ్రింగి "మోకాలు ఇలా చాచండి—అబ్బ! ఎంతదెబ్బతగిలిందీ?" సుశీల బాధతో ప్రశ్నించింది. మేష్టారు నవ్వారు. ఆ నవ్వు సుశీల వైపు అనవసరంగా అకారణంగా తాను అలిగిన మిత్రుడు రాజీకి వస్తున్నట్లు లీలగావచ్చింది. ఆ నవ్వును చూడలేక తల వొంచుకున్న ఆమెను కనిపెట్టినట్టు "ఎవరికి తెలుసు రాత్రి నీవు వచ్చావనీ, మంచం వాల్చుకు పడుకున్నావనీనీ? ముందే తగిలింది పక్కె మోకాలికి." అని పూర్తిచేశారు. సుశీలను ఎవరో ఎదలో పొడిచినట్లయింది. సిగ్గుతో బిక్కచచ్చి పోయింది. ఈ మాటలే గనుక రాత్రిఎలాగైనా ఆయన తనకు చేరవేసివుంటే అవి తన అనుమానాగ్నిలో ఆజ్యమై దానితీవ్రతను ఇనుమడింప చేసి ఉండేవి. ఇలా తెల్లవారేదీ గాదు.

సుశీల - ఎంతచెడినా ఆడుది గనుక - ఇట్టేమనసు తిరగేసుకుంది. ఏమీ జరగనట్టు: "ఎన్నాళ్ళనుంచో చెబుతున్నాను ఈ పాతికొంప వదిలెయ్యమని— 'ఎప్పుడూ ఇది మాతాతల నాటినుంచి వస్తున్న భవనమనీ, ఈ వడవలోగూర్చొని వేలాది విద్యార్థులు చదువుకొని పెద్ద పెద్ద హోదాల్లోకి వెళ్ళారని, తరతరాలనుంచీ ప్రసిద్ధికెక్కిన ఈ గొప్పయింటిని విడిచిపెట్టననీ భీష్మించి కూర్చున్నారు. ఇంక వదలకేం చేస్తారు" అని తనుపెనదోవన బట్టించిన బండికూడా వస్తోందా లేదా అన్నట్లు మేష్టారిముఖంలోకి చూసింది. ఆయన దీన్నంతను పసికట్టారు. ఇంక ఆమెను అట్టే కష్టపెట్టదలచుకోక "వదిలెయ్యవలసివస్తే తప్పుతుందా సరే. బాగానే ఉంది" అని లేచారు. చుట్టుపక్కల నలుగురూ ఈ చోద్యం చూడ్డానికి విరగబడ్డారు. వారిలోకొందరు అమ్మలక్కలు తమలో "కాన— ఈవి డిక్కడేవుందా.అయితే రాత్రిగూడాఇక్కడే.. ఆయన్నీగ్రహం వదలనంతకాలం ఆకాపురం ఇంకెలా కుదటబడుతుందీ?" అంటూ సాగదీసుకోవడం మేష్టారూ, సుశీలాగూడా ప్రశాంతంగానే — అది వారిరువురికీ పాతపాటే—విన్నారు.

*     *     *     *

"విద్యాలయంలో ప్రమాదం జరిగిందిట విన్నారా?"

"విన్నాం."

"ఓసారి అటువెళ్ళి పలకరించలేకపోయారా?"

"అంత అవసరం మాకేం లేదు."

"ఔనుగానీ - అలాగే పంతంబట్టుకు కూర్చుంటారా? ఎంతచెడినా మీరు మామగారు గాదా వారు అల్లుడుగాదా? పట్టింపులు వస్తూంటాయి పోతూంటాయి. ఆడపిల్ల నిచ్చుకున్నారు. పైగా బావమరది; ఇవ్వాళ గాకుంటే రేపైనా కలుసుకుంటారా లేకపోతే కలకాలం అలాగే వుండిపోతారా" మేష్టారి బావమరిదిని సతాయిస్తున్నాడు ఓ పెద్దమనిషి. ఇంతలో మేష్టారి అప్పగారు, పిల్లనిచ్చిన అత్తగారూ ఇంట్లో వుండి వినివిని అమాంతంగా బయటికి దూసుకొచ్చి "మీకుగా మీరే వచ్చారా—లేకపోతే ఎవరేనా పంపారా?" అని అందుకుంది.

"ఒకళ్ళచేత చెప్పించుకోకుండా ఈపాటికి మీరే వెళ్ళి పలకరించి వుండాల్సింది. కష్టానికీ సుఖానికి మానుకుంటారా? ఎవరేనా పంపేదాకా నాకేం పనమ్మా—అక్కా తమ్ముడూ ఎడముఖం పెడముఖం ఇలా ఎంతకాలం పడుంటారని అంటున్నా."

# నివృత్తి

"ఏమిటోలే—ఆ సోమిదేవమ్మగానీ పంపిందేమో అనుకున్నా. పుడతారు భూమిమీద జాణలు, కాపురాలు పడేసుకోడానికి. కాకపోయినా దాన్ని అనవలసిన పనేముంది లెండి — మనబంగారం మంచిదిగాదు ఇంతకీ"—

"ఏంవయ్యోయ్ — ఎవరో అంటే కామోసు అనుకున్నా — సుశీలను అన్నవాళ్ళనోట పురుగులు రాలతాయి. చిన్నతనంలో పెనిమిటి ఆమె ముఖాన ఇంత బుగ్గిపోసిపోతే మానమర్యాదలకి కట్టుబడి పాము కుళ్ళవలసిన స్నేళ్ళ పాడుబతుకు బండలాగ ఈడ్చుకొస్తోంది. ఎన్నాళ్లు ఒకళ్లకు బరువుగా ఉంటావని నాలుగుముక్కలు నేర్పుకుంటూంటే మాని ఓర్వలేని పాడులోకంతోబాటు నువ్వూ..."

"అవున్నాయనా! పొరబాటే—ఏదో ఉబుకు ఆపుకోలేక అన్నానుగాని—ఇటు కూతురు. అటు తమ్ముడూ—కడుపుచించుకుంటే కాళ్ళమీద పడుతుంది."

"ఇంకంతే మనకేదితోస్తే అదే వాగడం. మంచీ చెడూ ఉండక్కర్లెదూ—నోటికి శుద్దీబుద్ధీ వుండాలి, కూతుర్ని కాపురానికంపక గువ్వపిట్టలా కులకబెట్టుకుంటున్నందుకు సిగ్గుపడక తగుదునమ్మా అని నాలుక బుజానవేసుకుని ఆడిపోసుకుంటున్నావు. తొందరపడకు—ముందున్నది ముసళ్లపండగ" విదిలించుకు వెళ్లిపోయాడు; పోనీ—ఈ సందర్భం పురస్కరించుకొనైనా—తనకు ఉభయపార్టీలమీదా చనవు, స్వతంత్రమూ ఉన్నాయి గనుక — మేష్టారికీ, పెళ్లానికీ పొత్తు కుదురుద్దామనివచ్చిన ఆసామీ.

లోగడ రెండుమూడు దఫాలు ప్రయత్నించి ఊరుకున్నాడు—అయితే మళ్లీ సుశీల బ్రతిమాలడం వల్ల, తనకు మేష్టారికీ ఏదో సంబంధం ఉన్నదని ఊరంతా గుణించుకునే అనుమానాన్ని ఎలాగ త్రుంచివెయ్యాలా, ఏవిధంగా మేష్టారి జీవితాన్ని సుఖమయం చెయ్యాలా అన్న ఆమె ఆతుర్దానుబట్టి వచ్చాడు. కాని ఈ అస్త్రమూ పనిచేయకపోవడంతో సుశీల నిరాశ చెందింది. సాయంత్రం పనిగట్టుకుని నీలాటి రేవులో కాసి తనపిలుపును వినడానికైనా ప్రయత్నించని విశాలాక్షిని అడ్డుకుని బలవంతాన చెయ్యిపట్టుకు చింతచెట్టుక్రిందికి లాక్కెళ్లి "విశాలా! చిన్నదానివి. చెడగా చెడగా కాపురాలుకావు. ఇవి చేతులుగావు కాళ్లు. మళ్ళీచెబుతున్నా—క్రింద భూదేవిసాక్షి—పైన ఆకాశంసాక్షి—చెరువులో కెరటమేసే గంగమ్మసాక్షి. నేనేపాపమూ ఎరగను-మేష్టారు సాక్షాత్తు భగవంతుడు—ఒకళ్ళతో పనేంవిటీ—నాతోవచ్చెయ్ ఆయన నిన్ను నెత్తిమీద పెట్టుకుంటాగు." బ్రతిమాలి కంట తడిపెట్టుకుంది. "రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా?" అన్నధోరణిలో సుశీలమాటలను వింటున్నట్లు విశాల ఒక్కవిసురుతో ఆమెను కసరికొట్టి "చాలుచాలు ఇప్పుడంటే అన్నావుగాని ఇంకెప్పుడూ ఇలాగనకు. పైగా నీతులు గూడా చెప్పొచ్చావు" అంటూ తూలనాడింది. విశాలమాటలను సుశీల వినలేకపోయింది. కళ్ళనెంబడి నీళ్లుధారగట్టాయి. 'ఛా! ఏం బ్రతుకు నాది! నే నెవరికోసం జీవించాలి? ఊరు ఊరంతాడప్పుగట్టుకు చాటుతోంది. పాపం! మేష్టారు మటుకు ఏంచేస్తారూ—ఆయనకేవుంది, నేను తమకు దూరంగావాలని — నేనే — ఏంవిటో ఆయనకష్టం చూడలేక పోతున్నా — నాకెందుకు ఈ బాధలు కల్పించబడుతున్నాయి? ఏదో నెపాన ప్రాణం తీసుకుంటే' అనుకొని చెరువుకేసి చూసింది. నిండావున్న నీటితో దబకలాడుతూ చెరువు ఆమెను ఆహ్వానించినట్లై అటు గట్టువైపు నడిచింది.

చీకటి ఆవరించడానికి ఊరుమీదికి వల విసురుతోంది. గట్టుమీదినుంచి గంగ త్రుళ్ళింతలుమాచి చేయెత్తి ఆ అమ్మకు నమస్కరించి ఉరకడానికి ఉద్యుక్తురాలైంది. సాహసం స్త్రీలసొమ్మే అయినా సుశీల ఏమిటో దుమికేసేటంతటి దుస్సాహసానికి ఒడిగట్టలేక పోయింది—

"సుశీలా! ఆత్మహత్య అబలత్వానికి నిదర్శనం-చచ్చి నీవు ఏం సాధిస్తావు. నీవు మరణించినంతమాత్రాన నీపై నీలాపనింద పోతుందా-కాగా అది స్థిరపడుతుంది. సమాజం నీమీద ప్రచారం చేస్తున్న అనుమానం నివృత్తికావాలంటే ఇది మార్గం కాదు—లే—వెనక్కుమళ్ళు ఆత్మ విశ్వాసంతో కష్టాల నెదురించి విజయం సాధించు" ఆమె అంతరాత్మ అందించిన అమరసందేశాన్ని వింటూ ఆ పడుచు గడగడ వణికిపోయింది. తరంగాలవలె ఉవ్వెత్తుగా విజృంభిస్తున్న ఉద్రేక పూరితభావాలను అదుపులో పెట్టు

కుంది. క్షణంలో ఆమెకు ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. చరచరనడుస్తూ విద్యాలయం చేరుకుంది.

* * *

"సుశీలా! ఇవాళ వంట ఎంత బాగాచేశావు! పాకంబాగా కుదిరిందిసుమా" అంటూ కొసరి కొసరి వేయించుకుని భోజనంచేసిన మేష్టారినిచూచి సుశీల మిక్కిలిగా తృప్తిపొందింది. ఆయన లేచిన తర్వాత ఆమెకూడా పూర్తిచేసుకుంది భోజనం. గిన్నెలు మూతపెట్టి హాల్లోకి వచ్చే సరికి పాఠంచెప్పడానికి సిద్ధంగా ఉన్నారు మేష్టారు.

ఎన్నడూ చెప్పనంత ఆసక్తితో చెబుతున్నారు పాఠం—గానంలో తుది స్వరం, తేనెలో చివరిబొట్టు, నృత్యంలో కడపటి అడుగు, కథానికలో ఆఖరి విరుపు మధురాతి మధురంగా ఉంటాయి. పాఠం ముగిసిందో లేదో మేష్టారు ఏదో చెప్పడానికి భారంగా ఉపక్రమించారు.

"సుశీలా! ఇదే నేను నీకు చెప్పేపాఠానికి కడ అనుకుంటాను" సాహసించి ఆయన హృదయం బహిర్గతమొనర్చె భావాన్ని వ్యక్తీకరించలేకపోతున్నారు.

"మేష్టారూ!"

"ఔను—సుశీలా—నే నెందుకూ ఇంకా ఇక్కడ ఉండడం. ఎవరికోసం ఈ నిరీక్షణ—చూచి చూచి కళ్లు కాయలు కాశాయి. బయలుదేరిన ఇరువురూ ఒకరి కొకరు ప్రతిమార్గాలలో పయనిస్తున్నారు. ఇంక వీరి కలయిక..."

"మేష్టారూ! భూమి గుండ్రంగా వుంది. అవలి అంచునైనా రెండురేఖలూ కలియవూ?"

"ఇవి నిర్జీవమైన రేఖలుకావు. రక్తమాంసాలతో, చీమునెత్తురులతో, వెలుగు చీకట్ల అనుమాన ఆవేశాలతో మసలే మానవప్రకృతులు"

"మనసులు ఎప్పుడూ మారవనుకోవడానికి వీల్లేదు."

"అదే ఆశతో చూశాను. ఆమెకోసమని ఆయాసపడ్డాను. పోనీ—దానిమాట అటుంచు—ఇలాగైనా లోకం బ్రతకనియ్యడం లేదు. ఆప్తులైన శిష్యులు అనుమానించారు. బంధువులు ప్రతిఘటించారు. విధికి సైతం కంటగింపుగా వుంది. విద్యాలయం కూలిపోవడమేమిటీ లేకపోతే? నేను ఎవరిపైనైతే భరవసా ఉంచుకున్నానో వారూ నన్ను అపార్థం చేసుకుంటే?!" ఆయన కంఠం రుద్ధమైంది. సుశీల వినలేకపోతోంది. ఆమెకళ్లనీళ్లు క్రమ్మాయి—

"దుఃఖిస్తున్నావా?"

"లేదు—మేష్టారూ! నే చేసిన పాపానికి నిష్కృతి లేదు."

"సుశీలా! నీవు మనిషివని ఎందుకు మరిచిపోతున్నావు? ఎంతటి కాంతిమంతమైన వజ్రంకానీ డాకురేకుతాపనిదే తళుకురాదు. శౌశీల్యానికి కించిత్తు నలుపులేనిదే పరిపూర్ణత్వం ఉండదు".

"ఇంతటి ధారణశక్తి భూమిమీద ఏ కొద్దిమందికో ఉంటుంది".

"నాపై అభిమానం అట్లా గనిపిస్తుంది".

సుశీల మేష్టారిలో ఆత్మవిశ్వాసం పాదుకొల్పాలని—

"సాయంత్రం ఒక సంగతి జరిగింది. విశాలను నీలాటిరేవులో కలుసుకున్నాను—ఆమెను ఎంతో ప్రాధేయపడ్డాను నా మనవి విని మీ దగ్గిరి కొచ్చెయ్యమని" అంటూంటే "రానన్నదిగా - నాకు తెలుసు- సుశీలా! అట్లాంటి ఆడుదాన్ని బ్రతిమాలడంచేత నీ గొప్పదనానికి కూడా వెలితి—తుదకు నిన్ను సహితం బాధ పెడుతున్నాను. అందుకే ఇంక ఎంతమాత్రం ఆలశ్యం చెయ్యకూడదని ఒక నిర్ణయాని కొచ్చేశాను. సుశీలా! నే చేసేది నేరంకాదనుకుంటున్నాను. అయినా చేసేముందు ఆప్తులతో చెప్పేస్తే ఆ దోషం నివృత్తి అవుతుందనుకుంటున్నాను — నేను రేపు నీకు కనుపించను. నీకే నేమిటే—ఈ ఊరికే కనబడను" సుశీల వజ్రకఠోరమైన ఈ నిశ్చయం విని వణకిపోయింది. 'ఓహో! ఈయన దీన్ని వెల్లడి పరచడంవల్ల ఎంత మేలు కలిగిందీ!' అనుకొని "నన్ను సాంతం చెప్పనియ్యండి".

"చెప్పూ"

"విశాల నాఅభ్యర్థన పాలించకపోవడంతో నాకు జీవితంపై ఆశపోయింది. ఆ సంజ చీకటిలో చెరువులో కురికి ఆ గంగాభవానికి తనువు అర్పిద్దామని గట్టెక్కాను", మేష్టారు చకితులయ్యారు. మెరుపువలె భావవీచిక ఏదో ఆయన ఉష్ణతీక్ష్ణ హృదయాన్ని దూసుకు

పోయింది. "సుశీలా! నిజంగానా! అంతటి అఘాయిత్యాని కెందుకు ఒడిగట్టావు?"

"మేష్టారూ! నేను ఎవరికోసం బ్రతకాలి—ఊహ తెలిసే సరికే పసుపూ కుంకుమా భ్రష్టమయ్యాయి. గానుగెద్దులాగ బరువుగా బ్రతుకులాగుతున్నా, ప్రపంచం గ్రుడ్లలో నిప్పులోసుకుంటోంది. నన్ను నమ్మినవారి దారిలో ముళ్ళకంచనైనాగూడా ఇంకా బ్రతకాలా".

"అందుకని ఆత్మహత్యకు—".

"ఆఁ-అందుకే తెగించాను. కాని ఆరీత్యాగూడా ఈ ప్రాణి విరగడకాలేదు. గట్టుమీద నిలబడి నీటిలోకి దుముకలేకపోయాను. ఆశ చెడ్డది. ఏమూలనుంచో ఆత్మవిశ్వాసాన్ని పుంజుకొస్తుంది. నాలోంచి ఎవరో బలంగా బయటకు నెట్టేనట్లై తిరిగి వచ్చేశాను".

"సుశీలా! నీ తెగువ సాటిలేనిది. పిరికివాళ్ళకు ధైర్యం అందించావు" మేష్టారుకి అప్పటివరకు ఉన్న ఊహ దీనితో తారుమారైపోయింది. చావుకు తెగించిన ఒక ఆడుదానిలో ఉవ్వెత్తుగా లేచిన భావతరంగం లోకాన్నెదిరించి బ్రతుకలేక పలాయనం చిత్తగించే పారుబోతైన పురుషుని నిలవమని సవాలు చేస్తోంది. పురుషుడి అభిమానం గాయపడింది. "ఛా! ఎంతటి చెడు నిశ్చయం చేసుకున్నాను" తన్ను తానే అసహ్యించుకున్నారు మేష్టారు - చదువుకుని, పెరిగి పెద్దవాడై, లోకానుభవం గడించి, కష్టసుఖాల్ని చవి చూచిన మేష్టారు తృణంక్రితం తనను చుట్టివేసిన బలహీనత అనే వలనుండి బయటికొచ్చివేశారు.

"ఇంకెప్పుడూ అలాంటి నీచకృత్యం చెయ్యనని ఒట్టుపెట్టు"—చేతిని ముందుకు చాచారు. "చెయ్యను" సుశీల కుసుమ కోమలహస్తం మేష్టారి చేతిని అదిమింది. పరస్పర సుహృద్భావ సహకారాలతో జీవితంలోని దుఃఖసాగరానికి సేతువు బంధించనిడింది. స్త్రీ పురుషుల వాగ్దానంతో "మరి మీరు" అతిజాలిగా, సూటిగా ఈ నాలుగక్షరాలు ఆమెనుండి వచ్చి ఆయన హృదయంలో చీకటిగదిలో వెలుగుకిరణాలు పాకుచున్నట్లు ప్రతిధ్వనించాయి. మేష్టారు సిగ్గుపడిపోయారు. "లేదు-సుశీలా! నేను నిన్ను ఎన్నటికి విడిచివెళ్లను. ఇంతటి బలమైన ఆధారంపై నిలబడి దీన్నే వజ్రాయుధంగా లోకపు కూగ విమర్శలను ఎదుర్కొని విజయం సాధించగలనని హామీ ఇస్తున్నాను". సుశీల మందహాసం చేసింది.

*      *      *      *

మర్నాడు ప్రొద్దుటనే సుశీల పినతల్లి దుఃఖిస్తూ విద్యాలయానికి రావడం మేష్టార్ని ఆశ్చర్యంలో ముంచితేల్చింది. మేష్టారి చిరునామా ఉన్న కవరును ఆమె ఆయనకు చూపించి: "రాత్రి ప్రొద్దు పోయీదాకా ఇక్కడే ఉన్నదట. భోజనంకూడా ఇక్కడే చేసిందట. ఎంతోసేపు ఈ గొడవే చెప్పింది. తెల్లారి చూస్తే లేదండీ" అంటూన్న ఆమెను ఆపి.

"లేదంటే — ఎక్కడికి వెళ్లినట్టు" అడిగారు మేష్టారు.

"మొదట్లో నేను ఏమీ అనుకోలేదు. ప్రక్క తీస్తూంటే తలగడ క్రిందవున్న ఈ కవరు చూడ్డంతోనే అది ఏదో అఘాయిత్యానికి ఒడిగట్టిందని తేల్చుకున్నాను. వారం పదిరోజుల్నుంచీ దిగులుతోనే వుంటోంది. కారణం అడిగితే ఏమీ చెప్పేదిగాదు. ఎంతసేపూ మీ గొడవే-పోతే ఊరంతా ఆడిపోసుకుంటున్నారని వాపోయేది-చిన్నప్పుడనగా తల్లీదండ్రీ పోతే, ప్రాయం వచ్చీరాకుండానే మొగుడు ముక్కలైతే నా కూతురొకటి, మా అప్పగారిపిల్ల ఒకటేనా అని కడుపులో దాచుకు పెంచుకుంటూ వచ్చాను—దానిరాత అలా బ్రద్దలౌతుందని కలగన్నానా? ఎక్కడికి పోయిందో ఏమిటో...."

మేష్టారు తలవంచి నేలవైపు చూస్తూ పాలుపోని ఆలోచనలో పడ్డారు. రాత్రి అన్నికబుర్లుచెప్పి తనను నిలబెట్టిన సుశీల తెల్లారేసరికి మాయమవడంలో ఆంతర్యం ఆయనకు అర్థంకావడంలేదు. ఏడ్చి ఏడ్చి ఆమెపినతల్లి వెళ్లిపోయింది— "పాపం! ఆమె కేం కష్టమొచ్చిందో" అని సానుభూతి ప్రకటించారు ఆమె హితులు. అదేపనిగా ఇతరుల్ని ఆడిపోసుకొనేవాళ్లు: "శని విరగడైంది. ఇంక బాగుపడుతుందేమో ఆయన సంసారం. ఔనూ తప్పుచేసి లోకానికి ముఖం చూపెడుతూ ఎలా మసుల్తుంది. పోయిందో పీడా పోయింది" అని లోపల్లోపల తుచ్ఛసంతృప్తి పొందారు. మేష్టారి అప్పగారికి, భార్య విశాలకీ ఈ వార్త చేరింది. "ఇంక దారికి రాకేం చేస్తాడు. చచ్చినట్టు వస్తాడు కుక్కలాగ మనింటికి. ఇన్నాళ్లూ అంటే అది వండి ఢిపేసి అడ్డమైన చాకిరీచేసి, అతగాడి ఇష్టమొచ్చిన

ట్లల్లా ఆడిందిగనుక తెట్టుచూసేదు—రేపటినుంచీ తెలుస్తుంది అయ్యగారిపని" అని అదికూడా తమ మేలుకే వచ్చిందని ఆనందించారు. ఇవన్నీ తెలిశాయి మేష్టారికి. మౌనమే ఆయనకు శరణ్య మయ్యింది.

సుశీల వెళుతూ మేష్టారికి వ్రాసిన లేఖ—

పూజ్యపాదులు మేష్టారికి!

సాదర నమస్కారములు. నేను ఎక్కడికి వెళుతున్నానో ప్రస్తుతం వ్రాయలేను. కాని ఒక ప్రత్యేక కార్యార్థమై ముందుకెళ్లుతున్నాను. నా సంకల్పం మంచిదిగనుక తప్పక విజయం సాధించితీరుతా ననే ధీమా నాకు ఉంది. నేను మళ్ళీవచ్చి మిమ్మల్ని కలుసుకొనేదాకా మీరు విద్యాలయంలోనే ఉండవలసినదిగా నా ప్రార్థన. దీన్ని తప్పకుండురని నా విశ్వాసం. నా తలంపు నెరవేరిననాడు మీ నా బ్రతుకు బాటల్లో ముళ్లకంచెలు వాటంతట అవే వైదొలగిపోతాయి. ఇది తథ్యం. ఇంతకన్న ఇప్పుడేమీ వ్రాయలేను. వ్రాయగూడదు.

పునఃపునః ప్రణామాలతో శలవుతీసుకుంటున్న
భవదీయ,
సుశీల.

ఉత్తరం మళ్లీ మళ్లీ చదువుకున్నారు మేష్టారు. సుశీల సాహసానికి ఒడిగట్టుంటుందన్నది ఖాయపడింది. కాని అది దుస్సాహసం కాదని తేలిపోయింది. ఇంక ఆమెరాకకై నిరీక్షించడం వినా ఆయనకు కర్తవ్య మింకొకటిలేదు.

సుశీల ఎక్కడికో ఎందుకో వెళ్ళిపోయిందంటే ఊరికొకవార్త. కాదు అదొకవదంతి. వారంరోజుల పాటు చాలామందినోట ఇదేపలుకు. ఆడాళ్లగుసగుసలు మరీని. మేష్టారు ఇవన్నీ వినివిని రాటుదేలారు. తొలి చినుకుకే వొళ్లు పులకరిస్తుందిగాని, జడివానలో తడి శాక వణుకువుండదు. ఎవ్వరికీ ఎట్టిప్రత్యుత్తరమూ ఇవ్వడంలేదు. ఆడా మగా వందమందికిపైగా వచ్చే విద్యార్థులు సగానికితగ్గి పదిహేనుదాకా పడిపోయారు. వాళ్లూ వస్తున్నారంటే ఎందుకొస్తున్నారో వాళ్లకే తెలియనట్లుంది. "మీరు ఏవనుకుంటున్నార్రా?" అని ఆయన వాళ్లను నిగ్గదియ్యనేలేదు. "ఇదేవిటండీ" అని వాళ్లు ఆయన్ను అడగనూలేదు. నెలరోజులు అలాగే చెయ్యికాల్చుకుంటూ మేష్టారు విరుసుగానే వుండిపోవడం, వెనకటివలె మన్యవర్తులెవరు తన కాపురం పొత్తు చెయ్యడానికని రాకపోవడం విశాలాక్షికీ, తల్లిదండ్రులకీ నిరాశనే సూచించింది. ఇదీ కనిపెడుతూనే వున్నారు మేష్టారు.

సరిగా నెలదాటింది సుశీల వెళ్లిపోయి. మేష్టారికి విజయనగరంనుంచి ఒక కార్డు వచ్చింది.

ప్రియమైన మేష్టారికి

మీ మిత్రుడు వెంకటేశ్వర్లు నమస్కరించి వ్రాయునది. సుశీలను గురించి భోగట్టా చేయవలసిందంటూ మీరు వ్రాసినఉత్తరం అందింది. ఆవిషయమై దర్యాప్తుచేయడం కారణంగా మీకు వెంటనే సమాధానం వ్రాయలేకపోయాను.

మీరు అనుకున్నట్టు ఆమె ఇక్కడకు వచ్చిన మాట వాస్తవమే. మొన్న ఆఫీసునుంచి వస్తూంటే సుశీల కనుపించింది. ఆమె, మా ఆఫీసులో గుమాస్తా కలిసి జట్కాలో వెడుతున్నారు. నిన్న మధ్యాహ్నం ఆగుమాస్తాను సుశీలనుగూర్చి అడిగాను. ఆమె ఈయనకు దూరపుబంధువట. వివాహానికై ప్రయత్నిస్తున్నదట. సంబంధంకొరకు దర్యాప్తుచేస్తున్నట్లు తెలుస్తోంది. మళ్ళీ ఆమె నాకు కనబడలేదు—శలవు—

భవదీయుడు,
వెంకటేశ్వర్లు

ఉత్తరం చదువుతూంటే మేష్టారు వణకిపోయారు. ఉన్నట్టుండి సుశీలకు ఆ ఊహ ఎలా తట్టింది. భర్త పోయిన ఇన్నేళ్ళకు మళ్ళీ పెళ్లి చేసుకోబోతోందా? ఏవిటీ వైపరీత్యం? మేష్టారుకేమీ పాలుపోవడం లేదు. తనను, తాచేసుకోబోయే భర్తను నేను ఆశీర్వదించాలనేనా ఆమె తాను తిరిగి వచ్చేవరకు నన్ను ఎక్కడికీ వెళ్ళవద్దని అభ్యర్థించింది? ఇప్పుడేవిటీ చెయ్యడం? ఎక్కడికేనా పోవడమా? లేక ఆమెకై పడివుండడమా? సుశీల పతీసమేతంగా వస్తే ఊళ్ళో అంతా ఏమనుకుంటారు—తుదకు ఒకే ఒక సందేహం తటుక్కుమన్నది ఆయనహృదయ ఫలకంపై—సుశీలగానా ఈ మార్గం ద్వారా తనపై సంఘంవేసిన అనుమానాన్ని నివృత్తి చేసుకోదలచిందా?

*　　　*　　　*

ఒకనాడు విద్యాలయంలో మేష్టారు వంటకోసమని పొయ్యి ఊదుకుంటుంటే ఊడిపడింది సుశీల "ఏ మండోయ్-ఏం చేస్తున్నారు?" అంటూ.

# నివృత్తి

"ఇదిగో చూస్తున్నావుగా—నీవు వెళ్ళినప్పటి నుంచి ఇదేవరస!" మేష్టారి కంఠంలో కోపం ధ్వనించ డానికి ప్రయత్నించింది. "ఊఁ ఇదేనా రావడం?" అడిగారు.

"ఔను-ప్రొద్దుట బండిలో వచ్చాను. ఇంకా ఇంటికేనా వెళ్ళలేదు" నవ్వు త్రోసుకువస్తోంది సుశీల ముఖంలోనుంచి.

"కుదిరినట్టేనా" నిష్ప్రమేయంగా వచ్చిన ప్రశ్నకు ఆమె తట్టుకు నిలిచి

"ఆఁ" అంది నదురు బెదురూ లేక.

"విజయనగరంలో నేనా?"

"అఁహాఁ—ఆముదాలవలసలో"

"స్థితిగతులు బావున్న సంబంధమేనా?"

"బ్రతికి చెడ్డకుటుంబం-ప్రస్తుతం పేదరికంలో వున్నారు"

"నీకు నచ్చినట్లేనా?"

"ఆహా"

"పోనీలే—బ్రతికాం"

"ఇంకా అడగరేం?"

"ఏఁవిటే అడగడం-చెప్పదలుచుకుంటే చెప్పు నీవే"

"స్కూలు ఫైనలుదాకా చదువు. వయసు పాతి కుంటాయి. అంతా క్రొత్త ఫేషను"

"ఓహో—ఇంకనేఁ? రేపటినుంచి మన పని మూడు పువ్వులూ, ఆరుకాయలూను"

"అలాగన్నమాటే"

"ముహూర్తం స్థిరపరచినట్టేనా?"

"అది పెళ్లికుమారుల చేతిలోమాట" గేలిచేస్తూ నవ్వింది.

"ఏఁ—ఏఁ వంటూ రేఁమిటెవారు?" ఈ ప్రశ్న గూడా ఏప్రమేయమూ లేకుండానే వచ్చింది. సుశీల ముఖంలో హాసరేఖలు మరుగుపడుతున్నాయి.

"మీకు పెళ్ళి సంబంధం కుదుర్చుకొచ్చాను మాష్టారూ" అని ఆత్రంగా ఆయన ముఖంలోకి చూసింది. మేష్టారు నిర్ఘాంతపోతూ "పెళ్ళా ముండగా పెళ్ళిమీద మళ్ళి పెళ్ళా?" అన్నారు.

"మరేఁవిటనుకున్నారు — నాకు ఈ చిక్కు విడిపోవడాని కింతకన్న మరొక మార్గం కనుపించ లేదు." తన్నుతాను సంబాళించుకోవాలని విశ్వప్రయ త్నం చేశారు మేష్టారు.

"దీనివల్ల సమస్య పరిష్కరింపబడుతుందో లేక మరొక బిడ్డను ప్రసవిస్తుందో యోచించావా?"

"నాకు మటుకు బాగా తర్కించుకున్నట్టే వుంది. మీరు మాత్రం ఈ జీవితాన్ని పాతకొత్తల మేలుకలయికగా స్వీకరిస్తే నాకదే పదివేలు"

మేష్టారు మౌనం వహించారు. సుశీల తమ యింటికి వెళ్ళిపోయింది.

*　　　*　　　*

ఆముదాలవలసలో ఆడంబరమేమీ లేకుండా మేష్టారికి రెండో పెళ్ళి జరిగిపోయింది. తమ కుమార్తె కన్నె చెరవిడిపించినందుకు కమల తల్లిదండ్రులు సుశీ లను ఎంతగానో శ్లాఘించారు. ఈ తంతు ప్రథమకాం డలో ఉన్నందువల్లనో మరేలకో మేష్టారికి తీయగానే రుచించింది.

ఒక సుముహూర్తాన మేష్టారు రెండవ భార్యతో విద్యాలయంలో గృహప్రవేశం చేయడం విచిత్రంగా ఊరుఊరంతా చూచింది. విశాలాక్షి గొంతులో చేదైనమాత్ర, మేష్టారి అక్కగారి నోటిలో విషపు గుళిక జారినట్లయింది. వాళ్లు కిమ్మనలేక పోయారు. "ఇదంతా ఆ సుశీల చేసింది సుమా! చాబాసురా!— ఏం తెలివి!" అని కొమ్ములు దిరిగిన మగాళ్ళు కూడా ముక్కుమీద వ్రేలేసుకున్నారు. ఇప్పటి వరకు మేష్టా రికి బాగానే వుంది.

మరి కొలనాళ్ళకు మళ్ళిఒక్కొక్కరే విద్యా లయంలో తిరిగి ప్రవేశించడం ప్రారంభించారు. కొసేస్తేగాని మందులేదని భ్రమించిన, ఊరు కంతకు గూడుకట్టుకొని ఉబకపెట్టిన సుశీలమీది అనుమానం మంచులాగ విడిపోతోంది. అయితే అది మేష్టారి అక్క య్యకు బావకు క్రోధాన్నిని నానాటికి అతిశయింప జేస్తోంది. విద్యాలయం మళ్ళి బాగు చెయ్యడానికి మేస్త్రీలను నియమించి తీర్చిదిద్దినట్లు కట్టించడానికి సుశీలే ఖుంజాయింపు చేస్తోంది. అవిడమీదా అల్లుడి మీదా పగతీర్చుకోవడమెలాగా అని కొరాలు మిరి యాలు నూరుతున్నాడు ఆయనబావగారు. క్రొత్త భార్య సుశీల దర్శకత్వంలో తన కాపురానికి ఎలాగ

తీయతెమ్మెలు వీలుస్తూందో, మళ్ళీ తనమేనమామ బ్రతుకులో నూతన వసంతశోభ ఎలా విరుస్తూందో విని విని విసిగిపోయిన విశాలకు బెంగపట్టుకుంది. తాను ఎంతో పొరపాటుచేసినట్లు ఆమె అంతరాత్మ ఘోషించడం మొదలయ్యింది. "అన్నప్పుడూ ఆ పాతపట్టింపులు పెట్టుకు కూర్చుంటే సాగుతుందా. ఏదో మారే కాలంతో మనమూ సరిపెట్టుకోవాలి" అని ఎన్నాళ్ళక్రిందటనో సుశీల ఆ సంజవేళ చెరువుగట్టువార చింతచెట్టుక్రింద అన్నమాటలు గుర్తుకు వస్తున్నాయి. ఆనాడు అవి కేవలం నోటిమాటలే అనుకుంది. మరి ఇవ్వాళో! అవి కటిక సత్యాలు. హితవు అంటేనే అదేమో, మొదట చేదుగా వుంటుంది. ఉత్తరోత్రా మేలుచేస్తుంది. తాను మువ్కారంలో ములిగి మందువంటి ఆమెహితోపదేశాన్ని ఆమె తన చేతులు బట్టుకు బ్రతిమాలినా పెడచెవిని బెట్టింది. ఇప్పుడు దాని ఫలం అనుభవించాలేమో! ఆ శిక్ష ఎంత కఠినంగా వుంటుందో — విశాల సింహావలోకనం చేసుకోలేక పోతోంది. ఈ భావాలన్నీ ఆమె తరుణ హృదయంలో మసిలిపోతున్నాయిగాని అవి బహిర్గతమయ్యే మార్గం లేదు. అటు అమ్మా నాన్నా చూస్తే రోజురోజుకీ ఒగిసిపోతున్నారు.

ఒకనాడు మేష్టారికి ప్లీడరునోటీసు వచ్చింది. విశాల యిప్పించింది. అందులో వకీలు విశాలను మేష్టారు సరిగా యేలుకోనందుకు పరిహారం కోరుతూ హెచ్చరించారు. మేష్టారూ సుశీలా సొంతం చదువుకున్నారు.

"చూశావా! ఏంచేస్తే బావుంటుందంటావు?"

సుశీల ఆలోచించి "ఆమె బుద్ధిపూర్వంగా దీనికి అంగీకరించదు. పైవాళ్ళ ఒత్తిడి దీనికి కారణం అయి వుంటుంది."

"ఏది ఏమైతేనేం-కాగితం నాలుకలు కోరుతూ వచ్చింది"

"రానీండి-ఫర్వాలేదు"

"సక్రమంగా సమాధానం ఇచ్చేద్దామా?"

"మేష్టారూ! మీరు - విశాలకు-అంటే మీ భార్యకు సమాధానమిస్తారా? వద్దు. అది మంచిపని కాదు."

"ఊరికే కూర్చుంటే మెడకు చుట్టుకుంటుంది."

"ఫర్వాలేదు. ఏమౌతుందో చూద్దాం"

"ఏఁవిటి సుశీలా నీ వెర్రి ధైర్యం! ఇది కోర్టు వ్యవహారం."

"కానీండి. కోర్టువ్యవహారం బ్రతుకు చిక్కు కంటే గడ్డుదా. అయినా సరే చూద్దాం"

మేష్టారుకి ధైర్యం కలిగింది. వెంటనే ఆ నోటీసు ముక్కముక్కలుగా చించిపారేశారు.

తర్వాత రెండుమూడు దఫాలు సుశీల ఏకాంతంలో విశాలను కలుసుకువచ్చింది.

* * *

రెండునెలలకు విద్యాలయం రూపురేఖలు మార్చివేయబడ్డాయి. మరమ్మతు చేయబడ్డది ఆ పురాతన మందిరమేనా లేక నూతనంగా నిర్మింపబడ్డదా అనే శంక చూపరులకు అనివార్యమైంది. పైన అంతస్తువేశారు. ఈ ఖర్చంతా సుశీలే భరించుకుంది. మూడు వేలుపై దాటింది మొత్తం.

పని పూర్తిఅయి లెఖ్ఖలు తేల్చుకుంటున్నారు మేష్టారూ సుశీలాను—వద్దంటున్నా వప్పుకోక వ్రాసి యిచ్చారు. ఆమెకు నాల్గువేల అయిదువందల రూపాయలకు ప్రామిసరీనోటు-అయిష్టంగానే ఆ నోటు మడచి పుచ్చుకుంటోంది సుశీలా ఇంతలోనే "మేష్టారూ!" అంటూ బయటనుంచి కేకవినపడింది.

తీరా చూస్తే కోర్టు అమీనా. దావాసమ్మను బట్టుకు సిద్ధం "నేఅనుకున్నంతపనీ అయింది. విశాల చేత వ్యాజ్యం వేయించారు. సుశీలా" అన్నారు మేష్టారు.

"మీరూహించినదైతే అయిందేమో-నేను అనుకున్నంత పనీ ఇంకా కాలేదు. పుచ్చుకోండి సంతకం చేసి సమ్మను" అంది ధీమాతో. మేష్టారు సమ్మను అందుకున్నారు. అమీనా ఆయన బావగారింటికెళ్ళి మామూలు వసూల్కని చక్కాబోయాడు. సుశీల మేష్టారికి అంతులేని ధైర్యం కూర్చింది. అయితే కమలకు మాత్రం ఇదేమీ అర్థంకావడంలేదు. సుశీలనుగాని, పెనిమిటినిగాని కదిపితే "నీకెందుకమ్మా ఊరుకో-అంతా చూస్తూవుండు" అనేవారు. కమలకు లోలోన గుబులుగా వుండేది కాని ఈ విషయాలదెసకు ఆమె మనసు పోయేదికాదు. అసలు ఆమెకు ఈ పితలాటాలు గిట్టవు.

విశాల భర్తపై దాఖలుచేసిన దావా విచారణకు వచ్చింది. పిలిచారు మేష్టారిని. మళ్ళీ ఇతఃపూర్వం

నూతిపోసినట్టే మేష్టారికి చెప్పి ముందుకుపంపింది సుశీల. ఆయన బోనెక్కారు.

"దేవుని యెదుట ప్రమాణంచేసి అంతా నిజం చెబుతాను. అబద్ధం చెప్పను" ప్రమాణంచేసి, విశుద్ధమై వెలిగేచిత్తాన్ని తమలో ప్రతిబింబింపజేసే విప్పారిన నయనకమలాలతో శోభించే ముఖమెత్తి న్యాయాలయమంతా కలయజూశారు మేష్టారు. పుట్టినాక ఆయన బోనుఎక్కలేదు— కాళ్లు కొంచెం వణికాయి-సుమి గూర్చిన ప్రేక్షకుల్ని, కురుక్షేత్ర సంగ్రామంలో పదునుపెట్టుకున్న ఆయుధాలతో కదనానికి సన్నద్ధులైన యోధాగ్రేసరుల్ని జ్ఞప్తికి తెచ్చే వకీళ్లను, అవలివైపున నిలబడ్డ తన బావగారిని— ఇంకా మూలనొదిగి ఎట్టిపరిస్థితులలోనూ తాను ఆమెను అవిశంగా చూడ గూడదనుకొన్న విశాలను ఆయనకళ్లు వెదకి పట్టుకొన్నాయి. "పేరు...వయస్సు...వృత్తి" మొదలగు పరిచయ వాక్యాలు అయ్యాయి. న్యాయాధిపతి ప్రశ్నిస్తుంటే నదుమూ బెదురూ లేకుండా ప్రత్యుత్తరమిస్తున్నారు.

"ఏమండీ మీకీ దావాగురించి తెలుసువా."

"చిత్తం తెలుసునండి."

"మరి ప్లీడరును తీసుకురాకుండా వచ్చారేం."

"నాకు ప్లీడరు అక్కరలేదండి. నిజం చెప్పే వారికి న్యాయవాదు లెందుకండి?"

"అయితే మీరు స్వయంగానే వాదించుకుంటారా?"

"ఇందులో నేను వాదించవలసి నే దేమీ లేదండి. తమ ప్రశ్నలకు శుద్ధసమాధానా లిచ్చుకుంటాను."

"అయితే అడగండి ప్లీడరుగారూ!" న్యాయాధిపతి ఎదిరివకీలును ఆజ్ఞాపించారు."

"చూడండి మేష్టారూ! మీరు విశాలాక్షి అనే ఆమెను ఎరుగుదురా?"

"ఎరక్కేమండి?"

"ఆవిడ మీకేమౌతుంది?"

"నా భార్య" విశాలకండ్లలోకి చూస్తూ మేష్టారు ఈ వాక్యం నొక్కి అంటూంటే అప్రయత్నంగా రెండు వేడికన్నీటి బిందువులు ఆయన నయనాలనుండి వెలువడి విశాలను గడగడ వణికించాయి."

"అగ్ని సాక్షిగా పరిణయ మాడిన భార్యయేనా?"

"ఆ హాఁ."

"మరి ఆమె ఉండగా మీరు మళ్లీ పెళ్లి ఎందుకు చేసుకున్నారు."

"ఆమెను ఎన్నిసార్లు కాపురానికి రమ్మన్నా రాలేదు. తుదకు ఈ దారిత్రొక్కాను."

"దానివల్ల సంభవించే పరిణామాలు యోచించారా?"

"బాగా ఆలోచించే ఈపని చేశాను."

ఇంకేమీ అడుగలేదు వకీలు— మేష్టారికి పాత్ర్యం ఏమీ లేనందువల్ల వెంటనే పిలిచేశారు న్యాయాధిపతులు విశాలను.

విశాల బోను ఎక్కింది. ఆమెతరపు వకీలే ఆమెను అడుగుతున్నారు.

"అమ్మాయీ ఆయన్ను నీవెరుగుదువా?"

"ఎరుగుదునండి"

"నీకూ ఆయనకు సంబంధం?"

"ఆయన మా మేనమామ"

"అంతేనా?"

"నాకుభర్తగూడా"

"ఆయనతో నీవు కాపురం ఎందుకు మానుకున్నట్టు?"

విశాల మౌనం దాల్చింది.

"పోనీ—ఇప్పుడు ఆయనతో కలసిమెలసి వుండడానికి నీ కభ్యంతరం?"

"ఏ...మీ...లేదు. —వకీలు త్రుళ్ళిపడ్డాడు–

"లే నే లేదా?"

"లేదండి" గట్టిగా చెప్పింది. మేష్టారి అనుమానాన్ని ఈ మూడక్షరాలు నివృత్తిచేశాయి.

"బాగా ఆలోచించుకు చెప్పవమ్మా" న్యాయాధిపతి గద్దించారు.

"అయ్యా—నేను బాగా ఆలోచించుకునే చెబుతున్నాను. నాభర్తతో నేను కాపురం చేసుకోవడానికి నాకెట్టి అభ్యంతరములేదు" స్పష్టపరిచింది విశాల స్థిరచిత్తంతో.

"మరైతే ఈదావా ఎందుకు చేసినట్టు" ఉరిమినట్టు గర్జించాడు వకీలు కల్లేరాజేసి. విశాలమానం గాల్పడం ఆమెపైపు వక్కీలును చెంపమీద కొట్టునట్టయింది.

"నేను ఈదావాను బర్తరఫ్ చేస్తున్నాను" తీర్పు చెప్పేసి లేచాడు న్యాయాధిపతి. వకీళ్లు వెలవెలబోతూ ఒకరిముఖాలొకరు చూసుకుంటున్నారు. "శభాష్—భలేబాగా చెప్పిందిరా" అంటూ ప్రేక్షకుల్లో కలకలం అధికమయ్యింది. మేష్టారు పడుతున్న ఆశ్చర్యానికి అంతు లేదు. సుశీల మిక్కిలిగా ఆనందం పొందిండి.

"ఖూసు అభాసు చేశావు. ఇంతదానికి దావాగూడా తగలెయ్యడమెందుకూ. సరే-కాపురం చేసుకో మొగుడుతో" రుసరుసలాడుకూ విశాలవకీలు వెళ్ళిపోయాడు బయటకు. ఆమె తండ్రికి ఎటూపాలుపోవడం లేదు.

సుశీల జట్కాబండి కుదిర్చింది విద్యాలయానికి. విశాల, సుశీల, మేష్టారు ముగ్గురు చటుక్కున బండి ఎక్కెయ్యడం, ఒక కొరడాదెబ్బతో జట్కాను గుర్రం పరుగున లాక్కుపోవడం చూపు ఆనినంతవరకు మ్రాన్పడి పరికిస్తున్న మేష్టారి బావ గారిని చూసి చుట్టూమూగినజనం నవ్వుకున్నారు. అతగాడి కెంతైనా కోపం వచ్చింది. సుశీలమీద, బావమరదిమీద, మించి విశాలమీద, అంతకుమించి తననుచూస్తూ తనదురవస్థకు సానుభూతినైనా ప్రకటించక విరగబడినవ్వే జనంమీద—అయితే ఆక్షణంలో దాన్ని వ్యక్తం చెయ్యడం ఎలాగో అర్థం గాలేదు. ఇది ఆయనకు భరింపరాని అవమానం పాపం! ఆగ్రహాస్తు కనులవెంట నీళ్లుగారినా పరిసరసమాజానికి జాలికలుగలేదు. మరి అతగాడుచేసిన నేరమెంతటిదో కాని!!

*  *  *  *

విద్యాలయంలో క్రిందిభాగంలో విశాలాక్షికీ పైన కమలకీ ఉండేటందుకు కేటాయించబడింది. విద్యార్థులపోలును పాఠశాలగా మార్చుకున్నారు. అనుకోకుండా తమ సంసారంలోవచ్చిన మార్పుకు మేష్టారు అమితంగా ఆనందిస్తున్నారు. సుశీల కర్తృత్వం వల్ల విశాల, కమల పరస్పరమూ ఎట్టిస్పర్థలు లేక పాతకొత్తలవలె కలసిమెలసి బ్రతుకును సుగమం చేసుకున్నారు. ఒకనాడు సుశీల ప్రబోధించిన మేలు కలయికను మేష్టారి అనుభూతి ప్రదర్శిస్తోంది. తన తల్లిదండ్రులు నూరిపోసిన సంకుచిత స్వార్థ భావాలకు, ఛాందసత్వానికి తనకుగా తాను చిన్నసాటినుండి గుణించుకొన్న మూఢవిశ్వాసాలకు క్రమేపీ విశాలాక్షి తిలాంజలి ఇవ్వగలిగింది. రోజురోజుకు తనకళ్లెదుట మార్పుచెందుతున్న క్రొంగ్రొత్త పోకడలతోబాటు విశృంఖలంగా విజృంభించే విప్లవాత్మక భావాల్ని కమల అదుపులో పెట్టుకోగలిగింది.

విద్యాలయ వార్షికోత్సవ సభాసమావేశంలో ప్రసంగిస్తూ కొందరు "సుశీల తన సంయమనంతోను, త్యాగదీక్షులతోను ప్రాచీన విద్యాలయాన్ని సంస్కరించి, ఒడిదుడుకులలోపడి నలిగిపోనున్న అధ్యాపకుల జీవితాన్ని చక్కబరిచింద"ని శ్లాఘించారు. మేష్టారు గూడా సుశీలను ప్రస్తుతించారు. ఈఆచరణలో తనపై వేసిన నీలాపనిందలను సరకుసేయకుండా ఆదర్శసిద్ధికి ఎలాకృషి చేసిందో వర్ణించారు. సుశీల దానికి ప్రత్యుత్తరంగా "మీరింతగా ప్రశంసించడానికి నాలో అధిక్యత ఏమీ లేదు. నా బ్రతుకును, నా ప్రవర్తనను లోకం అనుమానించింది. తన్నివృత్తికి నాకు భగవంతుడు చూపినమార్గాన శ్రమించి కర్తవ్యం నిర్వహించాను. దైవకృపవల్ల విజయం సాధించగలిగాను. నివృత్తితోబాటు నవజీవనంకూడా విద్యాలయానికి ప్రసాదించబడింది. నేను స్వార్థంకోసమే పాటుబడ్డా సంకల్పంలో దోషంలేనందువల్ల పెక్కుసత్ఫలితాలు సిద్ధించాయి. మనకీనాటి సౌభాగ్యాల్ని ప్రసాదించిన దేవదేవుని మనమంతా సంస్తుతిద్దాం" అనగా సభాస్థలి అంతా కరతాళధ్వనులతో ప్రతిధ్వనించింది. ఈ విజయోత్సవంలో తన తల్లిదండ్రులు సంతోషంతో పాల్గొనడం 'వీళ్లెప్పటికైనా మారుతారా' అనుకున్న విశాలసందేహాన్ని వెంటనే నివృత్తిచేసింది.

# తెలుగుల ఊళ్ల పేర్లు

శ్రీమతి నాయని కృష్ణకుమారి

తెలుగు భాషలో ఒక ప్రత్యేకత ఉన్నది. ఇది ద్రావిడభాషల కోవకు చెందినా సంస్కృత భాషా సంపర్కంవల్ల పెరిగింది. అందుకే ఇది రెండు భాగాలుగా విభజించడానికి వీలవుతుంది. ఒకటి సంస్కృతసంబంధి. ఇదే తత్సమ తద్భవ భాష. రెండవది ద్రావిడ సంబంధి. ఇది దేశిభాష. ఈ దేశి విభాగమే లేకపోతే తెలుగు సంస్కృతభాషకు బిడ్డ అని ఎవరైనా యిట్టే ఒప్పుకోవచ్చును. కన్నతల్లిని వదలి దత్తతపోయిన బిడ్డ, పెంపుడు అమ్మానాన్నల సర్వ లక్షణాలనూ అలవాటుచేసుకుని వారి బిడ్డగానే లోకాన్ని ఎలా భ్రమింపచేయవచ్చో, తెలుగు భాషా సరిగ్గా అలానే చేసింది. అయితే యీ భ్రమను చీల్చుకునిపోయే నిశిత పరిశీలన, ఈ భాషయొక్క పుట్టు పూర్వోత్తరాలను అందుకోవడంలో విఫలంకాదు.

భాష అనగానే పరస్పర భావప్రకటనకు అనువైన శబ్దాత్మక లిపిపూర్వక ప్రక్రియ. భాషలో శబ్దాత్మకత అనేది ఉండక తప్పదు. శబ్దంలేకపోతే భాషే లేదు. అయితే ఈ శబ్దమనేది కేవలం అవ్యక్తమైన పక్షుల కిలకిలారావాలవలెనో, క్రూరజంతు భీకర రావాలవలెనో కాక భావస్ఫోరకత కలిగి ఉండాలి. అటువంటిది మానవభాష—భాషకుండే అతి ముఖ్య లక్షణం ద్రవస్థితి. అనగా భాష ప్రవాహిని. ఒక సెలయేరు అనుక్షణమూ ప్రవహిస్తున్నట్లుగానే భాషకూడా క్షణక్షణమూ మార్పువైపుకు అనుగమిస్తూ వుంటుంది. అయితే ఈ మార్పుల్ని పొందడంలో దానికి ఒక క్రమపద్ధతి ఉన్నది. మన యిష్టం వచ్చినట్లుగా దానిని మారమంటే అది మారదు. దానంతటది ఒక కట్టుబాటుకు లొంగి నిశ్చయంగా, మెల్లగా మారుతూ ఉంటుంది. ఒక్కొక్క మార్పు వచ్చిన తొలిక్షణాలలో ఆమార్పు అలా ఎందుకు వచ్చిందో ప్రతి భాషావేత్తా అర్థం చేసుకోగలిగినంత స్పష్టంగా ఉంటుంది. అయితే మార్పుమీద మార్పు రావడం భాషయొక్క సైజం కాబట్టి ప్రప్రథమంనుండీ కలుగుతూన్న ప్రతిమార్పుని గుర్తించగలితేనే తప్ప మన కాలానికి ఉన్న రూపంయొక్క చరిత్ర ఏమో అర్థం కాదు. ఒక పదస్వరూపమే అర్థం కాకపోతే అది యిస్తున్న లేదా సూచిస్తున్న అర్థమేమిటో మన కసలే అంతుపట్టదు. ఒక ఉదాహరణ చూడండి. ప్రతివారి ఇండ్లలోనూ పిండి విసురుకునే 'తిరగలి' ఉన్నది. తిరగలి అనగానే ధాన్యాలగుల్ని పిండికింద నలగకొట్టే రెండు గుండ్రని రాతిచట్రాలు అనేది అందరికీ అర్థమవుతుంది. అంతేకాని ఆ పదం, ఆ అర్థాన్ని ఇవ్వడానికి ఎలా శక్తమయిందో తెలియదు. అది తెలియడానికి నిశితమైన పరిశోధనాత్మకత అవసరం—ఇప్పుడు మనకున్న ఈ 'తిరగలి' అనే రూపం ప్రప్రథమ రూపం అనడానికి వీలులేదు. అది మార్పులు ఒకదానిపై ఒకటి చేరుకుంటూ రాగా మననాటికి ఏర్పడ్డ రూపం. మనతరువాత కొన్ని శతాబ్దాలకు ఈ 'తిరగలి' ఇలాగే ఉంటుందనడానికీ వీలులేదు. అలా ఉండడం భాషయొక్క స్వభావానికే విరుద్ధం. ఇట్లా ఆలోచిస్తే, తిరగలియొక్క గుణం తిరగడం. అపకుండా ఒక రాతిమీద మరొకరాతిని కూర్చి తిప్పితేనేగాని ధాన్యం నలిగి పిండిగా మారదు. 'తిర్' అనే శబ్దాన్ని పట్టుకుని దానికి 'తిరుగు' అనే అర్థాన్ని కూర్చుకుని దానికి ధాతువు అని పేరుపెట్టి, అది భాషలో ప్రప్రథమ రూపమనే నిర్ణయించుకున్నాం. అందుకే ప్రతి భాషా ధాతుజన్య మంటారు. ఈ ధాతువుల్ని ఆధారముగా చేసుకుని వర్ణనాత్మకంగా మనం పెంచుకున్న రూపాలే భాషలో ఉండే నామాలు, లేక పేర్లు. ఇలా ఆలోచిస్తే తిరుగు+కల్లు—తిరుగల్లు—తిరగ్గల్లు—తిరగల్లు—తిరగలి అనే మార్పులను పరంపరగా పొంది ఉంటుందనే ఊహ రాకతప్పదు. అనగా తిరిగేటటువంటి 'రాయి' అన్న వర్ణనాత్మకమయిన అర్థం మనం పొందగలుగుతున్నాం. ఈ అర్థం మనం పొందడానికి ఇంత అవస్థపడాలి. కారణం భాష శరవేగ

ముతో మారుతుంటుంది గనుక—ఒకపదం పదిమంది ఉచ్చరించినా మారుతుంది. పదిసార్లు ఉచ్చరించినా మారుతుంది. పదిచోట్ల ఉచ్చరించబడితే కూడా పది విధాలుగా మారుతుంది. ఇలా మనుష్యుల్ని బట్టి, కాలాన్ని బట్టి, స్థలాన్నిబట్టి భాష మారుతూనే వుంటుంది. ఇటువంటి మార్పుల్ని గ్రహించలేక అర్థం అందుకోలేనంత మాత్రాన ఒకపదాన్ని "అర్థమేదీ లేక గుర్తుగా మాత్రం భాషలో స్థిరపడిపోయింది" అనిచెప్పడానికి వీలులేదు. అలా జరగదు. మనం అర్థంవివరించలేని ప్రతి పదమూ ఆ అర్థాన్ని సూచించే ధాతువు నుండి ఏర్పడి ఉండాలిసిందే! మన కా ధాతువు దొరకడం దొరకకపోవడం అది వేరే సంగతి.

తెలుగు ఊళ్ళపేర్ల పుట్టుపూర్వోత్తరాలూ, వాటివాటికి నియమితమైన అర్థాల అసలు చరిత్రలూ ఈ దృష్టిలోనే శోధించడానికి పూనుకోవాలి. అప్పుడే ఆయా స్థలాలయొక్క స్వరూప స్వభావాలను ఆకళించుకోవడంలో కొంతవరకూ విజయం సిద్ధించగలదు.

ఊళ్ళపేర్లను చూచినట్లయితే వెంటనే ఒక విషయం గోచరిస్తుంది. ప్రతి పేరూ రెండుగా విభజింపబడుతుంది. అందులో మొదటిభాగం విశేషార్థాన్ని ఇవ్వడానికి ఉద్దేశింపబడగా రెండవభాగం 'గ్రామము' అనో 'భూమి' అనో సామాన్యార్థాన్ని మాత్రమే యివ్వడానికి సమర్థమవుతుంది. ఉదాహరణకు భట్టిప్రోలు, గిద్దలూరు, కొత్తవలస, పత్తిపాడు వంటివి ఎన్ని ఊళ్లు పరిశీలించినా భట్టి, గిద్ద, కొత్త, పత్తి అనేవి మొదటిభాగంగానూ, ప్రోలు, ఊరు, వలస, పాడు వంటివి రెండవభాగంగానూ విభజింపబడతాయి. ఇందులో మొదటి పదం విశిష్టార్థదమైతే, రెండవది గ్రామసామాన్యవాచి. ఇది కేవలం అనుబంధం వంటిది. ఈ అనుబంధ పదాలు, ఎన్నో రకరకాలుగా గ్రామ నామాల చివర మనకు కనపడుతుంటవి. అయితే ఇన్నిరకాల పదాలు, కేవలం 'గ్రామము' అనే అర్థాన్ని మాత్రమే సూచిస్తూ ఈ ఒక్క స్థానంలో ఎందుకు ప్రయుక్తాలయ్యాయి? ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క అనుబంధం వాడటంలో అంతర్యం ఏమైనా ఉన్నదా? లేక ఏదో ఒకటి అన్న మన స్తత్వంతో ఏది పడితే అది ఏ గ్రామానికి పడితే ఆ గ్రామానికి అనుబంధంగా చేర్చబడ్డదా? ఈ అనుబంధ పదాల చరిత్ర ఏమిటి? వీటి పూర్వరూపా లేమిటి? వీటి కీ నాటికి సంక్రమించిన మార్పులెటువంటివి?—ఈ విధమైన ప్రశ్నలన్నిటికీ జవాబివ్వడానికి ఈ వ్యాసం శాయశక్తులా ప్రయత్నిస్తుంది.

ఈ అనుబంధ పదాలు అటు దేశిపదాలుగానూ ఇటు వైకృత తత్సమ పదాలుగానూ కనిపిస్తున్నవి. దేశి పదాలుకాని పదాల కన్నిటికీ మూల రూపం సంస్కృతంలో సులువుగా దొరుకుతుంది. దాని అర్థం గ్రామము, పల్లె, పట్టణము అనిగానీ, కొండ, సరస్సు అనిగానీ గ్రాహ్యమవుతున్నది. అంతకంటే యీ అనుబంధాలలో వర్ణనాత్మకమైన అర్థం సాధించడానికి వీలుకాదు.

1. నగరము : (నగర్)

భాగ్యనగర్, మహబూబ్‌నగర్, బాలనగర్.

నగరమన్నది తత్సమం. దీనికి పురమనీ, పట్టణమనీ అర్థం. ప్రాచీనకవికావ్యాలలో మనకు, 'నగరి, నగరు' అనే పదాలవాడుక కనపడుతుంది. వీటికి అర్థం రాచనగరనీ, దేవగృహమనిన్నీ, సంస్కృతనగర శబ్దానికి కల బహు విశాలమైన అర్థం సంకుచితమై కేవలం ఒక కోటకూ, ఒక దేవాలయానికీ అన్వయిస్తున్నది.

2. గ్రామము : గ్రామాలచివర మనకు కనపడుతున్న దీనికి సంబంధించిన అనుబంధం 'గావ్'. ఇది తెలుగుదేశంలో తెలుగుముద్ర వేసుకుని 'గాము'గా కూడా మారింది.

జనగాము, నందిగాము.

3. వాడ : ఇది 'వాటిక'కు వైకృతం. దీనికి అర్థం ఇండ్లవరుస అని. తెలుగులో 'వాడ' అనుబంధంగా కాక స్వతంత్రపదంగా వాడినపుడు కేవలం 'వీధి' అనే అర్థమే లభ్యమవుతుంది. 'వాడవదిన, వాడకట్టు' వంటి ప్రయోగాలిందుకు ఉదాహరణలు.

బెజవాడ, గుడివాడ.

ఉత్తర హిందూస్థానంలో 'వాడ' అనే రూపంకంటే 'వాడి' అనేదే ఎక్కువ.

విఠల్‌వాడి, వాడి.

ప్రాచీన శాసనాలలోకూడా ఈ వాటికకు సంబంధించిన రూపాలు 'వటి', 'అటి' అనేవి కనపడుతున్నవి.

రెడ్డువటి, బోళరెడ్డువటి, రామాటి.

4. పూర్ : ఇది పురశబ్ద భవం. 'పురా' అనే అనుబంధాలుకూడా ఉన్నవి.

అలంపూర్, గోపాలపూర్, యాకుట్‌పురా.

ఇంకా బాద్, గంజ్, ఘాట్, ఘర్ వంటి అనుబంధాలుకల గ్రామనామాలు ఉన్నా అవి తెలుగు దేశంలో లేవు కాబట్టి వాటినిగురించి ప్రసంగించడం లేదు.

ఇక దేశి అనుబంధాలను గురించి ఆలోచించినట్లయితే, ఇక్కడ కూడా పురము, గ్రామము పల్లె అనే అర్థాలిచ్చే అనుబంధాలున్నాయి. వాటికి ఆ అర్థం ఎలా వచ్చిందో, ఏయే ధాతువులనుండి ఆ రూపాలు తయారయ్యాయో మనకు ఒక్కొక్కచోట వివరాలు కూడా అందుతాయి. ఒక్కొక్కచోట అందవు.

1. గూడెము :

అమ్మగూడ, తాడేపల్లిగూడెం.

ఈ పదానికి శబ్దరత్నాకరమిచ్చిన అర్థం కొండదొన నాశ్రయించిన బోయపల్లె అని. అడవి ప్రాంతాలలో రెండాకులూ గెంటు కర్రలూ ఉపయోగించి కట్టిన యిళ్ళన్నీ వలయాకృతులే. అరవంలో 'కుడై' అన్న పదానికి "వలయాకారంగా బోలుగా తొలు" (To hollow-out) అని అర్థం. దీనిమీదనుండే 'కుడి'—ఇల్లు; కూడ—గూడు; కుడల్—బొచ్చె (గుండ్రని) అనే పదాలు ఏర్పడ్డవి. తెలుగులో కుడి సరళాదిగా కేవలం దేవాలయమనే అర్థంలో స్థిరపడ్డది. అట్లాగే 'కూడ' 'గూడు'గా మారి పిట్టలకు నివాసస్థానమైంది. 'గుడిసె' అనే పదం గుండ్రని ఆకులతో వేసిన ఇంటికి వాడబడ్డది. ఈ 'కుడై'తో సంబంధం కలదే 'గుడుసు' అనే పదం కూడా మనకుంది. "వాడికి గుడ్డా గుడుసూ అవసరం"అన్న వాడకంలోని 'గుడుసు'కు అర్థం 'ఇల్లు' అన్నదే. అయితే నిఘంటువుల్లో దీనికి కేవలం 'గుండ్రని' అనే అర్థం చెప్పబడి 'గుడుసుకైదువు' అనగా చక్రాయుధముఅని ప్రయోగాలతో సహా ఇవ్వబడ్డది. ఈ 'గూడెం' కూడా పైన చెప్పిన అన్ని పదాలకు మల్లే 'కుడై' అన్నదే మూలంగా ఏర్పడి ఉండవచ్చు. వలయాకారంగా నిర్మింపబడిన ఇండ్ల వలయమే ఈ గూడెం.—తెలుగు గ్రామాలలో కేవలం గూడెమే అనుబంధాలుగా కల పేర్లు కనిపిస్తున్నవి కాని తమిళ గ్రామానుబంధాలుగా కుడి, గూడి అన్నవి కూడా మనం చూడవచ్చును.

అలకుడి, ఆయంగూడి.

వీటికి ప్రాచీన శాసనస్థమైన పోలికలు గల ఏ రూపమూ కనిపించదు.

2. ఊరు:—ఇది పురశబ్దానికి వైకృతమని కొందరి అభిప్రాయం. 'పూర్' లోని పరుషాక్షరం సంధి వశాన పరుషతను పోగొట్టుకోగా మిగిలిన అచ్చుతో ఈ రూపం ఏర్పడవచ్చు. ఇటువంటి మార్పులు భాషాశాస్త్ర మర్యాదకు లొంగినవే. ఉదాహరణకు—

ప్రోలు—వోలు—ఓలు.

వంగప్రోలు—వంగవోలు—ఒంగోలు.

ఇలాగే 'పూర్' 'పూరు' గానూ 'ఓర్' మారిందన్నా అనవచ్చు. కాని 'పూర్' పురము అన్న అనుబంధపు వాడుక తెలుగుదేశంలో ఎక్కువగా లేదు. ఈనాడు 'ఊరు' అన్న అనుబంధ రూపాలు ఒకనాడు 'పూర్' తో కూడి ఉండాలన్న దృష్టిలో ఆలోచిస్తే అటువంటి రూపకల్పన కేవలం అసహజంగా కనిపిస్తుంది. ఆ పదం వెనక చరిత్రలో ఎప్పుడూ అటువంటిరూపంలో ఉన్నట్లు సూచనైనా దొరకదు. ప్రాచీన శాసనాలలో కూడా 'పూరు' తో కూడిన గ్రామనామాలు కనపడ్డవేగాని 'పూర్' తో కూడినవి కాదు.

ఉర్పుటూరు, ద్రుజ్జూరు

ఇక్కడ 'ఉర్పుటూరు' అన్నచోట 'ట' వర్ణం సంధిని కానియ్యకుండా అడ్డుకోవడానికి వచ్చిన వర్ణం. అనగా ఉర్పు+ఊరు—ఉర్పూరు అనే రూపం ఏర్పడబోగా, మొదటిపదం చివరకల ఉనికను నిలబెట్టటంకోసం 'ట' మధ్యలో వచ్చింది. అలాకాక ఇది ఉర్పు+పూర్ అనే విభజింపబడ్డట్లయితే మొదటిపదం చివర ఉనిక రెండవపదం మొదట 'పూ' అన్న వర్ణం ఉండటంవల్ల సహజంగా బలహీనమైనదని గ్రహించవచ్చు. అప్పుడది 'ఉర్పూరు' అనో 'ఉరుపూరు' అనో మారేదిగాని, 'పూ'ను తొలగించి దానిస్థానంలో 'ట' ను గ్రహించడం కానిపని.— దీన్నిబట్టి తెలుగు గ్రామ నామాల చివర కనిపించే 'ఊరు' పురశబ్దభవం కాదని తేల్చుకోవచ్చును. 'ఊరు' అనగా నివసించుటకు అనువైనచోటు. ఉనికి

అనగా నివాసము; ఉండు అనగా నివసించు; 'ఉఱవు' అనగా నివాసస్థానము. భారతంలో కూడా "నీ యుఱుకడ కేగి తోడుపను మెవ్వరి కేని" అని 'ఉఱుకడ' ఉనికి అనే అర్థంలోనే ప్రయోగింపబడ్డది—ఇవన్నీ ఇంచు మించు ఒకే అర్థంలో ఉండడం చూస్తే, వీటి కన్నిటికీ కారణమైన ధాతువు ఉండాలనిపిస్తుంది. నిజానికి ఉన్నది కూడా. అరవంలో 'ఉఱు' అన్న ధాతువుకు, 'ఉండు, నివసించు' అని అర్థం—బహుశా ఇటువంటి దృష్టితోనే హేమచంద్రుడు దేశీనామమాలలో 'ఉరో గ్రామః' అని ఉంటాడు.

3. ప్రోలు :—ప్రోలనగా పురం. ఇదికూడా పురశబ్ద భవమనే అభిప్రాయం పెద్దలలో ఉంది. నిజానికి 'ప్రోలు' అన్నది ఆద్యరూపమే అయితే సంయుక్తాక్షరమైన 'ప్రో' విడివడి 'పుర'గా మారి ఉండవచ్చునేమోకాని, పురములోని మొదటి రెండు అక్షరాలూ కలిసి సంయుక్తంగా తరువాతి రూపంలో ఏర్పడడం అసాధ్యం. కారణం పదం మొదటి అక్షరానికి ఊనిక ఎప్పుడూ ఉంటుంది. ఈ ఊనిక ఎక్కడో సంధివశాన కాని సాధారణంగా చెడదు. ఊనిక చెడనిచోట మార్పురాదు. కాబట్టి ప్రోలు పురశబ్ద భవంకాదు. దీనికి తమిళరూపం పొఱల్; ఇది 'పఱె' అన్న ధాతువునుండి జనించిన నామరూపం. పఱె అనగా వ్యాపించు అని అర్థం. అనగా నాలుగు వైపులా వ్యాపించిన ఇండ్లతో కూడిన స్థలవిశేషమే ప్రోలు—దీనికి సంధివశాన సంక్రమించిన రూపాంతరాలు బోలు, వోలు, ఓలు.

మానుబోలు, భోగవోలు, ఒంగోలు, తెలప్రోలు

దీనికి శాసనాలలో కనిపించిన రూపం :

వైదుంబప్రోలు.

4. పేట :—కేవలం స్వతంత్రపదంగా దీనికి వాడుకలో ఉన్న అర్థం 'వరుస' అని—ఉదాహరణకు, 'ఆ గొలుసు నాలుగుపేటలు'— 'జరీపేటంచు చీర' అన్నప్పుడు 'పేటు' అన్నది "పేటుమీద పేట పేరిన కొన్ని పేటల బొత్తి" అన్నది సరియైన అర్థం. పేరు, పెరుగు, పెంపు, మొదలైన పదాలన్నిటికీ క్రమక్రమాభివృద్ధిపందు అని అర్థం. ఇవన్నీ తమిళ 'పెర్' ధాతువునుండి వచ్చినవి. 'పేట' కూడా 'పేరు' అన్న ధాతువుకు నామరూపం.

తేరు—తేట

ఊరు—ఊట

అయినట్లుగానే, పేరు—పేట అయినది. శబ్దరత్నాకరకారుడు పేటను అర్థానుస్వారయుక్తంచేసి నగరము అనే అర్థాన్నిచ్చి, ఉత్త'పేట'కు వరుస అనే అర్థాన్నిచ్చాడు. అర్థానుస్వారయుక్తమైన పేట పింతాశబ్ద భవమని ఆయన ఉద్దేశ్యం. ఇక్కడ అర్థంకూడా సరిపోదు. పేటకు అరవంలో సమానపదం 'పేట్టై'.

నరసరావుపేట, జానకమ్మపేట. సూర్యారావుపేట, అనదానపేట్టై (తమిళదేశంలో గ్రామనామం.)

దీనికి శాసనాలలో సమానరూపం కనపడదు.

5. వీడు:—దీనికి అరవంలో సమానపదం 'వీట్టై'. కాని అర్థంమాత్రం తెలుగులో 'గ్రామము' అని కాగా తమిళంలో 'ఇల్లు' అనిమాత్రమే. 'వీడు' ను ప్రాచీన కవి ప్రయోగాలలో 'ఇల్లు' అనికూడా సూచించడం జరిగింది—ప్రప్రథమంలో 'వీట్టై' అన్నచోట ధాత్వర్థమైన 'ఉండుటకు వీలైన' అన్న అర్థమే ప్రధానమై తక్కువ వ్యాపనంకల ఇల్లుమాత్రమే తమిళంలో సూచించబడింది. అదే విశాలమైన అర్థంలో, ఇండ్ల సమూహంకల జనపదానికి తెలుగులో అన్వయించబడ్డది. మాండలికాల్లో ఇటువంటి మార్పులు సాధ్యం. ఉదాహరణకు, 'మనె' అనగా కన్నడంలో ఇల్లు; మనికి, మనుగడ, అనగా తెలుగులో ఆత్మ నివసించేయిల్లు; అనగా ఒకవ్యక్తి జీవితం— 'వీడు' తో పోలికలుకల రూపాలు తెలుగులో, విడిది, విడియు వంటివి కనిపిస్తున్నవి.

మాజివీడు, ఆకువీడు.

6. నాడు:—అనగా జనపదము, లేక దేశము. అరవంలో దీనికి సమానపదాలు 'నాడై, నాట్టం'— 'నాట్పురం' అంటే పల్లెటూరు. 'నాటుమనిషి, నాటువాలకం' అన్నచోట 'పల్లెలకు సంబంధించిన' 'నాగరకము కాని,' అనగా 'మోటు' అనే అర్థాలు వస్తాయి.

పల్నాడు చెట్టినాడు బిసనాట్టం కడమనాడై.

ఇంతటితో గ్రామ సామాన్యార్థంకల అనుబంధాలు అయిపోయాయి. ఇక మిగిలినవన్నీ అర్థాన్ని బట్టి విభజించుకుంటే మూడు రకాలుగా తేలవచ్చు.

అవి:

1. ఆయా గ్రామాల ప్రాంతాన్, మధ్యన్ ప్రముఖ జలస్థానాలు ఉండటంవల్ల, వాటినిబట్టి చేర్చబడే అనుబంధాలు.

2. ప్రముఖమైన కొండలలో, గుట్టలలో ఉండడం వల్ల వాటినిబట్టి చేర్చబడే అనుబంధాలు.

3. ఆయా గ్రామాలలోని నేలనుగూర్చి, సేద్యాన్నిగూర్చి వివరాలిచ్చే అనుబంధాలు.

ఈ మూడు విభాగాల క్రిందికీ రాక మిగిలిపోయినవి కూడా చాలా కనపడతవి మనకు. వాటి చరిత్ర అవి యేయేధాతువులవల్ల ఏర్పడిన రూపాలో పోల్చుకోవడం నాకు వీలుకాలేదు. ఒక్కొక్కచోట అనుబంధపద విభజనే సరిగా జరిపానో లేదో అనే సంశయం కలుగుతూంటుంది. అటువంటివి;

1. రాల, ఆల ?:—చీరాల, పేరాల, మంచిర్యాల, దుగ్గిరాల, నంద్యాల, ర్యాలి.

2. అంగి ?:—కేలంగి, అనంతంగి.

3. తుఱ్ఱు; తుర్తి:—మొగలితుఱ్ఱు, వెల్దుర్తి మామందుర, అంబాదుర్గె.

ఇటువంటివి ఇంకా అక్కడక్కడా ఉన్నవి.

ఇక జలవాచి శబ్దాలు అనుబంధాలుగా చేరిన పదాలు పరిశీలిద్దాం:

1. చెఱువు:—దీనికి తమిళరూపం 'సిర' 'కర్' అనే ధాతువుకు కూర్చు, చేర్చు అనే అర్థాలు ఉన్నవి. 'క, చ' లు రెండూ పరస్పరమూ వ్యత్యయం పొందేవే. ఉదాహరణకు అరవంలోని 'కిళికల్'-తెలుగులో 'చిలుకలు'గా మారింది. అలా 'కర్' నుంచే చేరు, చేర్చు, చేరువ, చేరిక, చెరువు వంటి రూపాలు చాలా తెలుగులో ఏర్పడి ఉండవచ్చు. వీటన్నిటిలో కన్పించే సామాన్యార్థం—'ఒకచోట కూరు' అని. 'చెఱువు' అన్నప్పుడు నీటిని తనలో కూర్చుకున్న పల్లము అని అర్థం చెప్పుకోవచ్చు. 'చెరువు' అనే క్రియ కూడా మనకు వాడుకలో ఉన్నది.

"ఆవిడ తల్లో పువ్వులు చెరువుకుంది."

"తల నున్నగా చెరివి, పూలు పెట్టింది" వంటివి ఉదాహరణలు. ఇక్కడ మొదటిచోట 'పువ్వులను తలలో కూర్చు' అనీ రెండవచోట 'తలలోని వెంట్రుకల నన్నిటినీ ఒకచోట కూర్చు' అనీ అర్థాలు. అలాగే చెరువు అన్నచోట 'నీటిని కూర్చుకున్నది' అన్నది వర్ణనాత్మకమయిన అర్థం—ఈ చెరువును సంస్కృతీకరించి, 'సాగరం సముద్రం' అనే అనుబంధాలు కూడా చేర్చారు.

జక్కల చెఱువు
ములకల చెఱువు
పుట్ల చెఱువు
హిమాయత్ సాగర్
తిమ్మ సముద్రం

ప్రాచీన శాసనాలలో కూడా 'చెఱువు' చేరిన పేర్లు కనబడుతున్నవి.

చిన్నకొని చెఱువు
పోతాయ్యపంగారి చెఱువు

ఇవి 'గ్రామాలు' అనే అర్థంలోనే దానశాసనాల్లో వాడబడ్డవి.

2. ఏరు:—అంటే పారే చిన్న నది. నదులూ, సెలయేళ్ళూ దగ్గరగా ప్రవహించే గ్రామాల చివర ఈ శబ్దాన్ని తగిలించడం సబబే. కాని కొన్ని ఊళ్ళ పేళ్ళను పరిశీలిస్తూంటే ఏ యేరూ లేనిచోట కూడా ఈ ఏరు అనుబంధంగా కనబడుతున్నది.

అనగా 'ఏరు'కు కేవలం చిన్న నది అనేకాక మరొక అర్థమేమయినా ఉన్నదేమోనని వెదకడము అవసరం.

(i) పాలేరు అన్నచోట ఈనాడు పాలికాపు అనే అర్థం రూఢమైపోయినా ఒకనాడు పాలికి తీసుకున్న భూమి అనే వ్యవహరింపబడేది.

(ii) భారతంలో 'ఏరునేల' అనే పదం భూపరిమాణవాచిగా వాడబడింది.

(iii) శ్రీనాథుని చాటువుల్లోని బొడ్డుపల్లిని గొడ్డేటి మోసపోతి అన్న స్థలంలో 'గొడ్డేఱు' అనగా 'గొడ్డుపోయిన నేల' అని అర్థం.

(iv) ఏరువాక అన్న పదానికి "నాగలితో దున్నుటకు ప్రారంభించిన చాలు" అని అర్థం.

అసలు 'ఏరు' అన్న పదం స్వతంత్రంగా 'నాగలి' అనే అర్థంలో వ్యవహరింపబడ్డది. ప్రాచీన కాలంలో భూమిని ఇన్ని ఎకరముల నేల అనడానికి బదులు ఇన్ని నాగళ్ళ నేల అని కొలిచేవారు. అనగా ఇన్ని నాగళ్ళ ఉపయోగముచేత దున్నుటకు వీలైన నేల అని వారి కొలత. దీనితో సమానార్థకంగా నేటికీ

మన రైతులు ఇన్ని అరకల సేద్యం అంటుంటారు. ఇక్ష్వాకువంశపురాజు వాశిష్ఠీపుత్ర శాంతమూలుని శాసనాల్లో అతన్ని 'గోశత సహస్ర హలశత సహస్ర పదాయిన' అని వర్ణించిన సందర్భాలున్నవి. అంటే అతను శతసహస్రాల హలాలు దానం చేశాడనికాక, శతసహస్ర హలాల భూమిని దానం చేశాడని అర్థం. హలము అంటే నాగలి. ఇట్లా మొదట 'ఏరు' అంటే నాగలిని నిర్దేశించే పదమై, నాగలి భూపరిమాణవాచి కావడంచేత 'ఏరు'కూడా ఏ భూమికైనా అనువర్తించే సామాన్యవాచిగా మారిపోయి ఉండవచ్చు. అందుకే ఏ నదులూ లేని ఊళ్ళ చివళ్ళ కూడా ఈ ఏరు చేర్చబడి ఉండవచ్చు.

ఆలేరు, లంకల కోడేరు, పొన్నేరి.

దీనికి ప్రాచీన శాసనాల్లో ఏ రూపమూ కనబడదు.

3. మడుగు:—అనగా నీటితో నిండిన పల్లము అని అర్థం. మడ, మడవ అంటే ప్రవాహమార్గము. మడి అనగా వరిపొలము. మడక అంటే నాగలి. మట్ర అనగా దున్నుతున్నప్పుడు నాగలి తిరగక నిలిచిన కొండ్ర.

ఈ పదాలన్నీ ఒకధాతువునుండి వచ్చిన పదాల్లా కనిపిస్తాయి. మడుగు; మడువు; మడ; మడవ; మడి—వీటిల్లో అర్థసాదృశ్యం కూడా ఉన్నది.—మడిబట్టలు, ఉదికిన మడుగు ధోవతులు అన్నపుడు, మడి, మడుగు అనే రెండు విశేషణాలలోనూ నీటిని సూచించే ప్రయత్నం ఉంది. నీటిచే తడిసి పవిత్రతనందిన, స్వచ్ఛతనందిన అనే అర్థం వస్తుంది. కాబట్టి 'వరి మడి' అన్నచోట కూడా నీటిలో పదును పెట్టబడి వరి పెరుగుతున్న భూఖండము అనే అర్థం లభిస్తుంది. అన్నిపైరులకుమల్లే కాక వరిపైరుకు నీటి ఆసరా ఎక్కువ కావాలి. ప్రతి వరిపైరుకూ ఒక నీటి పాయ పక్కన ఉంటుంది. 'మడ' అనగా ప్రవాహమార్గం కాబట్టి 'మడ'కలది 'మడి' అయిందనన్నా అర్థం సరిపెట్టుకోవచ్చును.—ఈ మడి మొదట వరిపైరును నిర్దేశించినా, తరువాత భూసామాన్యవాచియై యిన్ని గ్రామాలకు అనుబంధంగా చేర్చబడ్డది. సుమతి శతక కారుడు, 'మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో' అని చెప్పినప్పుడు 'మడి' అన్న పదానికి కేవలం 'భూమి' అని మాత్రమే.

'ఎల్లాయిక ఎడ్లు లేవు మల్లాయిక మడ్లు లేవు' అని ఇప్పటికీ వినిపించే సామెతలోని మడ్లు, మడి యొక్క బహువచనరూపమే. అనగా అర్థం భూఖండాలు అని—ఇంతకూ కేవలం నీటిపల్లము అనే అర్థాన్నుండి, నీటితో పదును పెట్టబడిన నేల అనే అర్థం వరకూ గల మార్పులన్నీ సాధ్యాలు కాబట్టి 'మడుగు'కూ 'మడి'కీ గల మూలధాతువు ఒకటి అని ఒప్పుకోవచ్చును'

జమ్మలమడుగు, తాలమడుగు, తాలమడ్ల, కొరై మడై.

4. కుంట:—దీని అర్థంకూడా 'పల్లము' 'నీటిదొరువు' అని. ఇది భూపరిమాణవాచిగా కూడా ఉపయోగింపబడుతుంది.

వాడికి నాలుగు 'కుంటల' భూమి ఉంది. దీని రూపాంతరం 'గుంట'.

అయితే 'గుంట' కేవలం 'కుంట'కు రూపాంతరంగా వ్యవహరిస్తూ ఆ అర్థాలనే యిస్తున్నా. దీనితో పోలిన గుంటి, గొంటి అనే పదాలకు 'చేని భాగము' అనే అర్థం లభ్యమవుతున్నది. ఈ 'గొంటి'కూడా గ్రామాలచివర కన్నడదేశంలో కనిపిస్తున్నది. ఉత్తర హిందూస్థానంలో గుండ, గుండి, కుండి అనే అనుబంధాల చేరిక ఎక్కువ.

| | |
|---|---|
| కురుకుంట | రామగుండ |
| మెట్టుకుంట | బాలెగుండి |
| బిట్రగుంట | సహస్రకుండి |
| ఎల్లగుంట్ల | |
| దేవన్‌గొంటి. | |

ఇక రెండవ విభాగం, 'కొండ' అనే అర్థంకల గ్రామానుబంధాలు.

1. కొండ:—దీనికి తమిళపదం కున్రు. కున్రు, కుణ్ణు గా మారి, తమిళంలో ద్విత్వ 'ఱ'కారానికి ట్ర అనే ఉచ్చారణ ఉండడంవల్ల 'కుట్రు' అవుతుంది. తరువాత గట్టిపడి, 'కుట్టు' కావచ్చు. ఈ 'కుట్టే' కట్ట; కట్లు; కుట్ట; గుట్ట వంటి రూపాలు పొందవచ్చు. తెలుగులో ఈ రూపాలన్నీ ఉన్నవి. గ్రామానుబంధాలుగా కనిపిస్తవి. వీటన్నిటిలో సాధ్యమయ్యే సమానార్థం ఎత్తైన ప్రదేశము అనే!

ప్రాచీన శాసనాలు పరిశీలిస్తే, మొదల్కొండ, టెక్కొణ్ణ అని 'కొండ' చివర కలసి, కర్కరకున్రు అని

కుప్పు కలదీ, ముయ్యాలి కుట్టు అని 'కుట్టు' చివర కలదీ, 'కొన్ని కొన్న' అని కొండకు మరొక రూపమైన 'కొన్న' కలదీ—వివిధ దశలలోని అనుబంధరూపాలు కనిపిస్తున్నవి.

| | |
|---|---|
| గజ్జలకొండ | అప్పికట్ల |
| వినుకొండ | తుమ్మనగుంట |
| దొనకొండ | కాటికుట్టం |

2. కుఱ్ఱు:—పైన చెప్పినప్రకారం 'కొండ' యొక్క మరొక రూపం 'కుఱ్ఱు' అని తేలుతుంది. ఇది యీనాటి గ్రామనామాల చివర ద్వితీయావిభక్త్యంగమైన 'ఇ' చేరడంవల్ల మారిన 'కుర్తి' అనే రూపంలో వాడబడుతున్నది.

ఇక్కుర్తి, పులుకుర్తి.

ఎత్తైన (ప్రదేశాలు) అనే అర్థాన్నిచ్చే దిబ్బ, తిన్నె గడ్డ వంటివికూడా గ్రామానుబంధాలుగా చేర్చబడ్డవి. వీటి చరిత్ర మృగ్యం.

గాజులదిబ్బ, గార్లతిన్నె, జేవరగడ్డ.

3. కల్లు:—అనగా వాడుకలో 'రాయి' అని అర్థం. దీన్ని తెనుగులో విడిగా వాడకపోయినా, తిరగలి, సన్నికల్లు, ఉప్పుగల్లు అనేచోట్ల ఇది కనపడుతున్నది. అలాగే రాతి ప్రదేశాలకూ, కొండలుకల గ్రామాలకూ ఈ అనుబంధం చేర్చబడి ఉండవచ్చు.

జూలకల్లు, ఓరుగల్లు.

కాని కొన్ని గ్రామాల చివర 'కల్లు' అన్న రూపంకాక 'కొల్లు, కోలు' అనే రూపాలు ఉన్నవి. కేవలం సంధివశాన, ఉచ్చారణత్వరలో, అటువంటి మార్పులు పొందాయనడంకంటే ఈ 'కొల్లు, కోలు' అనేవి 'కల్లు' కంటే విభిన్నమైనవని చెప్పవచ్చు. 'కొల్లము' అంటే పల్లము లేక గుంట అని అర్థం. 'కొలి' అంటే పిల్లలు బిళ్ళంగోడు ఆడుకునేటప్పుడు త్రవ్వుకునే చిన్న గుంట. 'కొలను' అంటే సరస్సు. ఇలా ఈ పదాలన్నీ ఒక ధాతువునుండే ఏర్పడి ఉండవచ్చు. ఈ కొల్లమే చివరచేరి 'కొల్లు, కోలు' అయి ఉండడం కూడా సబబే.

పాలకోలు, ఇంకొల్లు.

ఇక చివరదీ, మిగిలిందీ ఆయా గ్రామాల నేలను గూర్చి, సేద్యాన్నిగూర్చి వివరాలిచ్చే అనుబంధాల చరిత్ర.

1. పల్లె:—అనగా శబ్దరత్నాకరకారు డిచ్చిన అర్థం, గుడిసె అనీ, చిన్న గ్రామమనీ ప్రాచీన శాసనాలలో 'పల్లె, పల్లి' వంటి రూపాలు లేకపోయినా 'పల్లము' అనే రూపం కనపడుతున్నది. ఉదా॥ గోరగపల్లము—దీనినిబట్టి ఈ పల్లమే, పల్లె పల్లియా, పల్లి, వంటి రూపాలను పొందిందనవచ్చు. దీని అర్థం 'పల్లపు నేల' అని. ఇందులో పరువత జారిపోయి వల్లి, విల్లి వంటి రూపాలు కూడా తెలుగులో ఉన్నవి. ఇదే కన్నడదేశంలో 'హళ్ళి' గా మార్పు చెందింది.

గుళ్ళపల్లి, అగస్తియంపల్లి, అరసవిల్లి, ఆలవల్లి, రేపల్లె, అగ్గనహళ్లి.

2. కాడు:—'కాట్' అనే ప్రథమ రూపానికి అరణ్యము అని అర్థం. అరణ్య పరిసరగ్రామాలకు 'కాడు' అన్న అనుబంధం చేర్చవచ్చు.

ఆరవంకాడు, కుడికాడు.

3. చేడు:—'చెడి' అంటే మళయాళంలో సున్నపు నేల. దీనికి, తమిళపదం 'చేట్టి' తెలుగునిఘంటువులు 'చేడి, చేడు'ల జోలికి పోకపోయినా, జేడి, జేడియ అనే పదాలను స్పృశించి బురదనేల అనే అర్థాన్ని యిస్తున్నవి. కాని మన గ్రామనామాల చివర చేడు, చేరి, చర్ల, జేడి, జెర్ల, జెండ్ల వంటి అనుబంధాలు ఉన్నవి. ఇవన్నీ ఒక ధాతువుకు సంబంధించిన పదాలే కావచ్చును. 'చ, జ'ల వ్యత్యయం భాష ఒప్పుకుంటుంది. అర్థంలో కించిద్భేదాలను కూడా భాష అంగీకరిస్తుంది.

కరిచేడు, చేమంచేరి, జెడ్చర్ల, చేజెర్ల, నూజెళ్ల, వేజెండ్ల, తిరుప్పచ్చేట్టి.

శాసనాలలోకూడా చేడు కనిపిస్తున్నది. ఉదా॥ కారఞ్చేడు.

4. మెట్ట:—మెట్టనేల అనగా నీరాసరా లేక పండే నేల. జొన్న మొదలైనవి మెట్టపంటలు. వ్యావహారికమైన దృష్టితో చూస్తే రైతుకు భూమి అంతా మెట్ట అనీ 'మాగాణి'మనీ రెండు భాగాలుగానే విభజింపబడుతోంది, ముఖ్యంగా.

దిగువమెట్ట, ఖమ్మంమెట్టు.

5. పాడు: 'పాడు'కు నశించిన, మంచిదికాని అనేఅర్థాలు ఉన్నవి—"అది పాడుగోడ", "పాడు వాసన" అన్నప్పుడు స్ఫురించే అర్థాలు ఒకవూరు ఎత్తిపడి పాడైపోయినతర్వాత అక్కడినేల కొన్నాళ్ళు ఎవరిదృష్టినీ ఆకర్షించకుండా పడివుంటుంది. గుట్టగా, ఆమట్టిని ఎవరూ కదపకుండా ఉండడంవల్ల అది సారవంతమవుతుంది. ఇటువంటి నేలను 'పాటినేల' అనీ, ఆమన్నును పాటిమన్ను అనీ వ్యవహరించడంకద్దు. వ్యవహారంలో, ఊరు పాడుపడిపోయి, గుట్టలుగా దిబ్బలుగా పెరుగుతున్న నేలను "పాడు పెరుగుతున్నది"

అనడం కద్దు. ఈ నేల రైతులకు బంగారంవంటిది. అయితే 'పాడు' అన్న అనుబంధం, కేవలం నశించిన గ్రామాలమీద పునర్నిర్మింపబడిన గ్రామాలకు చేరిందా' అన్న విషయం ఆలోచించవలసిందే.

ఈ పాడుకు ప్రథమరూపాలు 'పాటు' 'పాటి' అన్నవి శాసనాలలో ఉన్నవి.

చవిటిపాటు మజ్జియపాటు.
టడ్డపాటు జీవరతుపాటు.

మళయాళంలో 'పాటమ్' అనగా మాగాణి నేల. అరవంలో 'పాట్టు పాట్టి' అన్న సదృశరూపాలుకల గ్రామనామాలున్నవి.

అత్తిపాట్టు ఛత్రపాట్టి—కాబట్టి 'మాగాణి' భూమినే 'పాడు' అని వ్యవహరించారనుకోనవచ్చును.

దోసపాడు, ధూళిపాడు.

6. పఱ్ఱు:—'పఱ', పఱ్ఱు అనగా ఇసుకబయలు లేదా ప్రవాహముకల నేల. ఈ పఱ్ఱు—పఱ్టు—పటు అనే రూపాంతరాలు పొందివుండవచ్చును. అనగా పఱ్ఱులోని అర్థమూ పట్టులోని అర్థమూ ఒకటే కాక తప్పదు—

ప్రాచీన శాసనాలలో, కలయమ్బఱ్ఱు, వజ్రపఱ్ఱు, కూసిపఱ్ఱు—అనే రూపాలు ఉన్నవి.

ఈనాడు, మోపఱ్ఱు, తాడిపఱ్ఱు అనే రూపాలు ఉన్నవి.

పఱ్ఱు 'పర్తి'గా మారిన రూపాలు కూడా తెలుగు గ్రామాల చివర కన్పిస్తున్నవి—అనపర్తి, చింతపర్తి, వనపర్తి.

దీన్నిబట్టి ఇసుక నేలకు, పట్టు, పఱ్ఱు, పర్తి, వంటి అనుబంధాలు చేరి ఉండవచ్చును. తాడిపఱ్ఱు లోని 'పఱ్ఱు' చెంగల్పట్టులోని 'పటు' రెండూ ఒకే ధాతువుమీద నుండి వచ్చిన రూపభేదాలు—

7. పూడి :— మళయాళంలో 'పుట' అనగా చెరువు. తమిళంలో పుత్తై అనగా 'పలుచనిదైన (?)' అని. తెలుగులో 'పుఱ్ఱు', అనేది దీనికి సమానార్థకం. 'పూడు' అన్న పదం కూడా ఇంచుమించు ఈ అర్థాన్నే ఇస్తున్నదని నా అభిప్రాయం. "బావిలో, చెలువులలో పూడు తీయిస్తారు" కాని ఎండిన నేల మీద గోయి ఒకటి పూడిపోగా, ఆ మట్టిని ఇవతలికి లాగడం, పూడు తీయటం అనరు. దీన్నిబట్టి 'పూడు' అన్న పదానికి 'నిండినది' అన్న అర్థంకాక "పలుచని బురద" అనే అర్థం సూచ్యమవుతున్నది. ఇంతకూ చిత్తడి నేలకు, అనగా పూడుకల నేలకు 'పూడి' అనే అనుబంధం చేరిందేమోనని నా అభిప్రాయం. మనుచరిత్రలోని 'ఏఱులు పూఱులు పట్టు' అన్నచోట 'పూఱులు'-అన్న పదానికి నిఘంటువులు 'అనేకములు' అనే అర్థాన్నిచ్చాయి. ఈ అర్థం ఇక్కడ సబబైనది కాదు—

తెనకలపూడి, బాదంపూడి, గుమ్మడిపూండి. 'పుటి' అనే అనుబంధాలుకల నామాలు తమిళంలో ఉన్నవి.

వల్లప్పుటి, మురుక్కంపుటి.

ఇక ప్రాచీన శాసనాలలో మనకు కనిపిస్తూ ఈనాడు వాడుకలోలేని అనుబంధాలు కొన్ని నేల యొక్క వివరాలను తెలియజేసేవి ఉన్నవి:

1. గరుసు:—గుమ్మకొలని గరుసు, ఇడియారి పొలగరుసు.

ఇక్కడ 'గరుసు' భూస్వరూపాన్ని తెలియజేసేదే. మామూలుగా మనం గరుసునేల, గరపనేల అన్న పదాలు గులకరాళ్ళచే గట్టిపడ్డ నేలకు వాడుతూ ఉండడంకద్దు. గరుసు, గరువు అనగా ఇసకతో కలిసిన నల్లమట్టి అని వ్యావసాయికమైన పరిభాష.

2. కోడు:—పెద్దకోడు.

కోడు అంటే నీటిపల్లము అని. మనకు ఇటువంటి అనుబంధ గ్రామాలు లేకపోయినా దక్షిణ దేశంలో కోయికోడ్ కనిపిస్తున్నది.

3. మడువు:— కొడమడువు......మడుగునేల అనగా బురదనేల. చిత్తడినేలకి అనుబంధం చేరి ఉంటుంది.

4. చోళ:—పెద్దచోళ పూసచోళ.

'చోళ' అనే పదం ఈనాడు మనకు వాడుకలో లేదుకాని దీనిలో సదృశత్వం కలిగిన చోడ, పోడు అనేవి ఉన్నవి. 'చోడ' అంటే చెట్టు మొదలు. 'పోడు' అంటే విరివిగా చెట్లు ఉన్నచోట, ఆ చెట్లను నరికి వ్యవసాయానికి తయారు చేసిన నేల. ఈ శాసనాలలోనే 'చోరము' అనే మరొక రూపం కనిపిస్తున్నది.

ఉదా:—మల్కచోరము. మనకు వాడుకలో 'పోరంబోకు' అన్నది సాగుచెయ్యని ప్రదేశానికి అన్వయిస్తుంది. ఇంతకూ, చోళ, చోరము అనేవి అడవి కొట్టి సాగుచేసిన నేలనూ, బంజరునేలనూ సూచించేవిగా కనపడుతున్నవి. వీటికి మూలధాతువు వెదుక దగ్గది.

ఇక, కోట, పాలెం, కుదురు వంటి అనేక గ్రామానుబంధాలను పేర్కొనడం జరగలేదు. స్థలాభావంవల్లా, ఆ అనుబంధాలలో చర్చించదగ్గ విషయ వైపుల్యం లేనందువల్లా వాటిని వదలివేయడం జరిగింది.

# ఉద్యోగాలు

శ్రీ బలివాడ కాంతారావు

ఒకప్పుడు "అలాంటి ఉపకారి మరి పుట్టబోడని" అన్న పెద్దమనిషే ఇప్పుడు ప్రకాశరావును గురించి "ఆఫీసరై కూర్చున్నాక కళ్లు నెత్తిమీదికొచ్చాయని" నలుగుర్లో దూషించాడు. మొన్న తను తన మేనల్లుడి వుద్యోగంవిషయం తన ఇంటికి వెళ్తే ప్రకాశరావు వుగ్రుడై "ఇలా పెరటిత్రోవన వచ్చే పనులు అంగటిత్రోవను వీరునిలా వచ్చి వుద్యోగంలో చేరకూడదూ" అని మందలించాడట!

ప్రకాశరావు చాలా పేద కుటుంబంలో పుట్టాడు. చదువుకున్నది మెట్రిక్. చేరింది గుమస్తాగిరిలో. కానీ తన సహజమైన తెలివితేటలతోనూ, వినయ సంస్కారాలతోనూ అతి చురుకుగా పైకి లేచాడు. తను ఆఫీసరై సంవత్సరం రెండు నెలలే అయింది. ఆఫీసరుగా లేనినాడు కూడా తన దగ్గరకు ఎందరో వుద్యోగాలవిషయంలో వచ్చేవారు. ప్రాధేయపడి తమ కష్టాలను చెప్పుకునేవారు. ఆయన శాంతస్వభావం, కష్టాలను చెప్పుకునేటప్పుడు చూపే సానుభూతి, యెదుటవాళ్ళను, ఒకప్పుడు వుద్యోగాలు చూపించలేకపోయినా, సంతుష్టిపరచేది. వుద్యోగం ఇప్పించలేదని యీర్ష్య చూపించేవారు కాదు.

ఏమి చేసినా కేవలం పరోపకార దృష్టితోటే చేశాడు. తన దగ్గర బంధువులు తెప్పించి ఎటువంటి వారు వెళ్ళినా చేతకాదు అనకండా యేదో చూద్దాం అనేవాడు. ఆ మాట ఆయన నోటి వెంబడి వచ్చిందీ అంటే సరి ఉద్యోగం దొరికిందన్నమాటే! ఎవరైనా తప్పి జారీ డబ్బు ఇస్తే పుచ్చుకోడని యేమైనా పళ్ళూ కాయలూ పంపిస్తే తిరిగి పంపించేసేవాడు. ఇంట్లో తనూ, భార్యా, యిద్దరు పిల్లలు కాక పెదతండ్రి పిల్లవాడొకడు, పేదవారైన దూరపుబంధువుల పిల్లలు యిద్దరూ చదువుకు ఉన్నారు. ఉద్యోగం పెరుగుతున్న కొద్దీ ఖర్చు ఇలాంటి విషయాల్లో పెరుగుతునే వుంది. ఎవరో యే మారుమూల నుంచో ఉత్తరాలు వ్రాస్తుంటారు—ఏదో బంధుత్వంకూడా కల్పిస్తుంటారు. అందులో చాలా పొగిడి వ్రాస్తుంటారు. ఈ రకం ఉత్తరాల్లో ఉద్యోగం లేని యువకులు, యెవరూ అక్కరచెయ్యని ముదుసలులు కూడా ఉంటారు. తనకు తోచిన సహాయం యెవరికీ తెలియకుండా చేయటమే తన పని. తనకు ఒకటే గర్వం—ఇటువంటి విషయాల్లో అడ్డు తగలకుండా చేయూతనిచ్చే అర్థాంగి దొరికిందని! తను డబ్బు లేక చికాకు పడే రోజులు లేకపోలేదు — ఉద్యోగం పెద్దదికదా ఆ మాత్రం అడిగితే అప్పు యివ్వడా అని తెలిసినవాళ్లు వస్తే తను తెల్లమొగం వేస్తే భార్య ఇంటి ఖర్చుల్లో పొదుపు చేసింది సర్దుబాటు చేస్తోంది!

ఇలా తను బ్రతుకుతూ చుట్టూ వున్నవాళ్లుకూడా బ్రతకాలనే పట్టుదలతో తనకు తోచిన సహాయం చేసి గౌరవంగా బ్రతుకుతున్న ప్రకాశరావు యిప్పుడిలా యెందుకు మారాలి? ఇంత శాంతమూర్తి, తన ముఖం చూడగానే ఎవరికోపమైనా పటాపంచలౌతుందే అలాంటివాడు ఎవరైనా ఉద్యోగంకోసం వెళ్తే ఖస్సుమంటాడేం? తన్ను గౌరవించే పెద్దలను వెంటబెట్టుకొని వెళ్లినా చికాకుపడి లేదని సమాధానం చెప్పగల పరిస్థితి వచ్చిందేం? ఇతను గాఢంగా ప్రేమించే యిల్లాలిద్వారా కూడా చెప్పించలేక పోతున్నారు! ఇదివరకు తను ఒకరికి చెప్పి యెందరినో వుద్యోగాలలో వేయించాడు. ఇప్పుడు తను ఒకర్ని ఉద్యోగంలో వెయ్యాలంటే వయ్యగల స్థానంలో వున్నాడు.

కొంతమంది తను డబ్బుకు ఇబ్బందిపడుతున్నట్లు తెలుసుకొని రాత్రిపూట యింటికి వస్తే "వెంటనే బయటికి పోతారా లేక పోలీసులను పిలిపించమంటారా?" అని జడిపించాడు.

ఆ పెద్దమనిషి కళ్ళు నెత్తిమీదికి వచ్చాయన్నాడని తెలిసింది. ఇంకా ఊళ్లో యెందరో తనను దుమ్మెత్తిపోస్తున్నారని వీరు వారు చెవిలో వేస్తున్నారు. తెలుగువాడికి సింహాసనంమీద కూర్చునే అర్హత యెక్కడుంది? అదే ఇంకో తెగవాడైతే యీపాటికి ఆ తెగవాళ్లందరినీ ఉద్యోగాలలో వేయించేవాడని తన చెవుల్లో పడేటట్లు అనుకుంటున్నారు. రాను రాను యీ దూషణలు హెచ్చిపోతున్నయ్. తను ఇదివరకు ప్రజల్లో ఎంతగౌరవంగా బ్రతికి వాళ్ల గౌరవానికి పాత్రుడయ్యాడో ఇప్పుడు అంత అధ్వాన్నంగా వారిచేతనే దూషింపబడుతున్నాడు. పై అధికారులకు, తనపై పక్షపాతం, లంచాలు మొదలైన అబద్ధాల పుట్టలను సృష్టించి, ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాస్తున్నారు.

ప్రకాశరావు మొదట్లో కొంత బాధపడినా వెనువెంటనే గతంలోని గొప్పవాళ్ళ జీవితాలు జ్ఞప్తికి వచ్చి ధైర్యాన్నీ స్థైర్యాన్నీ చేకూర్చేవి. తనలో తనే ధర్మాధర్మ విచక్షణ చేసుకునేవాడు. ఉద్యోగాల విషయంలో తప్పించి యింకేవిషయంలోనూ తను మారలేదని ధైర్యంతో వుండేవాడు. ఎవరైనా ఉద్యోగం విషయం తప్పించి యింకే విషయంలో వచ్చినా ఇదివరకు కన్న యెక్కువగా గౌరవించి సత్కరిస్తున్నాడు.

అయితే ప్రకాశరావును యిలా మార్పించడానికి యేదైనా బలమైన సంఘటన జరిగిందా అంటే జరిగిందనే చెప్పాలి! అది తను ఆఫీసరు అయ్యాక మొదటి నెలలోనే ఐదే ఐదు ఖాళీలు ఒకే శాఖలో వచ్చాయి. 'ఎంప్లాయిమెంట్ ఏక్స్చేంజి' ద్వారా యేభైమంది యింటర్వ్యూకు వచ్చారు. తనే ఐదుగుర్నీ వాళ్ళ మార్కుల ప్రకారం యెంచుకున్నాడు. రేపు లిస్టు పంపిస్తామనగా ఆ రాత్రి ఒక ముసలాయన తన ఇంటికి వచ్చాడు. స్వగ్రామంలోవున్న ప్రకాశరావు తండ్రి దగ్గరనుంచి ఒక సిఫారసు ఉత్తరం తెచ్చాడు. అతి వినయంగా చేతులు నులుపుతూ ఆ ముసలాయన అన్నాడు. "బాబూ! ఆనాడు మీ తండ్రికి గడవని రోజుల్లో యెలా చూశానో ఆ పరమాత్ముడికే తెలుసు! నువ్వు పాలులేక గిజగిజ గింజుకుంటుంటే ఆ రాత్రి మీద ఆవుపాలు పితికి యిచ్చేవాడిని. అంతా సరి—చితికిపోయాను. ఇంకా పెళ్ళికి ముగ్గురు ఆడపిల్లలున్నారు. ఉన్న ఒక మొగపిల్లవాడికి ఉద్యోగం సద్యోగం లేదు. యింకా నెలరోజుల్లో వాడి వయసు కూడా మించిపోయి యే గవర్నమెంటు నౌఖరీకి పనికి రాడు. ఈ రోజుల్లో యెంత తెలివితేటలున్నా పనికి రావు—ఎవరో చేపట్టేవాడుండాలి. నీవు ధర్మం కట్టుకోకపోతే యింక బ్రతుకుమీద ఆశ చాలించుకోవాలి..." ఈ ధోరణిలో ఏదో చూద్దాం అన్నాడు. ఆ చూద్దాం అన్నమాట ప్రకాశరావు నోటివెంబడి వచ్చిందంటే యేమిటో అర్థం తెలుసుకోలేని ముసలాయన చాలా రాత్రివరకూ బ్రతిమాలాడు.

మరుసటిరోజు వుదయం ముసలాయన కొడుకు పేరు చూస్తే నలభయ్యోవరుసలో వున్నాడు. ముసలాయన కష్టాలే తన మనస్సులో తిరగటంవల్ల జాలివేసి యిదివరకు మెరిట్ ప్రకారం యెంచిన ఐదు పేర్లలో చివరిపేరు తీసి యీ పేరు వేశాడు. ఈ యైదుగురూ ఉద్యోగాలలో చేరారు.

ఆ వారం రోజుల్లోనే ఆఫీసులో తన్ను చూడటానికి ఒక వ్యక్తి వచ్చాడు. రాగానే నమస్కరించాడు. మనిషి చిక్కిపోయి ఉండటంచేత వెంటనే ప్రకాశరావు జాలిగా "జబ్బుపడ్డారా?" అన్నాడు.

"లేదు బాబూ!" అంతలో ఆపగానే గ్రహించిన ప్రకాశరావు "అయ్యో! పాపం! నేను రోజూ ఆఫీసుకు వస్తుంటే ఆ త్రోవలోనేగా మీ యిల్లు మిమ్మల్ని చూస్తుంటాను—ఇంకెక్కడో చూసినట్లు కూడా..."

"ఇక్కడే......"

"అవునవును......మీరు క్రిందటి నెలలో యింటర్వ్యూకి వచ్చారుకదూ?"

"అవును బాబూ! నాకు చాలామంది చెప్పారు—నా బాధలు చూడలేక మిమ్మల్ని ఇంటర్వ్యూకి వెళ్ళక ముందు కలుసుకొని నా బాధలు చెప్పుకుంటే మీరు తప్పక కనికరిస్తారని......"

ప్రకాశరావు జాలిగా చూశాడు. ఆవ్యక్తి అతి దీనమైన స్వరంతో స్వవిషయం చెప్పుకపోతున్నాడు—

"ఎస్. ఎస్. ఎల్. సి. ప్యాసయిన వెంటనే నాకు పెళ్ళిచేశారు. పై చదువు చదువటానికి వుబలాటమే కాని డబ్బులేదు. ఎక్కడా సరియైన ఉద్యోగం లేదు. చేసినా రెండుమూడు నెలలే. అప్పటికే నాకు ఇద్దరు

పిల్లలు బాబూ! నాకు కొద్దిగా సాహిత్యంతో పరిచయం మేర్పడింది. ఈ కటిక దారిద్ర్యంలో నే కథలు వ్రాస్తున్నాను. దానివల్ల వచ్చే రాబడి శూన్యమనే చెప్పొచ్చు. దానిమీద బ్రతుకుతానన్న ఆశలేదు. నేను అసలు రాయటానికే బ్రతికున్నాను! నేను బ్రతకాలంటే తిండికావాలి—దానికోసం డబ్బుండాలి—డబ్బుకోసం నేను వుద్యోగంచెయ్యాలి."

అలా చెప్తూనే ఆవేశంలో గొంతుక పట్టుకపోయింది. మళ్ళీ ప్రయత్నంమీద సవరించుకుంటూ "ఉద్యోగంకోసం అందుకే నా ప్రాకులాట. అంతా మిమ్మల్ని మాడమన్నారు—కానీ నా మనసు యీ దొంగతనానికి మనస్కరించలేదు. నా తెలూకు శక్తి సామర్థ్యాలు చూపించి అందరిలో నిల్చుంటే న్యాయాన్ని ధర్మాన్ని నిలిపే మీలాంటి అధికారుల హృదయాలు అన్యాయానికి పాల్పడవని నాకు తెలుసు. అంచేతనే నేను మిమ్మల్ని ముందుగా మాడలేదు. కాని నా దురదృష్టవశాత్తూ ఆయేభైమందిలో యెందరో పట్టభద్రులున్నారు—నాకంటే తెలివైనవారున్నారు. వాళ్లకు ఉద్యోగాలు దొరికాయి. లోకం యింత పచ్చగా వున్నప్పుడు పేదరికంచేత చచ్చిపోవటం అంటే బాధగా వుంటుంది. బహుశః అలా చచ్చిపోతానన్న క్షణంలో రేపిన భయమే యిలా తీసుకవచ్చింది."

ఆయాసంతో అలసిపోతున్న ఈ వ్యక్తివైపు చూశాను. కళ్ళల్లో నీళ్లు అలముకొనివున్నాయి. ప్రకాశరావు శాంతంగా మీపేరు అన్నారు.

"ఎస్. సత్యనారాయణ."

"సరే! ఓక్షణం బయట ఉండండి" అని తను యింటర్వ్యూ కాగితాలు తీశాడు. సరిగ్గా తను తీసివేసిన ఐదోవ్యక్తే యితను. ఇతని పేరు తీసివేసే ముసలివాని కొడుకును వేసుకున్నాడు.

ఒక్కసారి మనస్సు చివుక్కుమన్నట్లయింది. ఈతని కష్టాలే యిదివరకు తెలిసివుంటే అంతపని చెయ్యలేక పాయేవాణ్నే అనుకున్నాడు. ఉద్యోగాలు వేసుకోవటంలో ఒకపద్ధతి అంటూ పెట్టుకున్నాక ఆ పద్ధతినే అనుసరించకుండా వ్యక్తులకష్టాలతో ఉద్యోగాలు ముడిపెట్టటం సబబు కాదని యిదివరకు అనుకున్నా యిప్పుడు నిర్ధారణకు వచ్చినట్లయింది. ఉద్యోగాలకు వచ్చిన వందలాదిలో ఎవరికష్టాలు వాళ్లకే వుంటాయి—కష్టాలనేవి సహృదయతస్థులూ భరించే వ్యక్తుల బట్టే వుంటాయిగానీ కష్టాలన్నీ నిజానికి ఒకేస్థాయి లోనివే!

మళ్లీ సత్యనారాయణను పిలిచి "ప్రస్తుతానికి నేనేమీ చెయ్యలేను. మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుంటానని చెప్పగలను—అందాక ఒకస్నేహితుడు అవసరానికి ఆదుకున్నాడని యీ పదిరూపాయలూ తీసుకవెళ్లండ"ని యిచ్చాడు.

సత్యనారాయణ పుచ్చుకోలేదు.

"సంకోచిస్తున్నారా! ఫరవాలేదు—ఒక మిత్రుణ్ణి కాదనగలరా!"

సత్యనారాయణ చేతులు వణకడంమాని ప్రకాశరావు "పోనీ! నావగ్గర అప్పుతీసుకువెళ్లండి. ఎప్పుడో మీకు కలిగినప్పుడు తిరిగి యిచ్చివేయండి."

అనగానే ఆ పదిరూపాయిలు మౌనంగా తీసుకొని అలానిల్చున్నాడు. ప్రకాశరావు ప్రశ్నార్థకంగా మాడగానే సత్యనారాయణ మెల్లగా "క్షమించండి మీకాలాన్ని చాలావరకు నాకష్టాలను చెప్పుకొని తీసుకున్నాను"

"అబ్బే!"

"ఒక్కకోరిక" అన్నాడు.

"చెప్పండి—సంకోచించకండి"

"మరేమీలేదు! అంతమంది యింటర్వ్యూకి వచ్చారుకదా పరీక్షలో వాళ్లలో నాస్థానం తెలుసుకోవచ్చా అని..."

ఓ క్షణకాలం ప్రకాశరావుముఖం యెర్రబడిపోయింది. మనస్సులో మథన ప్రారంభమైనా యీ యనరెడెదర తను తల యెత్తుకు నిలబడాలనే వుబలాటంతో "క్షమించండి! ఇటువంటివి అధికారీరత్యాగాని చెప్పకూడదు!" అన్నాడు.

"ఒక స్నేహితునిగా భావించి పదిరూపాయలు అప్పుకూడా యిచ్చారు. అంచేత అనధికార రీత్యా చెప్తారనే వుబలాటంకొద్దీ మిమ్మల్ని కష్టపెట్టి వుంటాను. క్షమించండి" అంటూ వెళ్లిపోయాడు.

ప్రకాశరావు ఆవేశంతా యేపనీ ముట్టుకోలేదు. ఇంటికివెళ్లినా, వాకిట వాలుకుర్చీ వేసుకొని కూలబడిపోయాడు.

ఆ వారంరోజుల్లో ఆఫీసుకువెళ్లేటప్పుడు వచ్చేటప్పుడూ ఆ యింటి వేపు చూసినా సత్యనారాయణ కనపడలేదు. పదిరోజులుదాటినా, రోజూ తన తలపుకు వచ్చినా సత్యనారాయణ అగపడలేదు. ఎంత తొందరగా యీయనకు ఉద్యోగం చూపిద్దామని ఆత్రుత పడ్డా సరియైన ఉద్యోగం ఖాళీ రాలేదు.

ఒకనాడు ఉదయం పదకొండుగంటలకు ఆఫీసులో ఉండగా బంట్రోతు ఒక కవరుతెచ్చి టేబిలు మీద యెదురుగా పెట్టాడు. "పేరుచెప్పకుండా దొరగారికి యిచ్చీమని చెప్పారు" అన్నాడు బంట్రోతు. ప్రకాశరావు కవరువిప్పి "ఆయనను వేగంగా పిలుచుకరా" అన్నాడు. బంట్రోతు హడావుడి వృథా అయింది. ఆ చుట్టుపట్లను సత్యనారాయణ ఎక్కడా అగుపించలేదు. ఆ వుత్తరంలో యీగా వుంది:—

"మిత్రులు ప్రకాశరావుగారికి సత్యనారాయణ నమస్కరించి వ్రాయునది:—

ఆవేళ ఆఫీసులో మిమ్మల్ని కలుసుకున్న నాటి నుంచీ నామనస్సు బాధపడుతోంది. నాకు నేనే దొంగనై పోయాను. ప్రతిక్షణం నాలో యెవరో నా నీచత్వాన్ని ఎత్తిపొడుస్తూనే వున్నారు. నేను నా కథల్లోనిజాయితీ, సత్యం, ధర్మం, న్యాయం అనే వున్నత ఆదర్శాలను పాఠకులకు బోధిస్తాను. నేనుచేసే బోధనలకు నాప్రవర్తనలకు సామ్యం లేకపోతే నేను రచయితనని అనిపించుకో అక్కర్లేదు—నిజానికి నేను కలం ముట్టుకోనక్కర్లేదు. నేను చేసినపని ప్రతిక్షణం పశ్చాత్తాపపడునట్లుచేసి సిగ్గుతో మీకు ముఖం చూపించకుండా చేసింది! జీవితం అంటే కడుపే కాదు అది నీతి నియమములకు కూడా స్థానం అని నానమ్మిక" ఇక నా కష్టాలంటారా? రచయిత కష్టపడాలి—తనకు జీవిత కాలం ఆవేదనే. ఆ ఆవేదనే లేకపోతే తోటిజీవుల ఆవేదనను గుర్తించలేడు - కష్టపడకపోతే హృదయం నుంచి చెప్పలేడు. హృదయంనుంచి చెప్పలేనివాడు నిజమైన రచయిత కానేకాడు. ఒక చక్రవర్తి హృదయాలాపమే యీ ప్రపంచంలో యిప్పటికీ సాటిలేని సుందరమైన మహల్‌ని సృష్టించింది! అలాగే కల కాలం నిల్చేదైనా నా హృదయంనుంచే సృష్టింపబడాలి. అంచేత, నా కీకష్టాలే బలాన్ని చేకూరుస్తున్నాయి - ఆలోచనలు పుంఖానుపుంఖంగా వస్తున్నాయ్. నా కీప్రపంచమే పెద్దగ్రంథాలయం. ఇందులో ప్రతివ్యక్తీ ఒకగ్రంథం. ప్రతిగ్రంథంచదివితే యెలా మనసు వికసించి క్రొత్తక్రొత్త విషయాలు తెలుస్తాయో అలానే ప్రతివ్యక్తినీ పరిశీలిస్తే నా కలాంటి వికాసం కలుగుతుంది. నాచుట్టూ వున్నవాళ్లు ఆధారంగా నవలవ్రాస్తున్నాను- అందులో మిమ్మల్ని ఒక పాత్రగా తీసుకుంటున్నందుకు మీరు అభ్యంతరం పెట్టరని నాకు తెలుసు—దీనికోసం రాత్రింపగళ్ళూ కష్టపడుతున్నాను. నా ఆరోగ్యం యేమైనాసరే—నాకుటుంబం యేమైనాసరే...నన్ను ఆవరించి నాలో యేదో దేవత్వాన్ని చొప్పించి పొంగిపొరలించే ఆనందంలో ఉత్సాహంలో నన్నిపనికి పూనించిన ఆ కవితామతల్లికి పుష్పాంజలులు ఘటించకుండా యెలావుంటాను? ప్రకాశరావుగారూ! నేనేమీ వ్రాయలేదండీ! నేనెవణ్ణి వ్రాయడానికి?—ఆక్షణాల్లో ఆమే ఒక తేజస్సులా వచ్చి నాలోచొచ్చి...తరవాత నేవ్రాసింది నేనే చదివి..."ఇది నేనేవ్రాశానా"అని ఆశ్చర్యం చెందుతుంటాను. తోడిమానవులు వారి కర్మని వారు అనుభవించుతుంటే వాళ్లి బాగోగులనుబట్టి వాళ్ళని గౌరవంచేసే మనం—అందులో నేనుకూడా ఒకడ్ని, మంచివాణ్ణి భూషించి చెడ్డవాణ్ణి దూషించడానికి అలవాటుపడిన కోట్లకొలది మానవుల్లో ఒకడిని—ఒక న్యాయాధిపతిలా ప్రతిపాత్రను అలా తనబాటనుండా పోనిచ్చి చివరకు ప్రతిమానవుడిలోనూ మానవత్వం వుందని యెలా నిరూపించగలను?—అది నాసృష్టి యెలా ఔతుంది? రానురాను నా నిష్కల్మషమైన మనసులో ఆమెకు నే బ్రతికినంతకాలం స్థానం యేర్పరచుకో గలిగితే అంతకంటే భాగ్యం నాకింకేం కావాలి?

నా ఆవేశంలో ఆనందంలో యింతవరకూ వ్రాసుకున్నాను. నేనువ్రాసిన ఒక కథకువచ్చినదీ పదిరూపాయల కాగితం! కృతజ్ఞతతో ఈకవరులో పెట్టి అప్పు తీర్చుకుంటున్నాను. నా ఉద్యోగం విషయం మీకు శ్రమ పెట్టకూడదనే నిశ్చయమే యీవుత్తరాన్ని వ్రాయించింది. ఎప్పుడోమళ్ళీ నేను అంగట్రోవ రాగలిగిన్నాడే వుద్యోగం చేస్తాను—అవసరమైతే!

భవదీయుడు

సత్యనారాయణ."

ప్రకాశరావు వుత్తరం మళ్లీ రెండుసార్లు చదివాడు. ఆనాడు మాసినబట్టలతో చింపిరిజుత్తుతో నీర

సంగాఉన్న వ్యక్తిలో యిలాంటి సుగుణాలున్నాయని పొరపాటునైనా వూహించలేదు. అతను నరకాన్ని స్వర్గంచేసుకునే వ్యక్తనితోచింది. ఆయనను తను సుఖపెట్టామన్న ఊహతుడిచిపెట్టి ఆయన కుటుంబానికెలా సహాయంచెయ్యాలనే పట్టుదల తనలో చొచ్చుకపోయింది. అలాంటి ఖాళీయేవచ్చినప్పుడు సత్యన్నారాయణను ఆఫీసుకు తీసుకవచ్చి తనుచేసిన తప్పిదం ఒప్పుకొని మరీ ఉద్యోగం యివ్వాలని నిశ్చయించుకున్నాడు. అప్పుడు ఆ నవలలో తనపాత్రకు తను న్యాయంచేసిన వాడౌతానని అనుకున్నాడు.

రెండునెలలు గడిచిపోయాయి. సత్యనారాయణ ఒక్కసారీ కనిపించలేదు. ప్రకాశరావుకు వాళ్ళ ఇంటికివెళ్ళి పిలవటానికి యెందుకో అనుమానం వేసింది. తనముఖం ఊరకనే ఆయనకు యెలా చూపించటమని వెళ్ళలేకయాడు.

ఒకనాటిఉదయం ఎండ తీక్షణంగా కాస్తోంది. ఆఫీసుకు ప్రకాశరావునెళ్తూ అంతదూరంనుంచే మామూలుగా సత్యనారాయణఇంటివేపు చూశాడు. అక్కడ చాలామందిజనం మూగివున్నారు. ఆజనంలో కాషాయవస్త్రాలలో నిల్చున్న ప్రేమసమాజీకులను కూడా చూచి గబగబ అక్కడకు వెళ్లాడు.

వాకిట కట్టెమీద సత్యనారాయణ! ఆకట్టెమీద యిల్లాలు యిద్దరుపిల్లలు తలకొట్టుకొని బావురుమంటున్నారు. పెద్దపిల్ల నాన్నా నాన్నా అని గోలపెడ్తోంది. శాశ్వత నిద్రపోయిన ఆముఖం అరుణిమలో చిరునగవుతో మెరుస్తున్నట్లుంది! ప్రకాశరావుగుండె కంపించింది- అక్కడిమనుష్యులను తప్పించుకొని కట్టెదగ్గరకు వెళ్లాడు. చుట్టూవున్నవాళ్లుతనికేసి సగౌరవంగా చూస్తున్నారు. ఆబిడ్డలనుతీసి ఎత్తుకొని యింట్లో కూర్చోబెట్టినా గోలగా ముంగురుపడుతూ దొర్లుతూ వస్తున్నారు. అప్పుడు ఇరుగుపొరుగు అమ్మలక్కలు సత్యనారాయణ భార్యను ప్రక్కకుతీశారు. తను ఒక ప్రక్కకొచ్చాడు. కట్టెకదలిపోతుంటే అంతదూరం శోకంతో పరువత్తే ఆ యిల్లాలిని ఆపలేకపోయారు.

తిరిగివచ్చాడు. ఇరుగుపొరుగు మనిషోమాట. "తిండి తిప్పలువుంటేనా–ఏదోవున్నవాడు వేళకు యిన్ని మెతుకులు నమిలాడా? నీరసంగావున్నా ఆకొగితం కలంబడిలాడా? ఒంట్లో జీవంలేనిది యిలాంటిపనులుచేస్తే... రాత్రిమీద రాన్రూ రాన్రూ గుండె ఆగిపోయింది! పెళ్లాం పిల్లలు వున్నారని ఏదో వుద్యోగం సద్యోగం చేసి తరవాత అదేదో రాయ కూడదా?...సమయానికి ఆ ధర్మరాజు ఆదుకోకపోతే యిలా తల్లీ పిల్లలూ సముద్రంలో పడాలి గానీ ఇంకేం ఆదరువుఉంది"—ఈమాటలన్నీ ప్రకాశరావు విన్నాడు. సత్యనారాయణ యింటిపొరుగు వాకిట నిల్చొని ఒక వయసుమళ్ళిన వితంతువుంది. సహాయం చెయ్యడానికి ముందుకొచ్చే మనిషి. పెద్ద పిల్లను బుజ్జగించి అన్నంతినేట్లు చేశాడు. చిన్నపిల్లకు ఆవిడ చేతనే పాలు పట్టించాడు. రెండు రోజులు దగ్గర వుండమ్మా అని ఆమెచేత కొంతడబ్బు యిచ్చి యింటికి వెళ్ళాడు.

చీకటి పడ్డవరకూ దిగులుగా ఒక దగ్గర కూర్చున్నాడు. మూడుసార్లు భార్య యెందుకలా వున్నారని తర్కించితే చిరాకు పడగానే ఆమెదగ్గరకు రాలేదు. తరువాత వాకిట వాలుకుర్చీమీద కూర్చున్నాడు. ఆ రోజు చూచిన దృశ్యాలన్నీ మళ్ళీ అగుపిస్తున్నాయ్. ఆ పిల్ల, తండ్రి శవంమీద పడి "నాన్నా... నాన్నా..." అని గగ్గోలు పెడుతున్న దృశ్యం— నిజంగా తను యేడుస్తున్నాడు. ఇప్పుడూ కళ్లు చెమ్మగిలి పోయాయి. మనసు త్రిప్పాలనే ప్రయత్నంతో తల పైకెత్తాడు. చందమామ లేనిరాత్రి—ఆకాశం నక్షత్రాలతో నిండిపోయివుంది. ఓక్షణం రెక్కలు కట్టుకొని అనంత విశ్వంలోనికి ఎగిరి ఆ లోకాలన్నీ విహరించినట్లయింది. సత్యనారాయణ అగుపిస్తున్నాడు. మానవత్వం అనే త్రాసులో యింత కీర్తి ప్రతిష్టలు గడించుకున్న తనను—ఒక మారుమూల అనామధేయుడుగా చింకి గుడ్డలతో పేదరికంతో పడివుండిన సత్యనారాయణను వేస్తే ఆ మిత్రునివేపే మొగ్గ కనిపిస్తోంది! నిజంగా తను ఆయనదగ్గర నేర్చుకోవలసిన దెంతైనావుందనుకున్నాడు. బహుశః తను యెలా వుండాలో నవలలో కొంతవరకైనా వ్రాసి వుంటాడు.

భార్య చాలసేపటినుంచి తన దగ్గరనే కూర్చుందని గమనించలేదు. ఆమె ప్రాధేయపూర్వకంగా "భోజనానికి రారా?" అని అడగ్గానే ఉలిక్కిపడి చూశాడు.

"భోజనమా?...వద్దు!" అన్నాడు.

"మీరు భోజనం చెయ్యలేదని పిల్లలుకూడా..."

చప్పున సత్యనారాయణకు ఆపిల్లల పరిస్థితీ యిలాగే వుంటుందేమో అని తట్టింది. లేచాడు నాలుగు మెతు

కులు నమిలి లేచిపోయాడు. అర్ధరాత్రి వరకూ ప్రయత్నించినా నిద్దర రాలేదు. భార్య కన్నీరు తెచ్చుకోవటం చూచి "ఒక నిజమైన ఉదారుడైన స్నేహితుడు పోయాడు. ఆయనకూ నాలానే పెళ్ళాం యిద్దరు పిల్లలూ వున్నారు......ఆకలితో చచ్చిపోయాడు-ఆ ఆకలి నేనే కల్పించాను—నేనే ఆయన చావుకు కారకుడయ్యాను......"

జొలజొలా కన్నీరు కారుతోంది. భార్య యెదురుగా కాసింతైనా సిగ్గుపడలేదు—వెక్కివెక్కి యేడ్చేస్తున్నాడు—ఆ యేడుపుతోనే "ఇదిగో నీ యెదుట ఆయనసాక్షిగా ఒట్టు వేసుకుంటున్నాను...నాజీవితంలో మళ్లీ యిలాంటి పాపాన్ని వడికట్టుకోను... లోకం అంతా నామీద దుమ్మెత్తిపోసినా.. న్యాయం ధర్మమే నా దీక్ష—నిజాయితీ సత్యాలే నాకు రక్ష!"

అని భార్యను గట్టిగా పట్టుకొని యేడ్చాడు. ఆమె అతనిని హత్తుకుంటూ తల నిమిరింది... అలా ఆమెఒడిలో తల పెట్టుకొని వెక్కుతూ మాగన్నుగా నిద్దర పోయాడు.

తెలతెలవారింది. ఒక సారి భార్యా భర్తలిద్దరూ సత్యనారాయణయింటికి వెళ్లారు. వెళ్లే సరికి పిల్లలు యేడుస్తున్నారు—పెద్దపిల్ల ఓక్షణం తండ్రిని విడిచిపెట్టి వుండేదికాదట. నాన్న నవల రాస్తుంటే దగ్గరవుండి ఒక్కొక్క కాగితం అందుకొని దారంలో మౌనంగా గుచ్చేది. ఈ వేళ ఆనవలే పట్టుకుంది—యేడుస్తోంది! ఆపిల్లను ఎత్తుకొని ఇంటికి తీసుకవచ్చాడు. తండ్రిని మరిపించడానికి యెన్నోవిధాల భార్య ప్రయత్నాలు చేస్తుంటే ప్రకాశరావు గబగబా ఆ వ్రాసిన ఎనభై యెనిమిది పేజీలు చదివి పెద్ద నిట్టూర్పు విడిచాడు.

తను ఒక్క సత్యనారాయణకే ద్రోహం చెయ్యలేదు. లోకం అంతటికీ అపకారంచేశాడు. ఆ నవలే పూర్తయి వుంటే...ఎన్ని భాషల్లోకి తర్జుమా అయ్యేది? యెందరిపై దీని ప్రభావం పడేది?...ఇందులో ఆ ఆఫీసరు పాత్ర...గర్వంలేని మనిషి—బయటచూస్తే వినయవిధేయతలతో ఆడంబరంలేని వ్యక్తి—నలుగురు ప్రజలలో తానొకడు. కానీ ఉద్యోగరీత్యా చూస్తే అతనిది కోడిపిల్లకుండే గుండెకాయకాదు! తుఫానులో ఒంటరిగా ఓడనడిపే నావికుడు. లోకాన్ని కాల్చి వేస్తున్న హాలాహలాన్ని మ్రింగే గరళకంఠుడు. చెడ్డవాణ్ణి హతమార్చే మనిషికాడు-ఆ చెడ్డవాడు తనలాంటి వాడేకానీ వాడికి పుప్పిపన్ను వుంది—ఆ పన్నును పూడబెరికి మిగతా పళ్ళను రక్షించటమే తన కర్తవ్యం! వాడికి కడుపు నొప్పి-ఆ వొరిసిన పేగును కత్తిరించిబాధ నయంచేసే సర్జను ఈ ఆఫీసరు! జాలి, దయ యివి బయటకు కానరావుగానీ శరీరం కోస్తే రక్తంఅంతా వాటితోనే నిండివుంటుంది! హృదయ సంస్కారంతో మెసలి సమస్యలనే పరిష్కరిస్తాడు గానీ మనుష్యుల్ని మాత్రం సమస్యలుగా చెయ్యడు. ఇలాంటి ఆఫీసరు న్యాయాన్ని ధర్మాన్ని ప్రతిష్టించేవాడిలో లోటు ఒకటే వుంటుంది. ఆ లోటేమో కలం ముందుకు సాగి వుంటే తెలిసేది.

ప్రకాశరావు అదేమిటని వూహించసాగాడు. బహుశః ఒకోసారి ఆ ఆఫీసరుకు అహంభావం ఆవరిస్తుందేమో! నిజంగా తనకు ఎంత ప్రయత్నించినా ఒకోసారి అహంభావం ఆవరించేది. నలుగురూ మెచ్చుకుంటే తనకు తానే ఆత్మస్తుతి చేసుకునేవాడు. అలా మెచ్చుకోవాలనేకదా తను నిజానికి కొందరికే వుపకారం చేసేవాడు! మనిషి స్వలాభాపేక్ష లేకుండా బ్రతకటం దుర్లభం—కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలే మనిషియొక్క స్వరూపం! ఇవి యెప్పుడైతే సరియైన పాళ్లలో వుండవో మనిషిఅప్పుడే పతనం చెందుతుంటాడు. వీటిలో ఏది హెచ్చయినాచిక్కే!

ప్రకాశరావు యేపనిచేసినా యీసారి ఆ ఆఫీసరుతో పోల్చుకునేవాడు. తను కనీసం ఆ పాత్ర దరిదాపులకయినా కొన్నాళ్ళకు చేరగలనా అన్న తాపత్రయంతో మెసలేవాడు. సత్యనారాయణ భార్యకు యీ వూర్లో ఆ వూర్లో కథలు పోగుచేసిన కొద్దిడబ్బును పంపిస్తున్నారు. నాలుగునెలలు దాటి పోయాయి. ఈలోగా ఆమె పెదతల్లి కొడుకు వచ్చి చేరాడు. ఆమెను పిల్లలను తనకేదో వుద్యోగం దొరికితే చేరదీసి పెంచాలని తాపత్రయం.

ఒకనాటి సాయంత్రం సత్యనారాయణభార్య ప్రకాశరావుఇంటికి వచ్చింది. అసలు విషయం ఆయనభార్యతో చెప్పుకుంది. ప్రకాశరావు ఆఫీసునుంచివచ్చేక ఆమె ప్రాధేయపడుతూ అంతాచెప్పింది. భర్తను తల్చుకుని యేడ్చింది. ఆయన వుంటే...... తన కన్నీరుమాని యెంప్లాయిమెంట్ ఆఫీసరు లిస్టులో

పేరు యిరికించాడట. ఎందుకనే మీరు కనికరించక పోతే బ్రతుకలేమని బ్రతిమాలింది. ఆవేళనే ఆ వచ్చిన వారిని పరీక్ష చేశారు. సత్యనారాయణకు చేసిన పాపం పరిహారం చేసుకోడానికి సరియైన అదను దొరికింది. తను ఇప్పుడు వుద్యోగాలు వెయ్యటం తన ఒక్కరిచేతులలో పెట్టుకోలేదు. తనతో ముగ్గురు వున్న కమిటీని పెట్టాడు. దానికి తను పెద్దయినా అంతా బాహాటంగా న్యాయంగా చెయ్యాలన్న ఉబలాటం హెచ్చిపోతోంది. తను ఇదివరకు ఈమెకు సహాయం చెయ్యాలన్న పట్టుదల జ్ఞప్తికి వచ్చింది. తనలోని బాధ చాలావరకు కప్పడిపోతోంది—తను కొంతహాయిగా బ్రతుకగలడు—ఇలా ప్రకాశరావు ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చాక అన్నాడు.

“ఆయన రేపు ప్రొద్దున్న పెళ్ళిచేసుకుంటే మిమ్మల్నీ మీ పిల్లలను సరిగ్గా చూస్తాడా అని.”

“ఆ అనుమానం వద్దుబాబూ. పెదతల్లి కొడుకయినా మొదటినుంచీ నేనంటే స్వంత చెల్లెలికంటే అభిమానం ఎక్కువ—ఊరూర ఉద్యోగంకోసం తిరుగుతూ బాధపడుతూ వచ్చాడు. నాకింతకంటె మరే సహాయం చెయ్యమని మీ గడపకు రాను. నా పిల్లలు నేనూ బ్రతకడానికి ఇంతకంటే యింకేం సహాయం నాకు అక్కర్లేదు.”

“రేపొకసారి కనుపించమ్మా” అని ఆ అబ్బాయి పేరు వ్రాసుకుని ఆమెను పంపించాడు. ఆ రాత్రంతా సరిగా నిద్దరపట్టలేదు. తను యిన్నాళ్ళకు మచ్చ మాపుకుంటున్నాననే సంతోషమే తిన్నలా చేసింది—ఇది పాపపు పనికాదని పాపాన్ని తుడిచిపెట్టుకుంటున్నానని ఈ పనితో ఆమె భర్తకు ఆత్మశాంతి కలుగజేస్తున్నానని అనుకున్నాడు.

ఆఫీసులో అడుగు పెట్టాడు. నిన్నటి కాగితాలు ఆ మార్కులు అన్నీ సంతోషంతో తిరగవేశాడు. ఈ పేరు ఎక్కడ వుందని చూశాడు—అదిగో పదిహేనవది...తీసుకోవలసిన నలుగురుపేర్లు పైన వ్రాశారు మిగతా ఇద్దరు మెంబర్లు—వాళ్ళని సరే వెళ్ళండి అన్నాడు. ఎర్రసిరా కలం పట్టుకున్నాడు ధైర్యంగా. కాగితం మీదకు ఇంకా చేరలేదు...చెయ్యి గజగజ వణకడం ప్రారంభించింది...సరిగా ఆ నాలుగవ పేరు మీద కలం చివర ఆన్చాడు...శరీరం అంతా కంపింపసాగింది...ఎందుకో ముచ్చెమటలుపోసేస్తున్నాయ్... కళ్ళు మూతలుపడి పోతున్నాయి. ఆపేరు కొట్టివేయడమనే పని చేసేద్దామనే కళ్ళకు ఆమె దీనాలాపం... సత్యనారాయణకు తను చేసిన ద్రోహం అంతా కూడి మనసును ఉరకలు వెయ్యిస్తున్నాయ్. కాని మనసుకంటే అతీతమైన శక్తి లోపలనుంచి వణికించివేస్తోంది. ఆ కళ్ళు మూసినా ఆ లోపలి తెరలో ఒక ఆకారం—దీనాతిదీనంగా “నాపేరు కొట్టివేస్తున్నావా? నా బాగలు నీకేం తెలుసు? బాధలు చూశా వుద్యోగాలు ఇస్తావ్? నన్నింకొక సత్యనారాయణను చేస్తున్నావా? నీలో న్యాయం ధర్మం ఇదేనా? సత్యనారాయణ నీపనికి రవ్వంతైనా సంతోషిస్తాడా? ఆవేళ రాత్రి యేడుస్తూ ఆయనసాక్షిగా చేసిన వాగ్దానాలన్నీ ఏమయ్యాయ్?” మళ్ళీ ఆ ప్రతిబింబం పకపక నవ్వుతూ హేళనచేసింది. ఈ ప్రశ్నలన్నీ బాధగా యీ జాలిగొన్న హృదయములో గ్రుచ్చుకొని రక్తం చిమ్మినట్లయింది. ఆ బాధలోనే ఆగాథ జ్ఞాపకంవచ్చింది. కళ్ళు తెరచాడు—తను ఆఫీసరు! హాలాహలాన్ని నవ్వుతూ మ్రింగే గరళకంఠుడు కావాలి!

ఆ బాధలోనే నవ్వాడు—నవ్వుతూ గుండె మీద చెయ్యి వేసుకుని రొంగ ఊపిరితీస్తూ గట్టిగా లోన అనుకున్నాడు “న్యాయం ధర్మమే నా దీక్ష! నిజాయితీ సత్యాలే నాకు రక్ష! ఈ అన్యాయం జరుగదు. జరగడానికి వీల్లేదు” అని అంటూ కలం టేబిలుమీద పడేశాడు.

# విశ్వనాథవారి కిష్కింధము

శ్రీ టి. సత్యనారాయణ

విశ్వనాథ కిష్కింధము కోమల చమత్కృత్యాఢ్యము. రమ్యభావ రససామగ్రీ సమగ్రము. ఉక్తిలేని రస ప్రవాహోల్బణము. సుద్దిలోని సమస్తభాసురగుణము. ఇవి కిష్కింధకి ప్రత్యేకతను కూర్చిపెట్టుచున్నవి. రామాయణమును ఒక మహాకావ్యముగను, ఉత్తమ కావ్యముగను రచింప తలంపుగొన్నపుడు, ముఖ్యముగ మహాకవియైనవాడు రచనాశిల్పమును సంతరించుకొనును. రసధ్వనులను వాక్యములోను, శబ్దములోను, రచనలోను చూపును. ఈ కిష్కింధలో వ్యక్తమైన సమ్యక్పరిశీలనాబుద్ధి యిది. ఇది పంపాసరోవర్ణనము. కోమల చమత్కృత్యాన్వము.

శిల్పము రెండు రకములు. వాక్యశిల్పము, శబ్దశిల్పము. ఇవి రచనలో ఉండవలెను. కవి స్వతంత్రుడైనగాని యీ శిల్పాన్ని సుష్ఠుగాను, సమృద్ధిగాను; ఔచితీస్ఫోరకముగాను ఉపయోగించలేడు. ఈ ప్రయోగ పద్ధతి, యీ లోకజ్ఞత విశ్వనాథకి నన్నయ్యగారివల్ల యలవడ్డది. నన్నయ్య ఆద్యుడైన ఋషి. ఆ నన్నయ్యయొక్క ఋషిత్వ్యాత్మ విశ్వనాథలో ఉన్నది. ఆ యున్నదనుకొనిన కోమల చమత్కారపథమే యిది. రాముడు సలక్ష్మణుడు పంపాకాననభిన్న దేశముల సౌభాగ్యాన్నీక్షించుచు, ఋష్యమూక ప్రాంత సంచారి యగును. ప్రకృతియొక్క తునుకులు సీతాదేవి శరీరపు తునుకులవలె రామున కగపడును. ఒక కరుణాపూరితమైన, దర్శనీయమైన సంఘటన శ్రీరాముని హృదయాన్ని ఆచికొట్టినది. ఇక్కడ ఆ పద్యాన్ని ఉదహరించిననేగాని అందులోని అందము కనులకు పట్టదు. "ఆ చెట్టున కౌతీవకు రాచిపెనంగొనిన ప్రణయరాగము గలుగన్, వీచీ దక్షిణ వాయువు ద్రోచెన్ మృదువల్లి దూరదూరమ్మునకున్" ఆ లత కూన ఆ వృక్షాన్ని రాచి పెనంగొని ప్రణయరాగాన్ని నెరపుచుండగా దక్షిణ దిఙ్మారుతతరంగము ఆ లత కూనను దూరదూరముగా ద్రోచివైచినది'అని పైపద్యము యొక్క తాత్పర్యము. ఇది కందమున వెల్లడిచేయబడినది. ఇది చమత్కృత్యాఢ్యమైన లోకాతిశాయి రచనాశిల్పసౌభాగ్యము. దీనిలో రెండు సమాసపదాలు వాడబడినవి. ప్రణయరాగము. వీచీ దక్షిణవాయువు. ఈ రెండు పదాలవల్ల కమనీయమైన భావము వెల్లడి చేయబడుచున్నది. ఒకటి స్నేహానుబంధమైన ప్రేమ. ఇది సుకుమారము. దీని విశేషణము 'రాచి పెనం గొనిన' అను తెలుగు పలుకుల కూడిక. ఇది ఒక సూక్తి వైచిత్రి. అందుకొఱకు కవి మృదువైన పదాన్ని పొదిగినాడు. రెండవది. వీచీదక్షిణవాయువు అన్నది. దీనిలోని మగణము, క, వ, సంయోగము కొంచె మౌద్ధత్యమును సూచించును. ఇది కరుణరస వ్యంజకమైన ఘటము. ఔద్ధత్యమునకు తావులేదు. అయినను ఆ యుద్ధతి ధ్వనింపవలెను. దక్షిణ దిఙ్మారుత మనగానే దక్షిణ దిశాక్రాంత పరమోద్ధతుడైన రావణుడని ధ్వనించక తప్పదు. ఈ వాయువు అనగా రావణుడు, మృదువల్లిని సీతను, దూరదూరమ్మునకు ద్రోచెను. సీతాపహరణము జరిగినది. ఈ అనంతమైన శిల్ప మార్గమే కోమల చమత్కృతి. ఇక్కడ వాల్మీకి దృష్టి వేరు విశ్వనాథ దృష్టి వేరు. ఇతిహాసపు దృష్టి వాల్మీకి రచనలో కనబడును. మహాకావ్యోచితములైన ధ్వని వ్యంగ్య శిల్పసృష్టి విశ్వనాథలో కనబడును. కేవల రామ విరహ వర్ణనము పాఠకుల మనస్సు మారగొనదు. పంపా సౌందర్యముచేత ఉద్దీపితుడు రాముడు ఈ దృశ్యములైన లతాపాదపములను వీక్షించగానే దక్షిణదిక్కు స్మృతిలో తిరుగును. ఇది యొక విభిన్న సౌందర్యము. ఇది నాన్యతో దర్శనీయమైనది.

మరియొక పద్యాన్ని ఉదహరింతును. 'ముని కాళ్ళ నిలచి కుందెలు, వను పరకాయించి చూచి నళినాక్షికథల్, తనకుం దెలిసిన చెప్పను తిన చేతంగాక పోవు దక్షిణ దిశకుకా' కుందేలు రాముని చూచినది. సీతా విషయము తనకు తెలిసినను, చెప్పుట చేతగాక

దక్షిణ దిశగా వెడలిపోవును' అని దీని భావము. కుందేలు దక్షిణ దిశగా యెందులకు పోవలెను? ఆ దిక్కున రావణు డున్నాడు. వాడు సీత నపహరించినాడు. వాడు రాక్షసుడు. మహాబలుడు. లంకాధిపతి. ఈ ధ్వని భావోన్మీలన చమత్కారార్థ సంయోజనలింగున నిక్షేపింపబడినవి. కుందేలు రాముని దీనావస్థకు జాలిపడుట, రామునితో సంభాషణకు దిగబడుట, మాటలురాక సంజ్ఞాపూర్వకముగా దక్షిణ దిగ్భిత్తిని మాయమగుట. ఇంతభావుకతతో నిండి చమత్కృత్యంతమైనది యీ ఒక్క పద్యము. దీన నానారుచిరార్థములు వెలిగినవి. ఈప్రకారమైన రచనకు నన్నయ్య యాద్యుడు. విశ్వనాథ తదనుయాయి. తనకు సహజమైన శయ్యామాధుర్యముతో పంపాసరః పవిత్రతను మంచిపద్యాలతో రచించును. అది భాస్కరునికి పట్టలేదు. వాల్మీకి అతిశయముగా వర్ణించినాడు. విశ్వనాథ సహజ భావుకతతో రసధ్వనుల నిండుపట్టి యీచినాడు. నన్నయ్య ఋష్యశృంగఘట్టమున నిట్టివి ప్రసన్నము చేసినాడు.

ఇంకొకచోట కవి భాషారుచిని వెల్లివిరియింపజేసినాడు. కావ్యగతమైన దృష్టితో ఆలంకారికముగ రచనను నిబద్ధము చేయుట. భాషాదృష్టితోడనే రచనను చేయుట. ఈ రెండును రెండైన కవితాపద్ధతులు. భాషాదృష్టితో కావ్యగత కథారీతులను పరిశీలించి భావించినపుడు 'ఇది సమాసము, ఇది తెనుగు, ఇది సంస్కృతము, ఇది లక్షణవిరుద్ధము, ఇక్కడ శయ్య కుంటుపడినది" ఇత్యాదులు స్ఫురించును. ఇది రెండవ రకమైన కావ్యము. ఈమార్గము పలువురు కవులకు పరిచితమైనట్టిది. ఇందులో గొప్పనైశిష్ట్యమేమియు లేదు. కావ్యగతమైన శిల్పదృష్టితో భాషావిషయాన్ని పరామర్శించునప్పుడు రసానుభూతులు చూడబడుచుండును. 'ఇక్కడ భావము బాగున్నది. ఇది పాత్రయొక్క యౌద్ధత్య శృంగారాదులను చక్కగ వ్యక్తము చేయుచున్నది. ఇక్కడ భావశబలతతో మధుర తరమైన ఘట్టము నిష్పత్తిదశలో సాగిపోవుచున్నది. ఇది పరమానంద రసోర్జితమున కందము చేకూర్చినది' ఈరీతిగా దృష్టి సాగుచుండును. ఒక మహాకవి రసోర్జిత మహాదృష్టితో కావ్యపథమును సుష్ఠుగను, సుందరముగను, ఆదర్శ సంయుతముగను దిద్దునప్పుడు అక్కడ స్వల్పదృష్టి, విమర్శయోగ్యము కానేరదు. అఖండమైన గంగానదిలో, 'ఇవి మణికర్ణికనీళ్లు, ఇవి హరిశ్చంద్రఘట్టపునీళ్లు,అను వ్యాప్తికలుగరాదు. ఇది అఖండమైన గంగాస్రోతస్విని. ఆరీతిగనే 'ఈగ్రంథము నిరవధి కాచ్ఛాంద్రసమ్మిశ్రిత మహావీచీయుత మహాభాషాప్రవాహ'మను నూహయుండవలెను. ఈమార్గాలు మహాకవులకు క్రొత్తలుకావు. కవితాదృష్టి యెప్పుడు నాలంకారికముగ నుండును. ఔచిత్య పరిస్ఫోటనమై యుండును, రసమయమైయుండును. లాక్షణికదృష్టి యుపసారియుండును. ఈదృష్టి సర్వత్ర యిందు జూపింపబడినది.

ఇంకొక చమత్కార మార్గాన్ని చూపి విరమింతును. గ్రంథమంతయు విచిత్రార్థములు గలది యైనను స్థాలీపులాకన్యాయమున పరిశీలింతును.

రాముడు వాలిని చంపుదునని ప్రతినచేయును. అయినను ధర్మభంగ భయమును శంకించును. రామసుగ్రీవుల మైత్రీగాథలు అంగదుని మూలమున వారికి తెలియునట్లు చేయును. ఈవిషయములు వాల్మీకి, యుద్ధమున కేగబోవు వాలికి తారచేత అంగదుని వచనములుగా సూచించినాడు. భాస్కరుడా మార్గమునే యనుసరించెను. విశ్వనాథ ఆ విషయమున చమత్కారము నవలంబించి పరివర్తన కల్పించినాడు. ఇందు రసికులు లోనారసి మేలు అనునట్లు చేసినాడు. సుగ్రీవానుచరులు మధ్యేకాననమున అంగదు నాపినారు. శ్రీరాముని విషయమును చెప్పినారు. ఇక్కడి పద్యశిల్ప మనంతప్రతిభ గలది. శిల్పమనగా పద్య సౌందర్యము. పద్యము యొక్క యారంభదశ బాగుండవలెను. పద్యాంత మందలి దింపుగడ యతిశయ మాధుర్యము కలిగియుండ వలయును. ప్రాసయతి ప్రదేశములు తేనెలు వాకలుకట్టినట్లుండవలెను. ఔచిత్యము సర్వత్ర నిండినట్లు పొడసూప వలయును. ఇట్టిది పద్యశిల్పముగును. ఈపద్యము నీలుడు అంగదునితో అన్నది. "మన వనదేశ మందసహమాన పరాక్రమవహ్ని కోసలేశుని తనయుండు రాముడను శూరుడు, శౌర్యాఢ్యుడు, ధర్మభంగకోపనమతి చాప ధూర్జటి, ప్రభాజలజాప్తుడు, తాదృశానుజుండును మరి తా జరించెడు గనుగొనినావె వనాంతవీథులన్" ఇది పద్యము. ఇందులోని అన్ని మాటలు దళసార్థకత గలవి. అయినను ఇందులోని రెండు విశేషణములలోని విశేషములను కదిలింతును. ఆరాము డెట్టివాడు? ధర్మభంగకోపనమతి. ధర్మమునకు భంగము కలిగిన

సహించలేదు. సహించక ఏమిచేయును అన్నది. అతడు చాపధూర్జటి. ఈమాటలో ఎంతైనాఅర్థమున్నది. ధనుర్ధారియగు పరమేశానుడు అని. శివుడు చాపమును ధరించినది త్రిపుర దహన కాలమందు మాత్రమే. అయ్యర్థము రామునిలో ధ్వనిస్తున్నది. వాలి ధర్మేతరుడు. ఎంత దుందుభి మాయావులను నిర్జించినను చాపధూర్జటియైన శ్రీరాముని పురోభాగమున నిలువబడలేడు. ఈమాత్రతకై, లోనారయవలయును. ఇంతేకాదు. "పట్టిసరేకాదు. ఆయన ముట్టిన బాణంబు వేగమున క్రౌంచాద్రిం ఘట్టించిన భార్గవశర పట్టాభిషవణము ప్రయ్యాపరచినది సుమీ" ఇది భయ సంసూచి. అంగదుని మనస్సుకి బాగుగా తగిలినట్లున్నవి. ఈ దృశ్య రచన సర్వరసములను మూటకట్టి తెచ్చి పరచునట్లుండును. విశ్వనాథయొక్క అనంతప్రతిభ కిది యొక చక్కనైన రూపకల్పన. పై పద్యములోని సమాసము అన్ని రసములను వెల్లడిచేయు అనంతముఖమైన వాక్కు గలిగిన మహాకవిని ప్రత్యక్షము చేయును. ఆ ఘట్టమును ముందు చదివిననేగాని పాఠకుని కిందలి రుచిలోని యాథాతథ్యము గోచరించదు. ఆ వానరుల కింకొక మాటయని అంగదునితో "నీ కొక మాట చెప్పుటకు నేనిట నిల్చితి రాముడన్నవాడా కుటిలోగ్రభూమి భుజగాభుడు నీ పినతండ్రితోడ నేసై, కరముల్ కరమ్ములను నగ్గియు సాకిరి గాగకట్టినారు, ఆకపెలోక రాక్షసు వహించుయువు నీ పిత యేమి కావలెన్" అని జాలి తలంచుచుండు. అంతియ కాక, వనమున కుపద్రవమే యైనచో వ్యాఘ్రమునైనను చంపును, వానరేసుడైన వాలినైనను చంపును. తనకు మాటుగ మీ పినతండ్రి యుండెను సుమా! రాముడు క్రూరుడైన వేటకాడై యున్నాడు! ఇదంతయు చదువుతుంటే యిందులోని గడుసు పలుకుబళ్లు మనలను విముగ్ధులను జేయుచునుండును. ఇది రామాయణమున నిజముగా చమత్కృతీసంసూచియైన ప్రధానాంశము. నాటకములోని నాలుగు పాత్రలు నటన చేసినట్లుండును.

సుగ్రీవుడు పట్టాభిషిక్తుడయినాడు. తాదృశానంతభోగపరిలోలుడై రాముని మరచినాడు. ఇంతలో వర్షర్త్వాగమన మయినది. ఇక్కడ ఒక చమత్కారము. సహజ సుందరములై పరవళ్లు త్రొక్కిన కవీశ్వరుని లోకోత్తరభావనామధురిమలు జుబ్బన జూరలాడు కొన్నవి. ఇక్కడి శయ్యా సుందర సుమమముగా ఉన్నది. ఆ తీర్చిన తీర్పు నాన్యతోపరిదృశ్యమానమై నట్టిది. ఈ భావుకత నిర్వ్యాజముగ్ధాకృతి గలది. ఇట్టి పట్టులలో కవిరచనా చమత్కృతినే చూడవలయును. రససౌభాగ్యానికిది చోటుగాదు. అయినను తన సర్వతోముఖప్రతిభవల్ల విశ్వనాథ రసమును పద్య శిల్పంతో మేళనము చేయుచు, శిలలనుగూడ చిగురింపజేయగలుగును. వర్షాగమనమును పీసమున మూసకట్టి చూపించును. ఆ పద్య మిది.

"ఒక మబ్బు గిరిశృంగనికటమ్ము విడిపోదు
క్ష్మాధరేంద్రుని కంట గ్రాగినట్లు
ఒక మబ్బు గిరిపాదనికటాన జేరాడు
మన్నింప ప్రార్థించుచున్న యట్లు
ఒక మబ్బు గిరిమహోశికటిస్థ యూగాడు
సంభోగ శృంగార చలిత యట్లు
ఒక మబ్బు గిరిపంచ నూరక తిరుగుని
రాకృత ఆస నల్లాడునట్లు
తానొ యేడాది కొకసారి కానుపించు
నవమనోజ్ఞుడు దక్షిణనాయకుండు
మబ్బుకన్నెలి ట్లొంగుట యబ్బురంబె
పరమశృంగారమూర్తియే ప్రస్రవణుడు."

ఇట్టివే, శేషములు లెక్కకు మిక్కుటములు. ఇవి భాస్కరునిలో మార్గణ పరిదృశ్యమానములు. వాల్మీకినిగూర్చి మాదృశులేమీ పలుకలేరు. విశ్వనాథలో సముచితములు. ఇవి కిష్కింధములోని కొన్ని చమత్కార సన్నివేశ నిపుణములు ఇంక రసమార్గమున నడచి, అందలి వింతలను కనుగొనవలెను.

సుగ్రీవుడు రెండవమారు వాలిపైని బొబ్బలు రేపును. వాలి సుగ్రీవ కృతము రావము విని మండిపడి లేచినాడు. ఈమారు తార కన్నుంగొనలందు భీతి యురిమినది. వాలి నాటంకము చేసినది. నీతిని మూడు మార్గముల ప్రబోధించినది. నీతిపథము, సధర్మమైన భియహేతుత్వమార్గము శ్రీరామచైతన్యమందలి విశ్వాసతా నిష్కర్ష. ఇక్కడి పద్యాలు ఇరువది. అన్నియు శార్దూల మత్తేభములు. ఆయా రసప్రదర్శక పరమహేతువైవిన్యములు! వాని భావములు సంగ్రహపరచి పరిచయ మొనర్చుట యప్రస్తుతము కాదు. సుగ్రీవుడు మహాధిపణాభావుడు తాను చేయు పనినిగూర్చి పరమాలోచనాపటువు. వృథాకృత్యమును చేయనివాడు. నీ యెదుట నిలువలేనని తెలిసియు నెందులకు వచ్చినాడు. దీనికి

మన అంగదుడు నుడివిన మాటలు మహాబలమైనవి. రాముడు బలశాలి. ఈ చెట్లుకూడ అతని శౌర్యరేఖా విస్ఫూర్జితాలను గానము చేస్తున్నవి. అతడు భార్గవ రాముని నిర్జించినాడు. మహాశర్మనిర్దేశ్యతాపరిణతి ధీరుడైన రాముడిక్ష్వాకుల వంగడమున బిడ్డడు. మహర్షి కల్పుడు. అతనితో మైత్రి సుగ్రీవుని యదృష్టమే.

ఎక్కడ నికామమశర్మము గూడు కట్టుకొని యుండునో, ఆపాదులు పెల్లగించుటకే మహాత్ములు రాజ్యమునైనను త్యజించి వత్తురు. ఆరాముడు మొదట నీయొద్దకైనను రాలేదు. నీతో మైత్రి రాణించదు. సుగ్రీవునిలో నిన్ను మించిన యుదాత్తమైన, జగద్విస్ఫోటనమైన బలమును చూచెనా? లేదు. ఇదే కర్మమార్గము బహు విచిత్రాశ్వములు గలది. ఊహించుటకు గొప్ప ఆలోచనాశక్తి సుగ్రీవునకున్నది. అతని బాహుబలము ఏతన్మాత్రము కాదు. పండితమాళి హనుమంతుడున్నాడు. అతడే మైత్రి కలిగించియుండును. ఆ సుగ్రీవుని యువరాజపదమున స్థాపించి సామరస్యమును ప్రదర్శించుము. ఆరాముని కొనకోనలలో తిరుగనిమ్ము. "నీవు కులాచలేంద్ర సమ నిశ్చల దేహబలుండవద్రి నీపై విసరన్ ఖరింగవలబారవు, తాదృశుడయ్యు గూడ నోహో వెస సప్తతాళదళనోగ్రము బాణము నెంచ గుండెలో నావులు తేరు నిల్వగలవా! రఘురాముని యంపరివ్వనన్" సుగ్రీవులు వందలు వచ్చినను భయపడను. శ్రీరాము డేవేళనో వృక్షాంతర్గతుడై బాణము దూయును. అప్పుడు నిన్ను కాచుకో గలుగుదునా యని నా యిప్పటి యూహ" ఈ మొదలుగాగలవి తారమాటలు. ఇవి నీతిధిషణాభావప్రగల్భములు. ఆలోచనాచారువులు. భావశబలతా[illegible]మయములు. ఈదృశములైన ఘట్టములు మరి రెండున్నవి. అవి అనంతములైన రసధ్వనుల కాదిమరంగములని నుడువవచ్చును. వాలికి తన యెదలో నివి నిర్ణయైక మార్గము బాగుగ తెలియవలెనని తార అత్యంత మార్దవముగాను, మందిముగాను మాటాడి, వెనువెంటనే మార్దవకాఠిన్యతలను సమపాళమున నుపయోగించి మాటాడును. ఇది వాలిని యుద్ధవిముఖునిగా జేయుటకు కూర్చబడిన అతి సుందరమైన, రస వ్యంజకమైన యొకమార్గము. రాముడన భయము. వాలి పరాక్రమముపై నమ్మకము. సుగ్రీవుని యాలోచనా శక్తిమీద తీక్ష్ణతాపటుబుద్ధి. ఈవైచిత్రి యంతయు తారా వచనములయందు ప్రస్ఫుటించినది. ఈపట్టున విశ్వనాథ తన కలమును మాత్కృపరిజ్ఞాతలైన మహాకవులయూహాగమ్యముగ జేయగలిగినాడు. ఇందలి వృత్తౌచిత్యము, శబ్దార్థగత గౌరవప్రపత్తి, తెనుగుతనములోని యందము, ఇవి దీనిని మహాకావ్యముగ నొనరించినవి. కొన్ని శబ్దములు వాచ్యములై గభీరార్థ వ్యక్తీకరణములగును మరికొన్ని వ్యంగ్యమర్యాదా సంపత్సంయుతము లగును.

ఊహాలపై నూహాలను సృజింపజేయు రసవద్ఘట్టము వాలి శ్రీరాముని నిందించుట. ఈ నింద 25 పద్యాలలో చేయబడినది. అన్నియు త్రిశూలోగ్రాఖిలములు. వాలియొక్క అంతరాంతరమనస్సంకల్పజన్యములు. మాట చిన్నది. భావము గుండెలోని నెత్రుకండలను కదలించును. ఒక మూడు పద్యముల నుదహరింతును. అవైనను కందములు. "నీవేమిటి శ్రీరామా! యీ విమలేతరము కార్యమేమిటి రామా! నే విన్నదాని కెంతో పైనెలసిన దీ మహానుభావత చూడన్". "ఇదియేమి చేసినాడవు. త్రిదివాయోగ్యంబు కర్మ దెప్పరమున్, కట్టిదమును, నింద్యంబును దుర్మదు లస్వర్గ్యులు పొనర్చు మలినంపు గృతిన్". "అలఘు భుజాబలసాగోజ్వలుడై విదలించి సప్తసాగరముల లోపల ముంచి, యెత్తగల్గుదు, కలితమహాకళి పంక్తికంఠరు నేనై". ఇటువంటివే అన్ని పద్యములు నిబంధింపబడినవి. ఇవి భావరస సామగ్రీ సమగ్రములు.

శ్రీరాముడు వాలిని మందలింపుగా ప్రతి సమాధానములు పలుకుట కేవలము రసస్రోతస్వినియే. తారా విలాపము, సుగ్రీవుని రోదనము, ఇవి కరుణరసోల్బణములు. సుగ్రీవుని కీ శ్మశానదృశ్యమదృష్టపూర్వము. సర్వకిష్కింధయు రోదనపరిదూషితము. అది పట్టశక్యము కానిది. సుగ్రీవునకు వైరిభావము నశించినది. కరుణార్ద్రుడైనాడు. ఒకమాట రామునితో పలికినాడు. "నీవు దండ్యుని దండించినావు రాజవు, ఏను చేసిన పనియేమి యీశ్వరా! మహానుభావుని జంపించినాను సర్వకపిజగత్పరమేశు నగ్రజునిరాజు" ఇంత యౌచిత్యమే కావ్యమున కనంబడును? ఇవి విపుల రచనా పరిద్యోతితములు. లోకమున కోపమురాగా కఠినముగ మాటలాడుదురు. కావ్యమున నంతియే. లోకమున మోదమురాగా, మృదువుగా, హాయిగా, శృంగారాభి వ్యంజకముగా మాటలాడెదురు. కావ్యమున నంతియే.

కావున లోకవ్యవస్థయే కావ్యమునకూడా ప్రతిబింబిత మగుచుండును. ఇంకొక్క విషయమును వ్రాసి ముగింతును. అది భాసురగుణోపేతమైనది. మహనీయమైనది. సుగ్రీవుని యంతిపురిలోనికి లక్ష్మణుడు గమించును.

లక్ష్మణునకు అక్కడ భోగలాలసుడు సుగ్రీవుడగపడినాడు. లక్ష్మణుడు పడగవిప్ప ప్రయత్నించు పసిత్రాచువలె నైనాడు. దక్షిణహస్త సంగృహీత సశరకార్ముక లస్తకుండు దక్షిణపాదమున నిబ్బరముగ నిలచినాడు. ఎంతిగనో తూలనాడినాడు. ఈ పద్యము భావుకతకు నిదర్శనము. "అన్న మాటపై నిలుతువో, అంప నిప్పుసెగలయందున సర్వకిష్కింధ బూది బుగ్గిగాఁ జూతువో, చెప్పుము, శితశరము తాళియున్నది నీ సమాధానమునకు" దీన నుదగ్రవ్యగ్రుడైన లక్ష్మణుడు సాక్షాత్కరించినాడు. ఆ తెలుగు సమాసానికి ఎంతైన వేడిమి యున్నది. తీక్ష్ణత ఉన్నది. భావపు వెలుగు, బిగువులు ఉన్నవి. లక్ష్మణుడు కిష్కింధాప్రయాణమాదిగా, సుగ్రీవ ప్రతివచనాంతమువరకు గల కథాగతమైన రీతి యొక నాటకశిల్పము. ఈ నాటకమున స్త్రీ తార. అఘటన ఘటనాచతురిమలు గల ప్రౌఢాంగన. నాగరక స్త్రీ. అంతిపురిసెరజాణ. ఆమె మాటల చమత్కార ప్రవాహమున రాముడులే విలువలేకపోయిరి. ఇంతగా ఔచిత్యమును ప్రదర్శించి తారని తారాపథాని కెత్తినాడుకవి. ఇది కావ్యపథాని కొక భాసురగుణము.

హనుమంతుడు జాంబవంతునిచేత ప్రబోధితుడగును. ప్రబోధితుడైన హనుమంతుడు విజృంభించును. అతని పరాక్రమము పట్టరానిదైనది. పట్టరాని ఆ పరాక్రమమును వెడలగ్రక్కుటయును నొకమార్గ మాతనికి గోచరించినది. ఇక్కడి పద్యములు విరియపు తునుకలు. ఆవేశపటువులు. మర్యాదా విజృంభమాణములు. సంస్కృతము, తెనుగుల యొక్క సుందరములైన విస్పష్టములైన రూపములు అభ్యుదయార్ఘ్యమున తీర్చిన తీర్పుగా ప్రయోగింపబడినవి. ఇవి కిష్కింధాంతభాగమున సృజింపబడి సుష్ఠుగా నిలుపబడినవి. ఈ దృష్టితో రచింపబడిన యొక పద్యమును రుచికై చూపించెదను.

"ఎంతటివాడు కావలయు
నెప్పుడు యత్ప్రతిభా విశిష్టుడై,
యంతటి వాడు నేనగుచు
నప్పుడు తత్ప్రతిభావిశిష్టుడై,
అంతిక ప్రాంగణ స్థిత మ
హాధ్వజవద్భుజదండ తీవ్రతన్
చింతిత కార్యముల్ తవర జేయగ
కల్పతరూపమానుడన్".

ఈ పద్యమంతటికి అపూర్వ రమణీయతను సాక్షాత్కరింపజేయు, ఆ యచ్ఛబ్ద తచ్ఛబ్ద ప్రయోగము లంగోని గడుసుదనము పాఠకులయొక్క లోయెడదలను పట్టి యుంచగలదు. ఎప్పుడు, అప్పుడు, ఎంత, అంత, మున్నగు తెనుగు సర్వనామముల యొక్క యొదుగులు పాఠకులను చమత్కృతచిత్తశిథిలులనుగా నొనరించును.

కవి తన యనంతప్రతిభావ్యుత్పత్తులచేత బహుమార్గములుగా భావను సృష్టించును. అది తలమానికమగును. విశ్వనాథ యాకోటిలో గణనకెక్కినాడు. ఈ సృష్టించిన భావములో ఎంత సూక్తి. 'ధరణి కొలకును తండ్రి సోదరుల నెల్ల జంపుటన్నది యుండు మ్లేచ్ఛజనవృత్తి, మంత్రిజనుల, యిష్టంబుగా మహిని తమ్ముడైన పొందగ జనుట ఆర్యజనవృత్తి' ఇందులోని 'ఐన పొందగ జనుట' యను తెనుఁగు నుడికారపు సొంపు గొప్ప రచనను తెలియజేయును. ఇట్టివి విమర్శనాపరమోద్దీప్తములై వాక్యాలంకారము లగును. ఇది విమర్శించుడు. ఇది కేవలము తెనుగుజాతిని జ్ఞాపకము చేయును. "అన్నయన్న, వినోదంబ, అన్న కొడుకులన్న బడి చచ్చుటయు నున్నదయ్యా జగతి" ఈదృశ రచనను కవి తనదైన లౌకిక విషయమహాపరిజ్ఞానముచేత రమణీయార్థప్రతిపాదకములైన శబ్దములతో నింపును. తెలుఁగు వాక్యరచన మెట్లుండవలెనో, జాతీయతలు, నుడికారములు ఎట్లు ప్రయోగింపవలెనో, తెలుగు సంస్కృత మర్యాదలనెట్లు రక్షణముచేయవలెనో, కవి గమనించుచు కావ్యగ్రథన చేయగలిగి యుండవలయును. కొన్ని ప్రయోగములు తెనుగుజాతి వాడినట్లు ప్రయోగింపవలయును.

విశ్వనాథ కిష్కింధను బహుధా ఖండముచేసినాడు. ఆయా ఖండములలో బహు రహస్యముల నిమిడ్చినాడు. నిజమైన తెనుగు రామాయణమును మన కందించుచున్నాడు. ఏ కథకు, ఏ భావమున కే శబ్దము, ఏ రచనము, ఏ శయ్య నిసర్గసుందరమై ప్రతిభ వెలార్చునో, తెలిసిన కవి సమ్రాట్టు విశ్వనాథ. ఇది అపరిమేయ వైచిత్రీపరిదక్షుడైన సరస్వతి యొక్క ప్రసాదముననుభవించిన కవికి సిద్ధము. కిష్కింధా ఖండములలో నియ్యది స్ఫురించును. ఈ కిష్కింధను విమర్శించి పరామర్శించు కొలందిని రమణీయములైన రసభావసామగ్రులు సమగ్రములై మన మనోవీథిని గోచరించును.

# స్వయంవరం

### శ్రీ రావి కొండలరావు

* * శుభ్రంగా అలంకరించిన పెద్ద గది. ఒకమూల పుస్తకాల రాక్, చిన్న బల్లా, దానిమీద పుస్తకాలూ, కాయితాలూ, కలాలూ అన్నీ శుభ్రంగా వున్నయ్. ఒకప్రక్కగా బుద్ధవిగ్రహం ఒకటి వున్నది. ఎదురుగా గోడకు 'బెర్నార్డ్ షా' పటం పెద్దది కనుపిస్తున్నది. దానికి రెండు వేపులా ఓ ప్రక్క గాంధీ, ఓప్రక్క అబ్రహాం లింకన్ పటాలు—గదిలో రెండు ప్రక్కలా సోఫాలూ, మధ్య అందంగా ఓ చిన్న స్టూలు; దాని మీద 'ఆష్ ట్రే' తప్ప యింకేం లేవు. సోఫాలకు మధ్యగా ఎదురుగా పడక కుర్చీ—దాంట్లో ఓ వ్యక్తి కాళ్లుజాపుకుని పడుక్కునివున్నాడు. అతని మొహంలో బెర్నార్డ్‌షా పోలికలు కనుపిస్తున్నయ్. అతను పుస్తకంచదువుకుంటున్నాడు. బాగా వదులుగా వున్న చారల పైజామా పైన పల్చని సిల్కుచొక్కా వేసుకున్నాడు. పైప్ కాలుస్తున్నాడు. వయస్సు 50 సం॥లు దాటాయి. గడ్డం పూర్తిగా నెరిసిపోలేదు. ఆయన పేరు రఘునాథం.

రఘు : (లేచి కూచుని పుస్తకంమూసి, అటూయిటూ చూసి—'పైప్' గట్టిగాపీల్చి పొగవొదుల్తూ) గుమాస్తాగారూ ... గుమాస్తాగారూ (ఆగి గట్టిగా) హనుమాన్లుగారూ!

[హనుమాన్లు లోపల్నించి ప్రవేశం. నలభయ్ దాటింది వయస్సు. ఐనా ముసలితనం కనుపిస్తున్నది. తెల్లటిబట్టలేకాని, మాసి వున్నై. గడ్డంకూడా కొద్దిగా మాసింది.]

హను : (అత్రుతగా వస్తూ) పిలిచారా?

రఘు : మూడుసార్లు పిలిచాను—కూచోండి.

హను : (కూర్చుంటూ) ఈ మధ్య చెవుడుకూడా వొస్తున్నట్టుంది.

రఘు : అన్నీవొస్తాయి — (హనుమాన్లు మొహంలోకి వొకక్షణంచూసి) అదిగో. మళ్ళీ మరిచిపోయారు.

హను ఏమిటి?

రఘు లక్షసార్లు చెప్పాను.

హను (భయంతో) ఏవిషయం అంటారు?

రఘు ఏవిషయమన్నా సరే—చెప్పగానే మీరు గుర్తుపెట్టుకోవాలిగాని—

హను చిత్తం.

రఘు ఇటువంటిచిత్తాలు ఎన్నయినయో తెలుసా?

హను క్షమించండి—నాకు గుర్తుదొరకటంలేదు.

రఘు చేత్తో మీగడ్డం రాసుకుని చూడండి.

హను (ఆవిసంగాచేసి) తప్పే—ఇవాళ గడ్డం తీయిద్దామనుకున్నానుగాని—

రఘు ఏదో అవాంతరం వొచ్చిపడిందంటారు. పెంచితే పూర్తిగా షాలాగా (పటం చూపుతూ) పెంచేయండి — లేకపోతే శుభ్రంగా వుంచండని చాలాసార్లు ప్రార్థించాను. మాసినగడ్డంవాళ్ళను చూస్తే నాకు వొళ్లుమండుతుందని మీతో చెప్పేవుంటాను.

భాను : చిత్తం—చాలాసార్లు అన్నారు.

రఘు : అంతేమాత్రం ఏంలాభం? వినేవాడుంటేనే చెప్పినదాని ఫలితం. సరే—నేను చెప్పిన ఆవిషయం ఏంచేశారు?

భాను : (ఆలోచిస్తూ) ఏ...ది...?...

రఘు : అదిగో మరిచిపోయారు. మీరు పుస్తకాలు విరివిగా చదివితే జ్ఞాపకశక్తి అలా నశించదు.

భాను : చిత్తం—

[నౌకరు ప్రవేశం]

నౌక : ఎవరో వొచ్చారు సార్—

రఘు : ఎవరూ?...సరే—రమ్మను.

[నౌకరు వెళ్లాడు.]

భాను : చిత్తం—అమ్మాయి పెళ్ళి విషయంకోసం ఐవుంటుంది.

రఘు : ఊఁ—

[వొక్కక్షణం నిశ్శబ్దం. తర్వాత వో వ్యక్తి ప్రవేశించాడు. గంభీరంగావున్న విగ్రహం. లాంగుకోటు, షర్వా వేసుకున్నాడు. పెద్ద మీసాలున్నయ్. నెత్తిన టోపీవున్నది—చేతిలో వో పొన్నుకర్ర. ఆయనకు సుమారు 50 ఏళ్లుంటాయి. కాని ఎవరూ అన్నివుంటాయనుకోరు. ఆయన వొస్తూనే, నమస్కారం అన్నాడు.]

రఘు : నమస్కారం-రండి ఇట్లా దయచేయండి.

ఆ వ్యక్తి : (సోఫాలో కూచుని) మిమ్మల్ని చూడగానే బెర్నార్డ్‌షా ఏమో అనుకున్నాను.

రఘు : ఏమిటి- మీరు ఆయన్ను చూశారా? (లేచి కూచున్నాడు).

వ్యక్తి : అబ్బే- ఫోటోలో చూడటమే!

రఘు : అవును- ఆయన్ను చూసే అదృష్టం కలగటం కష్టం. ఐతే నన్ను మీరు 'షా' అనే అనుకున్నారూ? అనుకోవాలనే నా కోరిక. ఆయనంటే నాకు చచ్చేంత ప్రీతి. మొహం ఆయనలాగా వుండకపోయినా గడ్డం, మీసాలూ జుట్టూ అట్లా పెంచాను.

వ్యక్తి : (అక్కడున్న పుస్తకంచూస్తూ) ఈపుస్తకం కూడా ఆయనదే!

రఘు : ఆఁ ఆఁ- ఎప్పుడూ ఆయనపుస్తకాలు చదువుతాను. ఆ లోపల లైబ్రరీలో పుస్తకాలు చూశారా? అందులో ఎక్కువ ఆయనవే... ఆఁ...మిమ్మల్ని నేను ఎరిగినట్టులేదు.

వ్యక్తి : ఎరగరు. మిమ్మల్నికూడా ఇంతకుపూర్వం నేను ఎరగను. విన్న వొకాయన వోమాట చెబితే, ఆ విషయం కనుక్కుందామనీ-

రఘు : మీ పేరు వినివుంటానేమో!

వ్యక్తి : నా పేరు భూషణం. మీరు వినివుండరు. నేను పూర్వం జమీందారును. ఐతే ఇప్పటికీ ధనానికీ హోదాకూ ఏ తక్కువా లేదులెండి. నాకు యిద్దరు అమ్మాయిలు సంతానం. పెద్దమ్మాయిని వో జమీందారుకే ఇచ్చాను. రెండో అమ్మాయికి యింకా పెళ్ళికాలేదు- ఆ ప్రయత్నంలో వున్నాను. నా స్నేహితు డొకాయన మీరు చాలా ఉత్తములనీ, మా కంటే అన్ని విషయాల్లోనూ చాలా మెరుగయినవాళ్లనీ- పేరు రఘునాథంగారనీ అన్నాడు.

రఘు : కాదులెండి. రఘునాథ్‌షా అని మార్చుకున్నాను. ఐతే అంతా పాతపేరే వాడతారు.

భూష : పోనీండి. నేనుమాత్రం మీ యిష్టపూర్వకంగానే అంటాను. అసలు విషయం- మీ అబ్బాయికి నా రెండోఅమ్మాయిని యివ్వాలనీ—

రఘు : అనుకున్నాను, మీ రా విషయంలోనే వొచ్చారని. కాని వాడియిష్టం. అన్ని విషయాల్లోనూ వాడికే పెత్తనం ఇచ్చేశాను. వాడిష్టం వొచ్చిన అమ్మాయిని చేసుకోటానికి నా అభ్యంతరం ఏమీలేదు.

భూష : ఇప్పు డాయన ఇక్కడలేరా?

రఘు : వా డెప్పుడూ ఇక్కడవుండడు. నేనే వుండనివ్వను, వాడిపని దేశాలుతిరగటమే!

భూష : ఆయన చాలా చదువుకున్నాడని కూడా విన్నాను.

రఘు : ఆ చదువుల్లో నాకు నమ్మకం లేదు. అంచేత వాడేమీ చదువుకోలేదనే అంటాను. ఐతే, మీకు డిగ్రీలే ప్రధానం అంటారా - వాడి పేరువెనుక యం. యస్‌సి. వుంది. డిగ్రీ వున్నంతమాత్రాన వాడు జ్ఞానవంతుడు కాడు. ఒకనాడుకూడా వాడు 'షా' పుస్తకం ముట్టుకోలేదు—నేను చెప్పి చెప్పి విసిగాను.

[గుమస్తా లోపలకు వెళ్లాడు]

భూప : ఐతే ప్రస్తుతం ఆయన ఎక్కడుంటారు?

రఘు : సరిగ్గా తెలీదు. బహుశా...ఆఁ—ఆమధ్య అమెరికా వెళ్లొచ్చాడు-ఈమధ్య ఇంగ్లండు వెళ్లొచ్చాడు. వొచ్చినతర్వాత నాకు కొన్ని 'నిమిషాలు' మాత్రమే కనుపించాడు. ఎక్కడున్నాడో గుమస్తాగారికి తెలియొచ్చు. (గట్టిగా) హనుమాన్లుగారూ!

హను : (ఆత్రుతగా వచ్చి) చిత్తం—

రఘు : అబ్బాయి వుత్తరాలు రాస్తున్నాడా?

హను : చిత్తం - వారం రోజుల క్రిందట ఒకటి వొచ్చిందండి. అదీ, రాజ్యంగారికి రెండు ముక్కలు రాశారు. ఆయన అప్పటికి పోల్యాండ్‌లో వున్నారు.

రఘు : ఐతే, ఈపాటికి అక్కడ వుండడు. ఆఁ— ఈమధ్య ఎవరెస్టు శిఖరం ఎక్కాలని వెళ్ళ నట్టున్నాడు. ఏమయినా - కొంకాలంలో వాణ్ని కనుక్కోవొచ్చు.

భూప : మీ అబ్బాయికి వయస్సు ఎంత వుంటుంది?

రఘు : పాతిక దాటాయి - ముప్ఫయ్ యింకా రాలేదు.

హను : చిత్తం - ఇరవై ఎనిమిదండీ.

రఘు : అదిగో!...వాడిమొహం అచ్చంగా ఆంద్రో క్లిస్ మొహంలాగా వుంటుంది!

భూప : ఆయ నేకనూ మీ పెద్దబ్బాయి?

రఘు : వాడే. తర్వాత నో అమ్మాయి. అది క్వీన్ మేరీస్‌లో చదివి, ఈమధ్యే వచ్చింది. దానికీ పెళ్ళి కాలేదు. దానిష్టం - ఎప్పుడు చేసుకున్నా - ఎవర్ని చేసుకున్నా నా అభ్యంతరం ఏమీ లేదు.

భూప : ఆమె కూడా ఇక్కడ లేదా యిప్పుడు?

రఘు : ఇంట్లో లేదు. ఇప్పుడు దాని పెళ్ళిగొడవల్లోనే వున్నాను.

భూప : ఆహాఁ—

రఘు : ఆఁ - "పెళ్ళి చేసుకోవాలనుంది. ఎవర్ని చేసుకోమంటారు?" అని అడిగింది ఈమధ్య. 'నీ యిష్టం' అన్నాను. 'కాదు మీరే చెప్పా' లంది. ఐతే దాని తల్లి చచ్చిపోతున్నప్పుడు కూడా తన తమ్ముడికే 'మన అమ్మాయిని ఇవ్వండి-' అంటూ వెళ్ళిపోయింది.

భూప : ఆహాఁ-ఎన్నాళ్లయింది పోయి?

రఘు : చాలాకాలం ఐంది. ముప్ఫయ్ నొకటిలో కాబోలు. బెర్నార్డ్ షా 'టూ ట్రూ టు బి గుడ్' రాస్తున్న రోజుల్లోనే అనుకుంటాను.

భూప : మరి షాను మీరెందుకు చూడలేకపోయారు?

రఘు : చెప్పానుగా అదృష్టం వుండాలనీ. ఎప్పటి కప్పుడు వెళదామనే అనుకునేవాణ్ణి. ఒంట్లో ఏదో జబ్బు. సరి—తర్వాత తర్వాత శక్తి మరీ సన్నగిల్లిపోయింది - ఆయనా పోయినాడు!

భూప : 50 లో కాబోలు ఆయన పోయాడు?

రఘు : (తపీమని కూచుని) అరే. ఆ తేదీనే నాకు గుర్తు లేదూ? నవంబరు రెండు, పందొమ్మిదివందల యాభయ్. అవాళ లక్ష్మివారం. చనిపోయే నాటికి ఆయనకు 95 ఏళ్లు దాటిపోయినయ్. మ్చ్...మహానుభావుడు. అన్నేళ్లు ఆయన భూమ్మీద వున్నా - నేను చూడలేకపోయానంటే - అదంతా నా దురదృష్టం!

భూప : ఊఁ—ఐతే అమ్మాయికి సంబంధం వుందన్న మాట!

రఘు : ఉండనే వుందిగా మరి! కాని మా రాజ్యానికి ఆ కుర్రాడొద్దుట—

భూప : సరిపోయింది.

రఘు : అందుకు నేనేమీ బలవంతం చెయ్యలేదు లెండి. 'నీ యిష్టం' అన్నాను. "నా యిష్టం కాదు. మీరే చెప్పండంది—చెప్పమందని వాళ్ళమ్మ మాట చెప్పి—ఆమెమీద గౌరవం చూపితే బావుం

టుందని సలహా ఇచ్చాను. 'వాడొద్దంది. 'ఐతే ఏం చెయ్యమంటావ్?' అ నడిగాను. తనకు వెంటనే పెళ్ళి జరిగిపోవాలట— గొప్పకోసం కాదుగాని—ఆమె చాలా అందంగా వుంటుంది.

వాసు : (కాయితాలు చూసుకుంటూ అవి మడత పెడుతూ తపీమని) చిత్తం—చాలా తెలివయినవారండీ!

రఘు : అదీ నిజమే! అంచేత తనకు పెళ్ళనీ పెళ్ళి కొడుకులు కావాలనీ పేపర్లలో వేయించ మన్నది. వేయించాను. చాలా దరఖాస్తు లొచ్చిపడ్డాయి. కొన్నిటిని అమ్మాయి ఎంచి, వాళ్ళను స్వయంగా ఇంటికి పిలవ మంది. సరే—గుమస్తాగారు ఈరోజునే ఫలానాగంటకు—అంటే ఇదేవేళ—రమ్మని రాశాడు. ఈపాటికి వొచ్చేవుంటారు. మీ రొచ్చారనగానే అమ్మాయికోసమే కాబోలు అనుకున్నాను.

భూష : (నవ్వాడు)

[వీధివేపునుంచి నౌకరు ప్రవేశం]

నౌక : సార్—ఎవరెవరో వొచ్చారు సార్—

రఘు : ఎవరో కనుక్కున్నావా?

నౌక : తమరు పిలిపించారుట—

వాసు : పేర్లు కనుక్కోలేకపోయావు?

రఘు : పోన్లెండి.

వాసు : చిత్తం—

రఘు : (నౌకరుతో) సరే—వొకాయన్ను రమ్మను. (నౌకరు వెళ్ళాడు.)

భూష : అమ్మాయిలేనప్పుడు వీళ్ళుమాత్రం వొచ్చి ఏం ప్రయోజనం?

రఘు : మొదట నన్ను చూడమంది. వొచ్చినవాళ్ళను అన్నీ అడిగి—నాకు నచ్చినవాళ్ళను కూచో పెట్టమంది. తనొచ్చి ఆఖరుకు ఎంచుకుంటుం దిట!

భూష : బావుంది. (లేచి) మరి నేను వెళ్లొస్తాను.

వాసు : చిత్తం—అబ్బాయిగారితో ఆ విషయం రానీ కనుక్కుంటాను బాబూ!

భూష : సరే లెండి! (రఘునాథంగారితో) నమస్కారం!

రఘు : (నమస్కరించాడు)

[భూషణం వెళ్లిపోతూవుంటే నిటారుగా సన్నగానున్న వో యువకుడు ప్రవేశించాడు. భూషణం. అతన్ని చూస్తూ వెళ్ళిపోయాడు. ఆ యువకుడికి కాములు లేని కళ్ళజోడూ, మెలికలు తిరిగిన క్రాఫింగూ వున్నయ్. సిల్కుచొక్కా, తెల్లగావున్న పల్చని పంచ కట్టుకున్నాడు]

యువ (వొస్తూ,) నమస్కారం—

రఘు రండి—

యువ మేష్టారూ! రాజ్యలక్ష్మి తండ్రిగారు మీరే కదూ?

రఘు : ఆఁ!

యువ నన్ను రమ్మన్నారు — పెళ్ళివిషయం...

రఘు ఆఁ అవునవును. మీ పేరు ఏమిటన్నారు?

యువ నా పేరు రాజేశ్వర్. (కూచుంటూ) ఇప్పుడీ సినిమాల్లో హీరో వేషాలూ అవీ వేస్తూ వుంటాడు చూశారూ—

రఘు : నేను చూడలేదులెండి. నేనీ సినిమాలు చూడను. పాకథలు గలవి ఈవూరు ఎప్పుడో వొస్తాయి. ఆఁ—ఐతే?

రాజే : అహఁ...ఆయన మా పెద్దబావగారి పెద్ద నాన్నకూ—.

రఘు : సరే—

రాజే : అంటే నాకు వరసకు—వూఁ—(ఆలోచిస్తున్నాడు)

రఘు : ప్చ్—ఆయన సంగతెందుకు! మీ సంగతేదో చెప్పండి.

రాజే : ఆఁ—నేను బి.ఏ., పాసయ్యాను. ఉద్యోగం బాధ నాకు లేదు — కావల్సినంత డబ్బుంది కాబట్టి. ఐనా 'పురుషలక్షణం' అన్నారని ఏదో చేస్తున్నాను.

రఘు : వూఁహుఁ—ఎందులో?

రాజే : అంటే ఆమస్య చేశానులెండి — వో పత్రిక్కు కరస్పాండెంటుగా—

రఘు : ఇప్పుడు?

రాజే : మా కేశాను మేష్టారూ! అంతా చికాకు! ఏనా నాకు వుద్యోగంతో నిమిత్తంలేదుగా!

రఘు : అవును! మీకు కథలూ నాటకాలూ యిష్ట మేనా?

రాజే : చంపేశారు. అవంటే చచ్చిపోతాను.

రఘు : ఎవరు మీ అభిమానులు?

రాజే : ఇంగ్లీషులో షెల్లీ, కీట్సూ — తెలుగులో చలం......

రఘు : ఇంగ్లీషులో అంతే?

రాజే : అంటే ఫ్రాయిడ్‌వీ ఎల్లిస్‌వీ వ్యాసాలు కూడా......

రఘు : సెక్స్‌గోల. వూఁ—(వేల్తో షా పటం చూపిస్తూ) ఈయనెవరో తెలుసునా?

రాజే : (వో క్షణంచూసి) 'బెర్నార్డ్‌షా' అనుకుంటాను.

రఘు : అనుకుంటానూ? (ఛటుక్కున కూచుంటూ) అయ్యో—ఆయనే అది. అది తెలీదూ?

రాజే : ఎప్పుడో చిన్నప్పుడు చూశాను బొమ్మ.

రఘు : ఐతే మీకు షా పుస్తకాలే తెలియవన్నమాట!

రాజే : పుస్తకాలు తెలియకేం? ఆయన బొమ్మను సరిగ్గా చూడలేదు.

రఘు : మా యింటికొస్తే ఏనాడో చూసివుండే వారు—

రాజే : ఇహమీదట రోజూ చూడొచ్చులెండి.

రఘు : (వినిపించుకోకుండా) ఆ విగ్రహం — ఆయనా — ఆ మొహంలో తేజం......

రాజే : షా రాసిన కొన్ని పుస్తకాలు చదివాను కాని మేష్టారూ—అంత జాగ్రత్తగా చదవలేదు.

రఘు : నా దగ్గిరున్నయ్-తీసుకెళ్లి చదవండి.

రాజే : అట్లాగేలెండి. ఆఁ—మరి రాజ్యలక్ష్మి విషయం....

రఘు : అదే అదే-అమ్మాయి లేదు-మీరు ఆ గదిలో కూచోండి-వొస్తుంది.

రాజే : అంటే?

రఘు : అంటే-ఆమెకు కావలసిన వరుడొక్కడేగా- మీ వంటివాళ్లింకా కొందరున్నారు. మీ అందర్నీ వోసారిచూసి ఎవర్నో ఏరుకుంటుంది!

రాజే : అందుకా అవతలవాళ్లున్నారు!

రఘు : అమ్మాయితో మీకేమన్నా పరిచయం వుందా?

రాజే : అంత అదృష్టం ఎక్కడ మేష్టారూ? మొట్ట మొదట మహిళామండలిలో ఆమె ఒకనాడు ఉపన్యాసం యిస్తూవుంటే విన్నాను— విని నీరయిపోయాను. ఆమె వాక్చాతుర్యం, అంతకుమించిన ఆమె సౌందర్యం చూసి, చకితుణ్ణయిపోయాను. ఆ నా టి నుం చీ 'ఆమె'ను పెళ్లి చేసుకోవాలనే తలంపులోనే వున్నాను.

రఘు : తర్వాత మళ్లీ మీరు చూడలేదా ఆమెను?

రాజే : చూశాను. ఓసారి ఓ యువకుడితో వెళ్తూ వుంటే చూసి ఆశ్చర్యపోయాను—ఆమెకు కొంపతీసి పెళ్లయిపోయిందేమోనని. కాని లేదని తర్వాత ఎవరో చెప్పారు.

రఘు : (ఛటాలున కూచుని) షాకు పెళ్లెప్పుడయిందో తెలుసా?

రాజే : అబ్బే తెలీదండీ.

రఘు : ఆఁ?-1898లో. (వెనక్కువాలుతూ) ఐతే ఏమంటారూ?

రాజే : ఏమిటంటాను? మీ అమ్మాయిని వివాహం చేసుకోవాలని తహతహ లా డు తు న్నా నంటాను.

రఘు : సరే ఐతే, ఇట్లా లోపలికిపోయి కూచోండి. గుమస్తాగారూ! ఈయన్ను లోపలకు తీసుకెళ్లండి?

హను : చిత్తం—

[హనుమాన్లు వెనకాలే, రాజేశ్వర్ లోపలకు వెళ్లాడు.]

రఘు : ఒరేయ్!

నౌకరు : (వీథివేపునుంచి వొచ్చి) సార్!

రఘు : ఇంకా వున్నారుకదూ అక్కడ?

నౌకరు : వున్నారండీ.

రఘు : ఇంకొర్ని రమ్మను.

నౌకరు : (వెళ్లాడు.)

[వెళ్లిన కొన్ని క్షణాల్లో ఇంకో ఆయన ప్రవేశించాడు. ఆయన సన్నగా పొడుగ్గా వున్నాడు. మనిషి నలుపు. ముప్ఫయ్యేళ్లు దాటిపోయాయి. పంచె, సాధారణమైన చొక్కా వేసుకున్నాడు. త్వరత్వరగా వచ్చి కూచున్నాడు.]

రఘు : (ఓ క్షణం తెల్లబోయి అతనికేసి చూసి) మీరు... పెళ్ళి విషయమయి వొచ్చారా?

ఆయన : అవునండి. (లేచి నిలబడి) నా పేరు మొట్ట మొదట (గట్టిగా) అంటే—చిన్నప్పుడు మా యింట్లో...

రఘు : కూచోండి, కూచోండి.

ఆయన : ఫరవా లేదులెండి. నిలబడి చెబితే 'ఫోర్స్' వొస్తుంది. మా యింట్లో చిన్నప్పుడు నన్ను 'గోపూ' అని; 'గోపీ' అనీ పిలిచేవారు. పేరు గోపాలరావు. తర్వాత 'గోపాల్' అయ్యాను. ఇప్పుడు 'గోపాలోవ్.'

రఘు : అదేమిటి?

గోపా : అంతే! ప్రపంచంలోవున్న ఇన్ని దేశాల్లోనూ నా అభిమాన దేశం రష్యా. నా అభిమాన వ్యక్తులు-లెనిన్, మార్క్స్! వీళ్ళు నాకు పూజ్యులు కూడా! (కూచున్నాడు).

రఘు : మీరు కమ్యూనిస్టు-(అని మాశాడు).

గోపా : అవును. ఐనంత మాత్రాన ఇతర పార్టీలమీదా వ్యక్తులమీదా నాకు ఏహ్యభావమూ, ద్వేషమూ లేవు. (పా పటాన్ని చూసి) ఆ ప్లేస్‌లో, ఇదే నా యిల్లయితే-అక్కడ ఆ పటాన్ని తీసేసి-

రఘు : అమర్యాదగా మాట్లాడకండి. ఐతే మీరు మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలను కుంటున్నారు?

గోపా : నిస్సంశయంగా అనుకుంటున్నాను. అమ్మాయి అందచందాల్నీ తెలివితేటల్నీ చూసి నేను ప్రేమించలేదు. ఆమెకున్న ధనాన్ని చూసి ప్రేమించాను.

రఘు : ఏమిటి?

గోపా : అవును. పెళ్ళయిన తర్వాత ఆ ధనాన్ని బీదవాళ్లకూ, ప్రపంచానికీ పంచేస్తాను. అం-గుర్తుందా? 'కామ్రేడ్ గోపాలోవ్' నా పేరు!

రఘు : ఉంది లెండి. ఐతే ఇంతవరకూ మీకు పెళ్లే కాలేదూ?

గోపా : కాలేదు. ఎంచాతంటారా—డబ్బున్న అమ్మాయిని చేసుకోవాలనే నా అభిలాష. ఇంత వరకూ అటువంటి అమ్మాయి ఎక్కడా దొరక లేదు. ఈ అమ్మాయిమీద ఏనాడో నా కన్ను పడ్డది. అవకాశం ఇవాళొచ్చింది.

రఘు : సరే-అమ్మాయి వొస్తుంది. ఆ గదిలో కూచోండి.

గోపా : థేంక్స్!

రఘు : ఆమెవొచ్చి అడిగితే మీ వుద్దేశాలు చెప్పండి.

గోపా : (లేచి) ఊరికే చెప్పటమా? ఉపన్యాసాలు దంచుతాను. నా జీవితంలో ఎక్కువ భాగం ఉపన్యాసాలు ఇవ్వటంలో నెగడిసాను. నేను లేచి నిలబడి 'కామ్రేడ్స్' అన్నానంటే— హైడ్రోజన్ బాంబ్ పేలినట్టు - యావత్తు భూప్రపంచమూ గడగడలాడుతుంది! (చెయ్యెత్తి) 'కామ్రేడ్ గోపాలోవ్' అంటే..

రఘు : అవునవును. (గోపలకు చూపిస్తూ) అట్లా కూచోండి. గుమాస్తాగారూ (గుమాస్తా వచ్చాడు). ఈయన్ను కూర్చోపెట్టిరండి. (గుమాస్తా గోపాలోవ్ వెళ్ళారు. గుమాస్తా తిరిగొచ్చాడు).

రఘు : ఈయన మాశాం-కమ్యూనిస్టట.

హాను : వింటున్నాను.

రఘు : కూచోండి.

హాను : (కూచుంటూ) నేతిబీరకాయలో నెయ్యి ఎంత వుందో కమ్యూనిజంలో నిజం కూడా అంతే వుందంటారు! ఈయన్ను అమ్మాయి వరిస్తుందటారా?

రఘు : ఏమో చెప్పలేం. దానిష్టం. ఎవడిని తను తెచ్చుకున్నా అల్లుడుగా స్వీకరించటానికి నాకేమీ అభ్యంతరం లేదుకదా-ఇవాళ వచ్చిన

వాళ్ళల్లో ఎవర్నో ఒకర్ని చేసేసుకుంటుందిట మరి-ఒక డొచ్చినా వాణ్నే చేసుకుంటా నన్నది.

భాను : (నిట్టూర్చి) ఏమిటో-నిక్షేపంలాంటి కుర్రాడు మీ బావగారు. ఈడూ జోడూ చదువూ ధనమూ అన్నిట్లోనూ ఇద్దరూ సరిపోతారు. అమ్మగారుకూడా పోతూపోతూ తనతమ్ముణ్ణే చేసుకోమంది. చేసుకుంటే ఆమె ఆత్మకు శాంతి వుండిపోను.

రఘు : అమ్మాయి కిష్టంలేదు పోనీండి. వాడంటే దీనికెందుకో అంత అయిష్టం!

భాను : అంతా ఏదో...(అనబోయి ఆగిపోయాడు)

రఘు : చూడండీ. ఇంకెవరున్నారో చూసి-ఇంకో ఆయన్ను రమ్మనండి.

[గుమాస్తా వెళ్ళాడు. వెళ్ళిన కొన్ని క్షణాల్లో తెల్లగా 'పాలిపోయిన దేహంగల వ్యక్తి ప్రవేశించాడు. వొదులుగా పొట్టిగావున్న పైజమా. చొక్కా భుజంమీద చిరుగు. జుట్టంతా రేగి వుంది. చేతిలో పుస్తకాలు)

ఆయన : (వొస్తూ) వందనసహస్రాలతో...

రఘు : దయచేయండి.

ఆయన : (కూమని షా పటంకేసీ, ఆయనకేసీ చూసి) ఆ పటం మీదా-లేక మీరు 'షా'నా-లేక నా కళ్ళముందు పల్చటి గాజు తెరలు వాలాయా?

రఘు : అదేమీ కాదు. ఆయన 'షా'నే-నేను నేనే. ఆయనకూ నాకూ పోలికలుండొచ్చు మీ పేరు...

ఆయన : వస్తున్నాను. నన్ను 'రుధిరశ్రీ' అంటే పలుకుతాను.

రఘు : అదేమిటి?

రుధి : ఏముంది? ఏమీలేదు. తల్లిదండ్రులు చిన్నప్పుడు ఏ ముహూర్తంలోనో - దుర్ముహూర్తంలో-నాకు నామకరణం చేసివుంటారు-నన్నడక్కుండా. నేను స్వతంత్రుణ్ణయ్యాక అది చెరిపి, అక్కడ 'రుధిరశ్రీ' అనే నాలుగు అక్షరాలు రక్తంలో చెక్కినట్టు ప్రతిష్ఠచేశాను. తమ నామధేయం రఘునాథం అని విన్నాను.

రఘు : (కాదన్నట్టు తలూపి) రఘునాథ్ "షా!"

రుధి : భేష్! ఈ నాటికి మీవంటి మానవుణ్ణి చూపినందుకు దేవుడికీ, చూసినందుకు మీకూ నా కృతజ్ఞతలు. స్వోత్కర్ష పనికిరాదంటారు. ఐనా కవుల విషయంలో పరవాలేదన్నారు మావాళ్లు. షా అన్నాట్ట—"తనను గురించి పొగుడుకునే శక్తి తనకే వుంటున్నప్పుడు ఇంకోడు ఎందుకు పొగడాలి" అని.

రఘు : అవునవును!

రుధి : అంచేత ఆ శక్తి నాకుందిగా, మహాకవులంతా వాళ్ళ గొప్పతనాన్ని వాళ్లే వర్ణించుకున్నారు. పెద్దన్నగారు రాయలవారితో ఏమన్నాడు? "పెద్దనబోలు పండితులు...
[రాగవరసన చదవబోతాడు.]

రఘు : సరేలెండి - మీరు కవులని బోధపడ్డది.

రుధి : తెలివయినవాళ్లు కాబట్టి మీరు ఇట్టేగ్రహించగలిగారు. కవినే కాదు. సర్రియలిస్టును. అభ్యుదయంకోసం అటమటించి - ఆయురారోగ్యాలు అర్పించే అధివాస్తవిక కారుణ్ణి. కవిని! పత్రికల్లో రాస్తాను. ఈ మధ్యనే "చెత్తా - చీపురూ" అనే నాటకం రచించాను. దాన్ని ప్రదర్శించటానికి ఏర్పాట్లుకూడా చేస్తున్నాను. నన్ను చూసి చాలామంది పిచ్చివాడనీ, వెర్రివెధవనీ అన్నారు. నేను లక్ష్యపెట్టను లెండి. ఏనుగు నడుస్తున్నప్పుడు కుక్కలు మొరగటం సహజం!

రఘు : (అవన్నీ ఎందుకన్నట్టు మొహంపెట్టి) మీరు షా నాటకాలు చదివారా?

రుధి కొన్ని చదివాను.

రఘు ఏవి?

రుధి గుర్తులేదు.

రఘు పోనీ వాటిల్లో మీకు నచ్చిందేదో చెప్పగలరా!

రుధి వూఁ..."సీజర్ అండ్ క్లియోపాట్రా-"

రఘు : అందులో మీకు నచ్చిన పాత్ర ఏది?

రుధి : అదంతా తెలీదుసుమండీ! షాకు నేను సముకొలికున్నీ కాను. ఆయన పోయిన తర్వాత నేను కవిని కావలిసొచ్చింది!

రఘు : బావుంది. పోనీండి- 'ఆండ్రోక్లిస్ అండ్ ది లయన్; చదివారా?

రుధి : సినిమా చూశాను.

రఘు : సరే. అందులో ఏ పాత్ర బావుందంటారు?

రుధి : సింహం.

రఘు : మరి ఆండ్రోక్లిస్‌ను ఎవరికిస్తారు?

రుధి : వాడికంటె గొప్ప దా సింహం-

రఘు : మీకు తెలిసిన షా నాటకాల పేర్లు కొన్ని చెప్పండి.

రుధి ఇట్లా పరీక్ష చేస్తారని ముందే తెలిస్తే బట్టీయమన్నా వేసుకొచ్చేవాణ్ణి. పెళ్లిచూపుల కనుకున్నానుగాని, ఎగ్జామినేషన్ హాలుకు అనుకోలేదు. ఐతే ఒకటి తెలిసింది. పెళ్ళి అన్నా పరీక్షే—'అగ్నిపరీక్ష'! ఐనా మీకు సమాధానాలు ఇస్తాను కాని ఓ విషయం అడుగుతాను చెబుతారా?

రఘు : అడగండి.

రుధి : మరేమీ అనుకోరుగదా—

రఘు : అబ్బే—అడగండి.

రుధి : ఏమీ లేదు. ఇదివరకు ఎక్కడన్నా మీరు స్కూలుమేస్టరీ ఉద్యోగం చేశారా?

రఘు : భలేవారే!—మామూలుగా మీ శక్తి చూస్తున్నాను. అంతే!

రుధి : సరే. ఐతే ఇందాక అడిగిన ఆ యక్ష ప్రశ్నేమిటి?

రఘు : యక్ష ప్రశ్న నేనేమీ అడగలేదే!

రుధి : మామూలు ప్రశ్నేనా?

రఘు : ఆఁ- షా రాసిన రెండు మూడు పుస్తకాల పేర్లు చెప్పమన్నాను.

రుధి : మీరు కొనుక్కునేందుకా?

రఘు : సరిపోయిందయ్యా-లక్ష పుస్తకాలున్నాయ్. నీ శక్తి యింతేనని తేలిపోయింది.

రుధి : చెబుతున్నాను. 'మాన్ అండ్ సూపర్‌మాన్', 'పిగ్‌మాలియన్' వూఁ...

రఘు : 'విడోయర్స్ హౌసెస్,'

రుధి : అవును.

రఘు : అదే అతని మొదటి నాటకం అనుకుంటాను. ఆఁ—అతని మొదటి నవల చెప్పూ.

రుధి : చెప్పలేను.

రఘు : 'ఇమ్మెచ్యూరిటీ'. సరే—నువ్వు షాను 'స్టడీ' చెయ్యలేదు. నేను కొలెడంత చేశాను. ఐనా నాకే కొన్ని కొన్ని విషయాలు తెలీవు. సరేలే-నీ పేరు...?-అన్నట్టు ఏదో చెప్పావు. నీ వుద్యోగం?

రుధి : కవిత! పద్యాలూ గేయాలూ రాయటం ప్రచురించటం.

రఘు : వాటివల్ల వొచ్చే ఆదాయం నీకు సరిపోతుందా?

రుధి : ఏమాత్రమూ చాలదని—నా స్వరూపాన్ని బట్టీ-నా చొక్కాను బట్టీ మీరు తెలుసుకోవొచ్చు. ఐనా నేను బ్రతకటానికి కాదు కవిత రాయటం. బ్రతికివున్నాను కాబట్టి!

రఘు : మరి నీకు పెళ్ళి అనవసరం కాదూ?

రుధి : పెళ్ళి అనవసరం అంటారేమిటి? జీవిత గ్రంథంలోని మధురాతి మధురాధ్యాయం అక్కడే వుందంటారు. నేను పెళ్ళి ఏనాడో చేసుకునివుందును. కాని నన్ను నేనే పోషించుకునే శక్తిలో లేను. ఆమెనుకూడా ఎక్కడ అని మానేశాను. రాజ్యలక్ష్మివంటి గొప్పయింటి పిల్లయితే పరవాలేదు చూడండి- ఇద్దరమూ హాయిగా వుండొచ్చు! అందులోను మీ రాజ్యలక్ష్మిని ఆమధ్య ప్రేమించాను కూడా. ఆ రోజుల్లోనే వో చిన్న గేయం అల్లాను. (తీసి చదువుతూ)

రాజ్యంనా
సామ్రాజ్యం
ఈ అగ్నికి
నివ్వే ఆజ్యం
నాకెంతో పూజ్యం...

రఘు : బావుంది బావుంది. ఐతే యిప్పుడు ప్రేమించటం మానేశావా ఏమిటి?

రుధి : ఇంచుమించు నిన్నటిదాకా మానేశాను.

మీరు రమ్మన్నారు చూడండీ—ఆక్షణం నుంచీ మళ్ళీ మొదలెట్టాను.

రఘు అంతా నీయిష్టమల్లేనే వుంది.

రుధి నేను ప్రేమించుకోటానికి ఆమె యిష్టంతో పనేమిటి?

రఘు అవున్లే. (గుమస్తా వొచ్చాడు. ఆయనతో) ఈయన్ని కూడా కూచోమనండి.

రుధి ఎక్కడ?

రఘు ఆ గదిలో కూచోండి, అమ్మాయి వొస్తుంది.

రుధి ఐతే చక్కటి కొన్ని గేయాలు తయారు చేసి వుంచుకుంటాను. (గుమస్తా వెనకాలే రుధిర(శ్రీ) వెళ్లాడు. గుమస్తా తిరిగొచ్చాడు)

హను : చిత్తం — ఇంకొక్కడే వున్నట్టున్నాడు. పిలవమంటారా?

రఘు : ఆఁ—ఇవాళ ఇదోగోల వచ్చిపడ్డది. పిలవండి.

[గుమస్తా వెళ్తున్నాడు]

రఘు : అమ్మా యింకా రాలేదండీ?

హను : (ఆగి వెనక్కు తిరిగి) చిత్తం—ఈపాటి కొస్తూవుండాలి; చాలాసేపయింది వెళ్ళి. (వెళ్లాడు)

[లావుగా పొడుగ్గా వున్న వ్యక్తి ప్రవేశం. పాంటు, బుష్‌కోటు, బూటు వేసుకున్నాడు. నెత్తిన 'ఈవినింగ్ హాట్' వుంది. సన్నగా పొడుగ్గా మీసం. చేతిరుమాలుతో మొహం తుడుచుకుంటూ]

వ్యక్తి : 'గుడ్ డే సర్'

రఘు : సరే కూచోండి.

వ్యక్తి : (కూచుని) రాజ్యలక్ష్మి 'ఫాదర్' కదూ మీరు?

రఘు : (ఔనన్నట్టు తలవూపాడు)

వ్యక్తి : మిమ్మల్ని వోసారి ఎక్కడో చూశాను. బహుశా మీ తోటలో ఓసాయంత్రం అనుకుంటాను.

రఘు : ఐవుంటుంది.

వ్యక్తి : ఆఁ—ఏదీ మీ అమ్మాయి?

రఘు : వస్తుంది, వస్తుంది. మీ పేరు...ఉద్యోగం...చరిత్రా...

వ్యక్తి : చెబుతాను. నా పేరు సుకుమార్, యం. ఏ.,

రఘు : మీరు మా పుస్తకాలు ఎప్పుడన్నా పాఠాలుగా పెట్టారా?

సుకు : ఏడిశారు. ఎప్పటిమాట! పాఠాలు ఏమేమిటున్నాయో అప్పుడే తెలిసేదికాదు—ఇప్పుడేం తెలుస్తుంది? అయినా మెదడున్నవాడికి పాఠాలతో పనేమిటి? ఆఁ నాకు చాలా డబ్బుంది. మానాన్నకు ఇద్దరు పిల్లలం. మాఅన్నయ్య బి. ఏ. చదివి, జర్నలిస్టుల్లో కలిసిపోతాననివెళ్లి—వో పత్రిక పెట్టి దివాలా తీసి ప్రస్తుతం యింటిదగ్గిరే కూచున్నాడు. వాడికి ఎప్పుడో పెళ్లయింది—ఇప్పుడిద్దరు పిల్లలు. పెద్దవాడు మూడోఫారం చదువుతున్నాడు — రెండోవాడు ఫస్టుఫారం కొళోలు. మానాన్నపోయి ఆరేళ్ళయింది. ఆయనపోవటమే వీలుగావుంది. బతికుంటే నన్ను నాయిష్టంవొచ్చినట్టు తిరగనిచ్చేవాడు కాడు—పైగా యిటువంటి పెళ్ళిళ్ళకు ఛస్తేవొప్పుకోడు. మీకుచెప్పానా—రాజ్యలక్ష్మి యింటర్‌లో నాకు క్లాస్‌మేట్. అప్పట్నుంచీ ఆమెను నేను ప్రేమిస్తూనే వున్నాను. ఆ అమ్మాయినితప్ప ఇంకొకర్ని పెళ్ళిచేసుకో దల్చుకోలేదు!

[రఘునాథ్‌షా కుర్చీలోపడుక్కొని 'పైపు' పీలుస్తూ వింటున్నాడు] ఈడూజోడూ ఎట్లా వుంటుందంటారు? బావుంటుందని చాలా మందిఅన్నారు. నిజంకూడా అంతే! నేను రాజ్యలక్ష్మి అన్నపేరు మార్చేస్తాను. 'గ్రీర్ గార్సన్'లాగా ఏదో పేరుపెడతాను. ఎట్లావుంటుంది?

రఘు : చాలా బావుంటుంది. మీరు ఉద్యోగం చేస్తున్నారా?

సుకు : ప్రస్తుతం మీ అమ్మాయిని ప్రేమించటంతప్ప ఇంకోవుద్యోగం చెయ్యటంలేదు. నాకు వుద్యోగాలకు లోటులేదులెండి. 'తాతాస్' చూశారూ. ఏనాడో నాకు జనరల్ మానేజర్ పదవి యిస్తామన్నారూ—

రఘు : అంటే మీరే వొద్దన్నట్టున్నారు.

సుకు : నా కెందుకండీ ఆవుద్యోగం?

రఘు : అవునవును. మీనాన్నగారు ఏంచేసేవారు?

సుకు : ఆఁ—ఏదో ఏడిసేవాడు. వాడు గొప్ప కోతలరాయుడులెండి. తనకు వాడెవడో ఉద్యోగం యిస్తానన్నాడనీ, వీడెవడో లక్ష పెట్టుబడిపెట్టి తనను వ్యాపారం నడిపించాలని కోరాడనీ—ఐతే తనుమాత్రం అయిష్టంగా వుండేవాణ్ణనీ కోసేవాడు. అంతకు తప్ప ఇంకేమీ ఆయన చెయ్యలేదు. డబ్బుందిగా—వాళ్ళనాన్న ఆర్జించింది. అది మింగుతూ కూచునేవాడు!

రఘు : మా రాజ్యలక్ష్మి మీకు క్లాస్‌మేట్ అన్నారు కదూ!

సుకు : అప్పుడే మరిచిపోయారా? ఆమెకు నేనూ, నాకు ఆమే క్లాస్‌మేట్సు. ఆరోజుల్లో ఆమెకున్న గ్లామర్ ఈనాడు ఈసినిమా తారలకు ఏకోశానా లేదు. అంటే ఐతే యిప్పుడు మాత్రం లేదనా?—

రఘు : వుంటుంది లెండి. మీ రాగదిలో కూచుంటారా?

సుకు : అలాగే (లేచి) అక్కడ యింకెవరన్నా వున్నారా?

రఘు : మీలాంటివాళ్ళే వున్నారు.

సుకు : ఏడిశారు (లోపలకు పోయాడు)
[రఘునాథం శ్వాసవిడిచి, బద్ధకంగా వొళ్ళు విరుచుకొని, కుర్చీలో కాళ్ళుజాచి పుస్తకం తీసి విప్పాడు. రెండు క్షణాల్లో గుమస్తా వీధి వేపునుంచి ప్రవేశించాడు]

రఘు : (అతన్ని చూసి) ఇంకా రాలేదా అమ్మాయి?

హను : లేదండీ. పొద్దున్నే వెళ్ళిపోయారు. ఎక్కడికెళ్ళారో మరి.

రఘు : సరిగ్గా ఈ వేళకు రావాలే—
[లోపల్నుంచి ఏదో గోల వినపడుతున్నది.]

రఘు : (విని) ఆ శబ్దం ఏమిటో చూడండి.

హను : చిత్తం. వాళ్ళంతా ఆ గదిలో జేరి మాట్లాడుకుంటున్నారల్లే వుంది.

రఘు : పోట్లాడుకుంటారో ఏమిటో—వాళ్ళందర్నీ యిక్కడికే రమ్మనండి.
[హనుమాన్లు 'చిత్తం' అని వెళ్ళాడు. తర్వాత రాజేశ్వర్, గోపాలోవ్ రుధిరశ్రీ, సుకుమార్ వొచ్చి కూచున్నారు.]

రుధి : (గోడమీది పటాలకేసి చూసి) ఆ రెండు పటాల్లో—అంటే 'షా' పటం తప్ప—అటున్న గాంధీ యిటున్న లింకనూ ఏమిటి చెబుతున్నారు?

సుకు : నీ మొహం చెబుతున్నారు.

రుధి : నా మొహమా? ఆ పటాలు పెట్టటంలో పెద్ద నిగూఢమయిన అంతరార్థం దాగివుంది. ఏమిటంటారా—అటున్న గాంధీ—ఇటున్న లింకనూ అంత గొప్పవాళ్ళయినప్పటికీ—ఇద్దరూ గుండుదెబ్బలవల్లే మరణించవలసొచ్చింది!

గోపా : గొప్ప పాయింట్ చెప్పావ్—(రఘునాథంతో) ఆఁ—ఇంకా రాలేదండీ మన అమ్మాయి?

రఘు : రావాలి మరి.

రుధి వొచ్చేవేళయిందా?

రఘు ఐంది.

రాజే ఇంకేమన్నా ఆలస్యం వుంటుందా?

రఘు వుండదు.

సుకు నాకు టైమైపోతూంది. ఇవాళ సాయంత్రం 'కల్చరల్ అసోసియేషన్'లో మీటింగ్ వుంది—మన అధ్యక్షతను.

గోపా : (ఆశ్చర్యంగా) మీ అధ్యక్షతనా?

సుకు : ఆఁ—ఇంకా తెలీదా మీకు?

రాజే : ఎక్కడా వినేలేదే!

సుకు : సారీ! వూరంతా మోతగావుంటే, ఇంకా మీకు తెలియదంటే మీరు ఎంత అజ్ఞానంలో వున్నారు!

రుధి : మీరుమహాజ్ఞానిలాగే మదించినట్టు మాట్లాడుతున్నారు—(రఘునాథం ఈమాట లేవీ పట్టించుకోకుండా చదువులో నిమగ్నుడయిపోయాడు)

సుకు : (లేచి) ఏమిటే! నీకూ నాకూ పోటా? నువ్వూ నీవేషం—నీ చొక్కా — నీమొహానికి రాజ్యలక్ష్మి కావాలని పరుగెత్తుకొచ్చావ్. రాజ్యలక్ష్మి! నీకేమాత్రం డబ్బుంది? ఏమాత్రం పలుకుబడి వుంది? ఎంతనీకు...

రాజే : (అపుతూ) కూచోండి మేష్టారూ—అనవసరంగా ఎందుకు!

సుకు : అనవసరం కాదండీ (కూచుని) అవసరమే! లేకపోతే ఇతనికెందుకు చెప్పండి—ప్రతివాడూ ఈరోజుల్లో కవిననటం ఏదో రెండక్షరాలు పేరు పెట్టుకొని వెనక్క్రి తగిలించుకోటం — రుధిరక్రీట—రుధిరక్రీ—నాన్సెన్స్! స్పెల్లింగ్ గాని ప్రతీ వాడికి ప్రేమే ఈరోజుల్లో!

రుధి : అదే నేనూ అంటున్నాను—ప్రేమ ఎంత చవకయిపోయింది? దానికున్న విలువ నాశనమయిపోయింది! దాని పవిత్రతంతా మట్టి కొట్టుకుపోయింది. (సుకుమార్ వేపు చెయ్యి చూపిస్తూ) అడ్డమయినవాడూ ప్రేమించటం మొదలెడుతున్నాడు!

రాజే : అందుకే నేను మానేద్దామనుకున్నాను గాని - ఎవర్నో 'వొకర్ని' ప్రేమించటంలో తప్పు లేదనుకున్నాను.

సుకు : మీకేం తెలుసునండీ ప్రేమసంగతి?

రాజే : మీకు మాత్రం ఏం తెలుసూ?

రుధి : మీకెవ్వరికీ ఏమాత్రమూ తెలీదు.

గోపా : అసలు ఎవ్వరికీ ఏమీ తెలీదు. మీరంతా కేవలం 'ఆమె'నే ప్రేమించారు. అందులో స్వార్థం లేదూ? నేను—నేనేం చేస్తాను? ఆమె ధనాన్ని పొంది లోకంలో విరజిమ్ముతాను. నా ప్రేమ నిస్వార్థం—అదంతా లోకకళ్యాణంకోసం!

సుకు : కోయ్—

గోపా : అబ్బాయ్! నువ్వు అనవసరంగా అందరితోటి పోట్లాట కోస్తునావ్—నేను కోస్తున్నానంటావా? నువ్వు కొయ్యలేదూ? ఇవాళ అక్కడెక్కడో ప్రెసిడెంట్ గిరీ వెలగబెడతానన లేదూ—ఇది ఎలాటికోత?

రుధి : చాలా లేతకోత—

సుకు : మీరంతా అజ్ఞానులు! మీతో వాకు వాదనేమిటి?

రాజే : ఏ! నోరుముయ్యండి అవతల ఆయన చదువుకుంటున్నారు (క్షణం ఆగి) కాని మేష్టారూ! నిన్ననో జ్యోతిష్కుడు చెప్పాడు—'రేపు నీకు కావల్సిన భార్య దొరుకుతుంద'ని.

గోపా : అసంభవం ! నే నొకణ్ణి ఇక్కడున్నప్పుడు అట్లా ఎవ్వడూ అనడు.

సుకు : రాజ్యలక్ష్మిని నేను ఏనాటినుంచో 'లవ్' చేస్తున్నాను. కాబట్టి ఆమె నాది.

రుధి : 'నీది' ఏమిటయ్యా నీ మొహం—నీది కాదు నాది !

గోపా : ఛప్. నీది కాదు—నాది !

సుకు : (గట్టిగా) నాది!

రాజే : యిస్స్...నా జోస్యం నిజం మేష్టారూ. మీ ఎవ్వరిదీ కాదు. నాది !

గోపా : జోస్యాలు నిజం అయ్యే కాలం కాదయ్యా ఇది—

సుకు : అయ్యా. టైమ్ ఐపోతోంది.

రుధి : అవునవును. మీరు మీటింగుకు అధ్యక్షుల వారు కాబోలు !

[నౌకరు ఏదో ఉత్తరం తీసుకొచ్చి రఘునాథ్‌షాకు ఇచ్చాడు. ఆయన చూసి, కుర్చీమీంచి లేచి కూచుని]

రఘు : అబ్బాయిలూ! అంతా యిది వినండి.

సుకు : ఏమిటది ?

రఘు : 'షా' తనకు ఇష్టమయిన అమ్మాయినే పెళ్ళి చేసుకున్నాడు. అ—నేను మీకు మొదటే చెప్పాను. చూశారూ—అమ్మాయి యిష్టమే ఆమె పెళ్ళివిషయంలో అని.

రుధి : అవునవును. ఆమె యిష్టమే మంచిది. ఆడవాళ్ళకు కవులంటే మహాయిష్టం !

సుకు : నాన్సెన్స్ ! చదువంటే వాళ్ళకిష్టం. అందులోనూ మనిషి చాలాగా నీటుగా వుంటే మరింత ఇష్టం.

గోపా : ఐతే ఆమె వొస్తున్నదా యిప్పుడు ?

రాజే : ఆలశ్యం చేయించకండి-ముహూర్తం దాటి పోతూంది.

రఘు : సరే. ఇది వినండి. మిమ్మల్ని కష్టపెట్టి నందుకు చాలా విచారిస్తున్నాను.

దధి : అఁ....కష్టం ఏముందిలెండి-మాకోసమేగా !

గోపా : అదేమిటి-కష్టం అంటారేమిటి ?

రఘు : మా అమ్మాయి రాసిన వుత్తరం యిది.

సుకు : ఏమని ? నన్ను చూడకుండానే చేసుకుంటా నటుందా ఏమిటి ?

రఘు : వినండి. ఆమె రాసినది చదువుతాను. (చదువుతూ) నాన్నగారికి — మీరు అంతమందినీ నా పెళ్ళి విషయమయి ఆహ్వానించి వుంటారనుకుంటాను. కాని ఎవర్నయితే మొదట్నుంచీ వొద్దంటున్నానో ఆ మామయ్యనే చేసుకోటాని కిప్పుడు నిశ్చయించుకున్నాను. సాయంత్రమే పెళ్లికి ఏర్పాటు చెయ్యండి. మనింటి కొచ్చిన పెద్దమనుషుల్ని ఏమీ అనుకోవద్దని చెప్పి ఈ ఆశాభంగం కలిగించినందుకు క్షమించమనండి.

—రాజ్యం

[ఈ వుత్తరం విని అంతా కొయ్యబారి పోయారు.]

సుకు : (కూలబడుతూ)గొప్పడిసప్పాయింట్మెంట్ ! నా జీవితంలో ఎప్పుడూ ఎరగను.

గోపా : ఇంత న్యూసెన్స్ ఎక్కడా నేను చూడలేదు.

రాజే : నన్ను ఖూనీ చేసేశారు—

దధి : క్లోరోఫారమన్నా ఇవ్వకుండా ఎందుకు చెప్పారండీ నాకీ ఘోరవార్త ? ఇహ నేను వెళ్ళి ఆత్మహత్య చేసుకుంటాను.

రఘు : అది పిరికితనం. కాని వొకటి - ఇందాకే వొకాయన వొచ్చి ఆయన కో కూతురు పెళ్ళికి వుందని అన్నాడు. అక్కడ 'ట్రై' చెయ్యండి. ఆయన పేరు భూషణంగారు-పెద్ద జమీందారు—

గోపా : ఐతే వెళ్తున్నాను-(కోపంగా పోయాడు)

దధి : నాకు మరెవరూ వొద్దు. అంతా ఘోరం-ద్రోహం-మోసం. నాకే గనక కన్నీరుంటే అదంతా ఒలకబోసేందుకు సిద్ధపడాలి !

రాజ్యం నా
ప్రేమ సామ్రాజ్యం
ఈ అగ్నికి నువ్వే ఆజ్యం
నా కింతో పూజ్యం (పోయాడు)

సుకు : (లేచి) రాజ్యలక్ష్మివంటి కూరుపిని నేనా చేసుకుంటాను ? ఛీ-రా-జ్య-లక్ష్మి-(పళ్లు పటపట కొరుకుతూ పోయాడు)

రాజే : సెలవ్ మేష్టారూ-ఆడవాళ్ళ మనస్సులు క్షణక్షణానికీ మారుతూంటాయని కవులు వూరికే అన్నారా ? హుఁ...(నిట్టూరుస్తూ నిష్క్రమణ)

రఘు : (అటూ యిటూ చూసి) గుమాస్తాగారూ-గుమస్తాగారూ—

[గుమస్తా ఆత్రుతగా ప్రవేశిస్తూ వుంటే తెర వాలిపోతుంది]

# శ్రీనాథుని రచనలో ఐతిహాసిక విశేషములు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు తాను సంచరించిన ప్రదేశములలోఁ గనులారఁ గాంచిన విశేషములను తన రచనలో సంతరించి యతికించియున్నాఁడు. ఆ విశేషము లాయా పద్యములందు పదిలపఱచిన సాభిప్రాయ విశేషణములను సావధానమతితోఁ బరికించిన వెలువడును. కొన్ని విశేషములు ఆయా స్థానిక చరిత్రములు తెలిసినఁగాని తెలియరానివి యిమిడియున్నవి. అట్టివాని నొకకొన్ని నా యెఱుకనుబట్టి తెలిపెదను. ఆయావిశేషములు శ్రీనాథుని సూక్ష్మదర్శిత్వమును, అతనికిఁగల చారిత్రక సత్య ప్రకటనదృష్టిని మనకెఱుకపఱచును.

అగస్త్యుఁడు వ్యాసునకు భీమమండలిలోని ప్రసిద్ధ క్షేత్రములను నిర్దేశించి చూపించెడి ప్రకరణమిది—

సీ. అదె పట్టిసస్థానమందుండు వీరభ
  ద్రేశ్వరస్వామి యర్ధేందు మౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
  నిలువేల్పు ముక్కంటి వెలసెఁ బ్రోల్లి
యదె కుమారారామ మా హర్మ్యరేఖయు
  చాళుక్య భీమేశు సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
  హుంకారిణీదేవి యోలగంబు
వాఁడె మాయింటివేల్పు పల్వలపురమునఁ
  గొప్పలింగంబు ఫణిరాజకుండలుండు
సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు వాఁడె
  కుండలాముఖ మదె మానికులవరేణ్య!
    —భీమ. ౩. ౫౫.

ఈ పద్యమునందు పేర్కొనినవన్నియు భీమమండలిలో శ్రీనాథునినాఁడు ప్రసిద్ధమయిన పుణ్యక్షేత్రములు. ఈ ప్రదేశములన్నియు నీశ్వరార్చనకళాశీలుండగు శ్రీనాథున కభీష్టమైన శివమూర్తులతో నిండియున్నవి. భీమమండలేతిహాసములో నివియన్నియుఁ బ్రసిద్ధికెక్కిన శైవక్షేత్రములు. శ్రీనాథునకు వెనుక ముందు లాంధ్రదేశమును బరిపాలించిన ప్రభువు లెందఱో యీ స్థలములందలి శివమూర్తులకు దివ్యవైభవములు కొనసాగుటకై యెన్నియో దానధర్మములు సెలపి యున్నారు. వీనిలో మొదటిది పట్టిసము—

1. పట్టిసస్థానము-అనఁగా నీనాఁడు రాజమహేంద్రవరమున కాఱుక్రోసులు మీఁదుగా గోదావరీనదీ మధ్యమున, చిన్నకొండమీఁద భద్రకాళీసహితుఁడైన వీరభద్రేశ్వరుఁడు సెలకొనిన క్షేత్రము. పట్టిసమనఁగా యుద్ధసాధనమైన పెద్దకత్తి. అది కడిగినచోటదిగావున దానికి 'పట్టిసము' అను పేరు సెలవుకొనినది. దక్షాధ్వర ధ్వంసముచేయుటకై యవతరించిన వీరభద్రుఁడు, దక్షారామమున జరిగిన దక్షయజ్ఞమున కుపస్థితులైన దేవతలను పట్టిసముతో నరుకుచు వచ్చి, గోదావరీమధ్యస్థమైన యీ పర్వతమునంటి వెనుదిరిగి, గౌతమీనదిలో నాఖడ్గమును గడిగినాఁడు. తన్మూలముగ నా ప్రదేశమునకు 'పట్టిసము' అను పేరేర్పడినది. ఈవిషయమును శ్రీనాథుఁడు కాశీఖండమునం దిట్లు వివరించి యున్నాఁడు:

గీ. దక్షిణానంద విపినమధ్యంబునందుఁ
  గ్రతు విధి ధ్వంసవేళ దేవతలనతికి
  వీరభద్రేశుఁ డీ యద్రి వెన్నుదన్ని
  గౌతమీ వారిఁ దరవారిఁ గడిగినాఁడు.
    —కాశీ. ౩. ౩౦.

ఇచటి వీరభద్రేశ్వరస్వామిని 'అర్ధేందుమౌళి' యనినాఁడు శ్రీనాథుఁడు. ఇదియొక సార్థక విశేషణముగాఁ గన్పట్టుచున్నది. పట్టిసపుఁగొండపై నుండిన దేవాలయములోని వీరభద్రేశ్వరలింగ మించుమించుగ రెండడుగులయెత్తు రెండడుగుల కైవారము గలిగి యున్నది. లింగమునకు శిరోభాగమున ఎత్తయిన బొణిపి వలె శిలాఖండము ప్రత్యేకముగ నమరియున్నట్లున్నది. దానిమీఁద నీనాఁడొక వెండికిరీటము, నాగాభరణమునం దిముడునది యలంకారముగ నేర్పడియున్నది.

నాగాభరణమును బయటికిఁ దీయుటకు ముందీ కిరీటమును వెలువరింపవలయును. లింగముమీఁది యెత్తయిన ప్రత్యేకభాగ మేమని యడుగఁగా నచటి పూజరి యది జటాజూటమని తెలిపియున్నాఁడు. కాని నాకది శ్రీనాథుఁడు పేర్కొనిన అర్ధేందుచిహ్నమని తోఁచినది. మాళిఁ దాల్చినది అర్ధేందుశికలమని స్ఫురింపఁ జేయుటకుఁ గాఁబోలు, మిగిలిన నాగాభరణమంతయు లోహమయమై పచ్చనివన్నె గలిగి, కిరీటము మాత్రము మాళిదేశమునరజతమయమై నిలిచినది.

ఈ పట్టిసము శ్రీశైలాది పంచ కాశీక్షేత్రములలో నొక కాశీక్షేత్రమని ప్రసిద్ధి. శ్రీనాథుఁడు కూడ భీమమండలిలోని పుణ్యక్షేత్రములో దీనిని ప్రథమముగ గణించియున్నాఁడు. గోదావరీనది పాపి (డి) కొండలు దాఁటవచ్చిన తరువాత, ఆ నదినంటియున్న ప్రసిద్ధమయిన శైవక్షేత్రములలో నిదియే మొదటిది. ఈ వీరభద్రగిరికి శ్రీనాథుఁడు కాశీఖండమునం దొక రేఖాచిత్రమును జిత్రించియున్నాఁడు.

గీ. బ్రహ్మ సంవేద్య మాదిగాఁ బట్టి సొంత
మలివ గోదావరీనదీహారమునకు
నడుమ నాయకరత్నమై నలువుమిగులఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి.
—కాశీ. 3. 33.

గౌతమీ నదీశాఖ తూర్పుసముద్రమునఁ గలిసిన ప్రదేశమును బ్రహ్మసంవేద్యమని యందురు. అకొన మొదలుగ పట్టిసము తుదిగ గోదావరినదిని ముత్యాల హారముగఁ జిత్రించి, ఈ పట్టిస వీరభద్రగిరి నా నదీహారమునకు నడుమ నాయకమణినిగాఁ జిత్రించియున్నాఁడు. ఇది యెంతయు సహజము మనోహరమునైన కల్పన. ఈ విషయమును శ్రీనాథుఁడు కవితాదృష్టితోఁ బరికించి భావనాబలమున సృష్టించియున్నాఁడు. గోదావరీనది యీ పట్టిస వీరభద్రశిఖరి దగ్గఱనుండియే పాయలుగ నేర్పడుటకుఁ దగిన విపుల రూపమును దాల్చియున్నది. సరిగా నాకొండ రెండు పాయలకునడుమ నాయకమణివలెనే భాసించును. ఈ పద్యములో వీరభద్రశిఖరిని 'పంచలింగాశ్రయము' అనినాఁడు. దీనిభావము వ్యక్తమగుటకుఁ దగిన నిదర్శనము లేవియు నాకొండపైఁ గానవచ్చుటలేదు. వీరభద్రేశ్వరలింగము దక్క మఱియేలింగమును శ్రీనాథుని నాఁటిదా కొండపైఁ గానరాదు. కృష్ణానదీ తీరమున శ్రీశైలమెట్టిదో గోదావరీ తీరమున పట్టిసగిరి యట్టిది. ఈ రెండిటను శివరాత్రివేళ మహోత్సవములు జరుగుచుండును.

ఈ పట్టిస క్షేత్రము శ్రీశైలముతో సమానమయిన దగుట మూలముననే శ్రీశైలవాసియైన ఖోడెరాయాంక భీమేశ్వరుఁడను శైవాచార్యుఁడు, (ఈ రాజమహేంద్రవర రాజ్యపాలకులయిన అల్లాడ వేమవీరభద్రారెడ్లకు రాజ్యస్థాపనాచార్యుఁడు) శ్రీనాథుని నాఁడీ వీరభద్ర శిఖరిపైఁ దప మాచరించుచుండెడివాఁడు. ఈ విషయము శ్రీనాథునకు సమకాలికుఁడగు నిశ్శంక కొమ్మన రచించిన శివలీలావిలాసమునందలి యీ క్రిందిపద్యము తార్కాణించుచున్నది:—

మ. నిపుణత్వంబునఁ బ్రస్తుతింపవలయున్
శ్రీ వీరభద్రాచలా
గ్రపు దివ్యాతత భద్రహర్మ్యతల జా
గ్రద్వీరభద్రాఖిలే

# శ్రీనాథుని రచనలో ఐతిహాసిక విశేషములు

శ్రీ పదాంభోరుహ భక్తిసుస్థిర రమా
సంపూర్ణ భీమేశ్వరుం
త్రిపురారీంద్ర గుహూర్తి మూర్త్యద్భవునిన్
దేవేంద్ర కోలాహలున్.
—శివలీ. పీఠిక.

2. పుండరీకాద్రి—అనఁగా రాజమహేంద్రవరమునందలి పద్మాద్రి, లేక పుష్పగిరి. కమలము, పుండరీకము, పద్మము, పుష్కరము, పుష్పము అనునవి పర్యాయపదములు. రాజమహేంద్రవరమున నేఁటి గోదావరి రైల్వేస్టేషను నిలిచియున్న ప్రదేశము పుండరీకాద్రి లేక పద్మగిరి. రైల్వే బ్రిడ్జి ప్రారంభమునఁగల రేవును అచటి జనులు నేఁటికిని పుష్పగిరిరేవు, లేక పుష్కరగిరిరేవు అని వాకొందురు. పుష్కరాల రేవు అనుటగూడఁ గలదు. పుష్కర పుణ్యసమయము నందు తైర్థికులందఱు నచటనే స్నానదానములు చేయుచుందురు. ఆ రేవునకు మీఁదనుండు ఱాతిమెట్ట పుష్కరగిరి, లేక పుష్పగిరి యగుట నిస్సంశయము. ఈనాఁ డా ప్రదేశమంతయు నూత్న నిర్మిత గృహములచే నావృతమాటచేఁ బర్వతాకృతి గానరాదు. ఈ పుష్పగిరిరేవునకు దక్షిణముగ నీనాఁటి మునిసిపల్ హైస్కూలునకు వెనుక భాగము శ్రీనాథునినాఁడు మార్కండేయ శివాలయ ముండియుండెడిది. ఇప్పు డుండెడి మార్కండేయాలయము లింగముకూడ నర్వాచీనములేగాని ప్రాచీనములుగావు. ఇప్పుడు జలయంత్ర గృహములు (Water works buildings) ఉన్న తావున, ఆ యంత్రగృహములు నిర్మించునపుడు నేల త్రవ్వఁగా, నన్నయ భారతాదిని చేకొనిన చాళుక్యోపాస్యుఁడయిన షడాననుని విగ్రహము, చాళుక్యుల నాఁడు కాకతీయులనాఁడు మార్కండేయస్వామి యాలయమున నెలకొల్పిన శాసనములుగల ఱాతిస్తంభములు దేవాలయ శిథిలములు నెన్నియో బయలుపడినవి. [1]ఈ విషయమును శ్రీ రాళ్ళబండి సుబ్బారావు గారు ఆంధ్రేతిహాస పరిశోధకమండలి త్రైమాసిక పత్రికలో ప్రతిబింబములతోఁగూడ నిరూపించియున్నారు. కావున మార్కండేయ నిలువేల్పు తొల్లి నెలసినచోటదియే యని తెలియనగును. శ్రీనాథుఁడు కాశీఖండమున "పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి, చేరి మార్కండేయ శివుని గొలిచి" యనినాఁడు. దీనినిబట్టి, పద్మాద్రి, దానినంటి గౌతమీనదిలోనికిఁ బాఱిన పర్వతపాదములు రుద్రపాదము లగుట, వానికిఁ జేరియుండిన శివుఁడు మార్కండేయశివుఁడు నగుట స్పష్టము. ఈ విషయములను బరిశీలించి చూచిన నాఁటి మార్కండేయ శివుఁడీనాఁడు మనకుఁ గానరాఁడు. ఆనాఁటి మార్కండేయ శివుని శ్రీనాథుఁడు 'ముక్కంటి'నిగా పేర్కొనినాఁడు. ఆ లింగమునకు సూర్యచంద్రాగ్ని నేత్రములు మూఁడును గుర్తుగ నుండెననుట నీ విశేషణము తెలుపుచున్నది. కాని యిప్పటిలింగమే లేనపు డా యీశ్వరుఁడు ముక్కంటియగునో కాదో యెఱుఁగుటెట్లు ?

3. కుమారారామము— నేఁటి సామర్లకోట భీమవరము. ఇది చాళుక్య భీమునకు రాజధాని యగుటచే నీ ప్రదేశమునకు భీమవరము అని పేరు. ఇచటి ఈశ్వరుఁడు కుమారారామభీమేశ్వరుఁడు. ఈయీశ్వరుఁడు చాళుక్య భీమున కిష్టదేవత. ఆ దేవున కాలయప్రాకారాదులు చాళుక్యభీముఁడే నిర్మించియుండుటచే నచటి యీశ్వరుఁడు చాళుక్యభీమేశుఁడైనాఁడు. ఆ విషయమును స్ఫురింపఁజేయుటకే శ్రీనాథుఁడు "ఆహార్మ్యరేఖయ చాళుక్యభీమేశు సదనవాటి" యనినాఁడు. భీమేశ్వర పురాణమునందు పంచారామములను వివరించు ప్రకరణములో శ్రీనాథుఁ డిట్లు వివరించియున్నాఁడు:

'మ. సరిసామంతుఁడు శ్రీ కుమారవనికా
చాళుక్య భీమేశ్వరే,
శ్వరదేవుండు... —భీమ. 5.89

వ. ...చాళుక్యవంశ రాజధానియగు భీమవరనామ గ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటం జేసి కుమార భీమలింగంబనఁ బ్రఖ్యాతినొందిన భీమారామంబును...భీమ.' 4.15.1

ఈ వాక్యములనుబట్టి పంచారామములలో నొకటియయిన కుమారారామమునకు సమీపమునందున్నది చాళుక్యభీమవరమనియు, అచటి యీశ్వరుఁడు చాళుక్య భీమేశ్వరేశ్వరుఁ డనియుఁ దెలియుచున్నది.

ఇది యిట్లుండఁ జరిత్ర పరిశోధకులు కొందఱు చాళుక్యభీముఁడు కుమారారామమునఁ దనపేర లింగమును స్థాపించుటచే నచటి యీశ్వరునకు చాళుక్య భీమేశ్వరుఁడను నామ మేర్పడి యుండినట్లు వాకొనుచు

1. See: J. A. H. R. S. Recent Archeological finds at Rajahmundry Vol VIII page 177 to 180.

నీ క్రింది శాసన శ్లోకములను ప్రోద్బలకముగ నిరూపించుచున్నారు.

శ్లో. తద్భ్రాతు ర్విక్రమాదిత్యస్య తనయ శ్చాళుక్యభీమః

షష్ట్యుత్తరం యస్త్రిశతం రణానాం
జిత్వా స్వనామ్నా ప్రథితం విధాయ।
చాళుక్యభీమేశ్వర దేవహర్మ్యం
త్రింశత్సమా భూతల మన్వరక్షత్ ॥

—మల్లపదేవుని పిఠాపురము శాసనము.[2]

ఆసీదిందుకులాగ్రణీర్నృపతిః చాళుక్యభీమేశ్వరః
తస్య క్షాత్ర పవిత్ర శైవపదవీ వృత్తం విచిత్రం భువి।
తేనైవార్పిత వైభవాత్ ఖలు సదా చాళుక్యభీమేశ ఇ
త్యాఖ్యా మాపద పూర్వికా మిహ కుమారారామభీమేశ్వరః ॥

—చాళుక్య విశ్వేశ్వరుని ధర్మలింగశాసనము.[3]

ఈ శ్లోకములను బట్టి చాళుక్యభీముఁడు కుమారారామ భీమేశ్వరునకు ప్రాసాద నిర్మాణాది వైభవమును గల్పించెననియు, తన్మూలమున నా యీశ్వరునకు చాళుక్యభీమేశుఁడను పేరేర్పడినట్లును, చాళుక్యభీమునకాతఁ డుపాస్యదేవత యనియు స్పష్టముగ దెలియవచ్చుచునే యున్నది. లింగమును దనపేర వెలకొల్పినను విషయ మేపాటియుఁ దలమాపుట లేదు.

"నాఁటి చాళుక్య భీమునికోట, అతని పాలనము తరువాత ధ్వంసమయినది. పిమ్మటఁ గొంతకాలమునకు కోటయవేముఁడు కుమారగిరి పక్షమున తూర్పుదేశమును జయించినాఁడు. ఆ ప్రదేశమును త్రవ్వింపఁగా నచట చాళుక్యుల కుపాస్యయైన 'మహిషాసురమర్దని' శక్తివిగ్రహ మొకటి బయటఁబడినది. కోటయవేముఁడా విగ్రహమునకు 'శ్యామల' యను నామకరణముచేసి, దేవళ మొకటి కట్టించి, దానికి దక్షిణముగ 'శ్యామలాదుర్గ' మను పేర గ్రామనిర్మాణము గావింపఁజేసెను. అదియే నేఁటి "సామర్లకోట"యని సామర్లకోట కైఫీయతులో వ్రాయఁబడియున్నది. ఇప్పుడా గుడిమాత్ర మున్నది. మహిషాసురమర్దని శక్తివిగ్రహము భీమేశ్వరాలయమునఁ దలదాఁచుకొని యున్నది. భీమవరము భీమేశ్వరాలయము మాత్రము చెదరకుండ నిలిచి యున్నది.

4. కుక్కుటేశ్వరము—కుక్కుటేశ్వరుఁడు వెలసియున్న యీనాఁటి పిఠాపురము. హుంకారిణీదేవి యీనాఁడు గానరాదు. కుక్కుటేశ్వరాలయమునం దీనాఁడుఁ గానవచ్చు పరదేవతావిగ్రహమును రాజరాజేశ్వరి యందురు. ఆ యాలయము నంటిన ప్రాకారమునం దొక పురాతనమయిన మేడ గానవచ్చుచున్నది. దానినే శ్రీనాథుఁడు హుంకారిణీదేవి యోలగ మనినాఁడేమో? ఈ పీఠికాపురమును శ్రీనాథుఁడీ భీమేశ్వరపురాణమున సవిశేషముగ వర్ణించు ప్రకరణములో :

"పీఠాంబ చెలి యోగపీఠి హుంకృతి దుర్గ
ననిచి కాపుండు నే నగరి కెలన." అనినాఁడు.

భీమ. 2. 52.

అతని నాఁడీ పిఠాపురమున పీఠాంబిక, హుంకారిణీశక్తియుఁ గాపుర ముండెడివారు. అష్టాదశ మహాశక్తిపీఠములలో హుంకారిణీశక్తిపీఠ మొకటి. పీఠాంబిక మాత్ర మెట్టులో తనయస్తిత్వము గోలుపోక ఆయూరి క్రొత్తపేటలో కుమారస్వామి యాలయమునఁ దల దాఁచుకొని యున్నది. ఈ పీఠాంబికను ప్రత్యేకముగఁ జిత్రించు ఘట్టములో నాదేవి శృంగారము నిట్లు చిత్రించియున్నాఁడు.

ఉ. హాటక పానపాత్రియును నారఁగఁబండిన మాతులుంగమున్
ఖేటము లోహదండమును నొగిం ధరియించి పురోపకంఠ శృం
గాటక భూమిభాగమునఁ గాపురముండెడి పీఠికాంబికన్
గైటభదైత్యవైరి ప్రియకాంతకు మ్రొక్కె నతండు భక్తితోన్.

—భీమ 2. 57.

ఈ పద్యమునందుఁ బేర్కొనిన యుపకరణములు నాలుగు గూడిన నాలుగు చేతులలో నిలిచియే యున్నదా పీఠాంబిక. శ్రీనాథుని నాఁడా పీఠాంబిక పురోపకంఠమున నాలుగుత్రోవలు గలియుచోట, ఆయూరి యుత్తరభాగమునఁ బ్రవహించు నేలేటి కాలువ యొడ్డున నుండినట్లు శ్రీనాథుని రచనను బట్టి మన

2. See Epi. Ind. Vol IV Page 226.
3. See Epi. Ind. Vol 9 Page 164.

# శ్రీనాథుని రచనలో ఐతిహాసిక విశేషములు.

యూహింపవచ్చును. శ్రీనాథుఁ డా యేలేరును ఏలానదిగా వర్ణించు ఘట్టములో—

"ఒకచోట పీఠాంబి కోన్నత స్తనభరా
స్ఫాలజర్ఝరిత కల్లోల యేల." యనినాఁడు.

—భీమ. 8. 20.

శ్రీనాథుని కంటఁబడిన విషయము గంటమున కెక్కక మానదు. ఏలానదిని పీఠాంబిక స్తనభారముచేఁ బాయపాయలుగఁ జీల్పఁబడిన తరంగములు గలదిగఁ జిత్రించినాఁడు. ఆ పీఠాంబికవిగ్రహమును సవిశేష దృష్టితోఁ జూచిన, మిగిలిన యవయవముల కంటె స్తనభారమున్నతముగఁ గానవచ్చును. ఆ విశేషమును మన కెఱిగించుచు, పీఠాంబిక యానాఁడు ఏలానదీతీరమున వసించుచుండెడిదని తెలిపినాఁడు. ఈ కుక్కుటేశ్వరమున నెలకొనిన కుంతీమాధవుఁడుగూడ చారిత్రక ప్రసిద్ధిగల దేవతయే.

౬. పల్వలపురము—ఈనాఁటి పలివెల యను గ్రామము. ఇది గౌతమీనదినుండి విడివడిన సప్త శాఖలలో నొకటియయిన కౌంతేయి (కౌశికి) యను శాఖయొడ్డునఁ గలదు. అచటి యీశ్వరుఁ డగస్త్యప్రతిష్ఠితుఁడై తొలుత అగస్త్యేశ్వరుఁడు, పిమ్మట కొప్పులింగేశ్వరుఁ డయినాఁడు. కావుననే శ్రీనాథుఁ డగస్త్యునిచే "వాఁడె మా యింటివేల్పు పల్వలపురమునఁ గొప్పులింగంబు?" అనిపించినాఁడు. అగస్త్యేశ్వరుఁడు కొప్పులింగమైన విషయమును నిగూఢముగ నిరూపించు విశేషణము 'ఫణిరాజకుండలుండు' అనునది. ఈ నాగాభరణము మూలకారణముగా అగస్త్యేశ్వరుఁడు కొప్పులింగేశ్వరుఁడైనాఁడు. దానికీ క్రింది యైతిహ్యమొకటి గలదు.



చాళుక్యభీముని సమయమునందే గావచ్చును. పలివెలయందున్న అగస్త్యేశ్వరుని పూజారి యొకఁడు, మిక్కుటమైన యీశ్వరభక్తి కలవాఁడయ్యును వేశ్యాలోలుఁడై మెలఁగుచుండెడివాఁడు. ఆయూరివారతని వేశ్యాలోలత కేవగించుకొని యపుడా దేశమును బాలించు ప్రభువున కాతని చరిత్రము నెఱిఁగించిరి. ఆప్రభు వొకప్పు డాకస్మికముగ పూజారి చరిత్రము నరయుటకుఁ బలివెలవచ్చెను. అది మధ్యాహ్న సమయము. అప్పటి కా పూజారి యీశ్వరునకుఁ బూజావిధి నెఱపి, భుక్తిఁగొని వేశ్యయింట వినోదించుచుండెను. ప్రభు వీశ్వరుని దర్శింపవచ్చెనను వార్త వేశ్యయింటనున్న పూజారికి వినవచ్చెను. ఆనాఁటి పరిపాటినిబట్టి, దేశము నేలు ప్రభువు వచ్చినపుడు, ఈశ్వరునకు ధరింపఁ జేసియున్న పూలమాలిక యొకటి నిర్మాల్య ప్రసాదముగ నా యొడయున కీయవలయును. దేవళమునం దీశ్వరనిర్మాల్యమైన మాలిక యేదియు లేనట్లు తెలిసిన పూజారి, ఏమియుఁ దోఁపక వేశ్యజడలోని మాలికఁ దీసికొనిపోయి, చూడవచ్చిన ప్రభువుచేతిలో నీశ్వరనిర్మాల్యముగ నా పూదండ నే యుంచెను. ఆ మాలికలో వేశ్యజడలోని వెండ్రుక యొకటి యంటియుండెను. తొందఱలో పూజారి దానిని గుర్తింపలేదు. పూజారిపై నేరము మోపి రాజును రావించిన గ్రామస్థులా వెండ్రుక పరికించి రాజునకుఁ జూపించిరి. ప్రభు వాగ్రహపరవశుఁడై "వేశ్య జడలోని పూదండ గొనితెచ్చి యీశ్వరనిర్మాల్యమని మాకిచ్చెదవా?" యని గద్దించెను. పూజారి చలింపకుండ "మా యీశ్వరునకు శిరమున కొప్పున్నది. అందలి వెండ్రుక యొకటి దీని కంటినది" అని బదులు చెప్పెను. ఊరివారందఱు నది వేశ్యజడలోని వెండ్రుకయే యనిరి. పూజారి కాదనెను. అంత నీశ్వరునకుఁ గొప్పుండెనేని చూపింపుమనిరి. అపుడు పూజారి యిట్లనెను. "అయ్యా!

నేఁడు మా యీశ్వరున కభిషేకము గావించి, గంధ పుష్పాదులచేఁ బూజించి, నాగాభరణముచే నలంకరించియున్నాఁడను. మరల రేపు ప్రాతఃకాలమునఁ గాని యీ నాగాభరణమును తొలఁగించి చూపించుటకు వలనుపడదు. ఉదయమున తప్పక కొప్పు చూపించెద" నని తెలుపఁగా రాజును గ్రామస్థులు నందుల కంగీకరించిరి.

అంత నా పూజరి రాత్రి యంతయు నీశ్వరుని మ్రోల నిలిచి, వ్రతముఁబూని, కొప్పును దాల్పకున్న ప్రాణము విడుతునని భక్తితోఁ బ్రార్థించెను. పూజరి భక్తికీశ్వరుఁడు ప్రసన్నుఁడై శిరమున కొప్పును దాల్చెను. నేఁటికి నాలింగమునకుఁ గొప్పుండినట్లు శిరమున గుర్తు గానవచ్చుచునే యున్నది. నాఁటి నుండియు నగస్త్యేశ్వరుఁడు కొప్పులింగేశ్వరుఁ డైనాఁడు. అట్లగుటకు మూలకారణము, పూజరికి మాన ప్రాణరక్షకము భక్తిభావసమున్మేషకము నైన నాగాభరణమే యయినది. ఆ విషయమును సూచించుటకే శ్రీనాథుఁడు 'కొప్పులింగంబు ఫణిరాజకుండలుండు' అనినాఁడు. అట్టి పూజరి భక్తిభావమునకు మెచ్చుకొని యా ప్రభువు ముప్పదిపుట్లభూమి నాతనికి దానము చేసెను. పలివెల కొక యామడదూరములో వసిష్ఠానదీ తీరమునందున్న యాభూమిభాగమునకు 'జుత్తిగపాడు' అని పేరు. పరమేశ్వరునకు జుట్టు పుట్టించినందులకు లభించిన భూమి యగుటచే దానికా పేరు వచ్చియుండును. నిన్నమొన్నటివఱకా భూమిపై సర్వాధికారములు పలివెల పూజరివంశజులకే నిలిచియుండెను. నేఁటికి నా ప్రాంతమునందలి జనశ్రుతిలో నీ యితిహాసము నిలిచియుండుట యది యథార్థమనుటకుఁ దార్కాణము.

6. సప్తముని సింధు సంగమేశ్వరుఁడు—ప్రస్తుతము రామచంద్రపురము తాలూకాలోని మండపేట ఏడిది తాపేశ్వరము అను గ్రామములకు నడుమనుండిన సంగమేశ్వరుఁడు గావచ్చును. భీమేశ్వరపురాణమున తుల్యభాగ యుత్పత్తిక్రమమును వర్ణించునపుడు, సప్తర్షి సమానీతయైన గౌతమి, తుల్యభాగుఁడను రాక్షసుఁడు తగవు దీర్చిన క్రమమున నంతఃప్రవాహయై ప్రవహించిన దిచటనుండియే యని యనిపించును. ఈ సంగమేశ్వర లింగమున కెదుట నొక మడుగువంటి జలాశయము గలదు. దానికి తుల్యభాగశాఖతో సంబంధము గానవచ్చుచున్నది. ఈ సంగమేశ్వరలింగము కూడ భీమమండలిలో నొక ప్రసిద్ధమైన యీశ్వరమూర్తి యగుటచే, భీమేశ్వరపురాణమునకుఁ గృతిభర్తయైన బెండపూడి అన్నమంత్రి ఆ శివాలయమున కల్యాణమండపము గట్టించెనని యిట్లు వాకొనియున్నాఁడు శ్రీనాథుఁడు:

సంగమేశ్వర దివ్య శంభులింగమునకుఁ
గల్పించెఁ గల్యాణగర్భగృహము.

—భీమ. 1. 74.

7. కుండలాముఖము—ఈ నాఁటి కుండలేశ్వరము. ఇది అమలాపురమున కాఱుక్రోసుల దూరములో నున్నది. అచటి యీశ్వరుఁడు కుండలేశ్వరుఁడు. ఆ సమీపమునఁ బ్రవహించెడి గోదావరీశాఖ వృద్ధగౌతమి. ఆ యీశ్వరలింగమునకు ముఖము కుండలాకారముగ నుండుటయు, ఆ యాలయ సమీపమున నొక తీర్థము (జలాశయము) ఉండుటయుఁ గారణముగా దానికి కుండలాముఖతీర్థమను పేరేర్పడినది. శ్రీనాథుఁడు కాశీఖండములో భీమమండలీక్షేత్రముల నగస్త్యునిచే దర్శింపఁజేయుచు:

"కోటిపల్లితీర్థ కుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ గొలిచి" యనినాఁడు.

—కాశీ. 3. 16.

కోటిపల్లిలోని యీశ్వరుఁడు సోమేశ్వరుఁడు. అతఁ డర్ధేందుధరుఁ డగుటకుఁ దగునట్లు శిరమున రజతకిరీటము దాల్చియున్నాఁడు. ఇఁక కుండలాముఖమున నీశ్వరుఁడు విరూపాక్షుఁ డగునా? కాదా? యని యెఱుఁగుటకీ నడుమనే ప్రత్యక్షముగఁ జూడఁ బోయితిని. ఆ యీశ్వరలింగమునకు మీఁదిభాగము మకరకుండలాకృతి గలిగియుండుట, ఫాలదేశమున నేత్రము గలదనుటకు గుర్తుగ దానిలో నాచోట కొంతమేర గంట్లుండుట. అది నేత్రమే యని యనిపించుటయుఁ దటస్థించినది. ఇట్టి యైతిహాసికాంశముల నెఱిఁగించుటలో శ్రీనాథుఁ డెంతటి సూక్ష్మదర్శియో యని యాశ్చర్యమొందవినది.

ఇట్లు శివార్చనకళాశీలుఁడు కవిసార్వభౌముఁడు నగు శ్రీనాథుఁడు పరమేశ్వరున కిడిన యొక విశేషణము నతికించిన నదియొక చరిత్రవిశేషముతో సంబద్ధమై యుండునని, పాఠకులు గ్రహింపవేడికోలు.

# చాపల్యం

### శ్రీ సత్యమూర్తి

జీవిత పథంలో చాలా దూరం ప్రయాణం చేసి ఒక చోట ఆగి గతజీవితాన్ని జ్ఞాపకం చేసుకుంటూంటే, నా జీవితంలో మధురస్మృతులకన్న బాధామయ స్మృతులే ఎక్కువగా కనిపిస్తున్నాయి. గొప్ప పొరబాటు చేసి చేజేతులా అమృతభాండాన్ని ఒలకపోసుకున్నాను. స్వర్గమయ జీవితంలో నరకాన్ని సృష్టించుకున్నాను. కళామయజీవితాన్ని శోకమయం చేసుకున్నాను. పశ్చాత్తాపంతో, వ్యథాదహ్యమాన హృదయనై, నా వ్యక్తిగత విషాదగాథను మీకు చెప్పడం నా హృదయభారాన్ని తగ్గించుకొందామనే! బాధనుంచి ఉపశమనం పొందాలని, సానుభూతి నాశించి, చెబుతున్నాను.

నాకు పెళ్ళీడు వచ్చినప్పటినుంచీ, నాన్న కాళ్ళరిగిపోయేట్టు తిరిగాడు వరులకోసం. పెళ్ళిచూపులకి వచ్చినవాళ్లందరిచేత నిరాకరింపబడ్డాను. కారణం? ......నా రూపం వారికి నచ్చలేదు. నేను అనాకారినట! నల్లగా ఉన్నానట. ఆరోజు నాకు బాగా జ్ఞాపకం. ఒకతను వచ్చాడు...నన్ను చూడ్డానికి. రెండు రోజుల క్రితమే మరొకరిచే "నిరాకృతికన్యనై," నా బ్రతుకును గూర్చి ఏదో ఆలోచించుకుంటూ, నా గదిలో కిటికీవద్ద కూర్చున్నాను. గుమ్మంవద్ద జట్కాబండి ఆగినచప్పుడైంది. ఎవరా! అని అనుకుంటూండగానే, నాన్న వచ్చి, "త్వరగా ముస్తాబు చేసుకో శారదా. నిన్ను చూడడానికి వచ్చారు" అన్నారు. నిర్లిప్తతతో నవ్వాను. నాకు తెలుసు, "ఇప్పుడొచ్చిన పెద్దమనిషికూడా అంగీకరించడని." అయినా నాన్నను సంతృప్తిపరచడంకోసం ముఖం కడుక్కొని, చీర మార్చుకుని వచ్చాను. అతనొకకుర్చీలోను, ఆ అబ్బాయి నాన్నగారు మరో కుర్చీలోను కూర్చున్నారు. నేను హాల్లోకివచ్చి చాపమీద కూర్చోబోయాను. ఆ అబ్బాయి నాన్నగారు నన్ను వారించి, "యిలా కుర్చీలో కూర్చోమ్మా" అన్నారు. కూర్చున్నాను. మామూలు పెళ్ళిచూపుల యింటర్వ్యూలాగ నన్ను పరీక్షించడం జరిగింది. ఆ అబ్బాయిని కాలేజీలో చూచినట్లు జ్ఞాపకం. అతనో సంస్కర్తలా పోజుపెట్టి, కాలేజి డిబేట్సులోను, నాటకాలలోను పాల్గొనేవాడు. నేను ఇంటర్ మొదటి సంవత్సరంలో ఉన్నప్పుడు అతను బి. ఏ. రెండవ సంవత్సరంలో ఉన్నాడు. అతన్ని నేనెందుకు మరచిపోలేదంటే, అతని అసలైన సంస్కారాన్ని నేను చూచాను కాబట్టి.

"మిమ్మల్ని కాలేజిలో చూచినట్లు జ్ఞాపకం. మీరు ప్రార్థనగీతం పాడేవారుగదూ, సమావేశాల్లో" అన్నాడు.

"అవునండీ" అని తలవంచుకునే ముక్తసరిగా జవాబిచ్చాను.

కాలేజీ వార్షికోత్సవం రోజున నా ప్రార్థన తర్వాత నా స్నేహితురాళ్ళంతా నా చుట్టూచేరి, "చాలా బాగా పాడావు. శారదా" అని నన్ను పొగడుతున్నారు.

"కోకిలచుట్టూ కాకులు చేరేయిరా" అని ఒక కంఠం వినిపించింది దగ్గరలోనే. మనస్సు చివుక్కుమని వెనక్కి తిరిగి చూశాను. అతను, మరి కొందరు స్నేహితులు, మావైపు చూస్తూ వెక్కిరిస్తూ నవ్వుతున్నారు. చాలా అసభ్యకరమైన మాటలన్నీ మాట్లాడుతున్నారు. నేను దూరంగావెళ్ళి కూర్చున్నాను. రాత్రి యింటికి వెళ్ళేటప్పుడుకూడా అసహ్యంగా అల్లరిచేస్తూ మా వెంటబడి నన్నూ, నా స్నేహితురాండ్రనూ, మా యిళ్ళదాకా సాగనంపారు. అందుకనే, అతన్ని నేను మరచిపోలేదు. బహుశా అతనికి తెలిసివుండదు "నేనతని గుణగణాలు గుర్తించానని."

అందుకనే, నన్ను తను గుర్తించినట్లు మాట్లాడాడు. అతనితో 'నాయింటర్వ్యూ' అయిపోయింది. నేను నా గదిలోకి వెళ్ళిపోయాను. హాల్లోనించి వాళ్ళ మాటలు నాకు బాగా వినబడుతున్నాయి. మా నాన్న

వాళ్ళని ప్రాధేయపడుతున్నట్టుంది. "అబ్బే! అయిదు వేలకి తక్కువైతే చేసుకోవడానికి వీల్లేదండి" అన్నాడు ఆ అబ్బాయి నాన్న. "మా అబ్బాయి ఏదో ఆధునిక భావాలు, సంస్కారము కలవాడు కాబట్టి, మీ అమ్మాయిని చేసుకోవడానికి అసలు ఒప్పుకుంటున్నాడు."

అతి నేమంటాడో వినాలనిపించింది నాకు.

"అంతేనండీ! మీ అమ్మాయిలాంటి అందవికారిని పెళ్ళిచేసుకోవడానికి, అంతకన్న తక్కువైతే ఎవరొప్పుకుంటారండీ" అన్నాడు.

అతనిమాటలు వినేటప్పటికి నాకు తలతిరిగినట్టయింది. కుప్పలా కూలిపోయాను. వాళ్ళు వెళ్ళిపోయారు. టేబిల్ మీద అద్దంలో ఒకసారి చూచుకున్నాను. నల్లగా కనబడింది నా ప్రతిబింబం. అంత నల్లగా ఎందుకుపుట్టాలి నేను! భగవంతుడు నన్నెందుకు ఇంత అందవికారంగా సృష్టించాడు? మళ్ళీ అద్దంలో చూచుకున్నాను. నామీద నాకే రోత పుట్టింది. కోపంతో అద్దాన్ని నేలకేసికొట్టాను. అద్దం ముక్కలు ముక్కలైంది. ప్రతిఅద్దంముక్కా నన్నూ, నారూపాన్నీ పరిహసిస్తున్నట్లనిపించింది. ఇంతబాధని, అవమానాన్నీ ఎలాభరించడం... క్షణంలో నే నుండే ఆగి మరణిస్తే ఎంతబాగుంటుంది!.. నావంటి నిర్భాగ్యురాలికి అంత అదృష్టంకూడా నా. పూర్వజన్మలో చేసుకున్న ఏకొద్ది పుణ్యంవల్లనో, ఒకస్వర్గమయజీవితంలో అడుగుపెట్టి అక్కడ పెరించి మళ్ళీ, జారిపడిపోయిన నాకథను మీకు అప్పుడెవరు చెబుతారు!...

నాబాధను గుండెలోదాచుకుని, మంచంమీద పడుకున్నాను. అద్దంపగిలిన శబ్దం విని, నాన్న గదిలోకి వచ్చారు. నాన్నముఖం చూడలేక మొహం అవతలకి తిప్పి పడుకున్నాను. పాపం!... నాకోసం ఆయనెంత కుమిలిపోతున్నారు! ఈజన్మలో నాకు పెళ్లి అయ్యే రాత లేదేమో అనుకున్నాను. నాన్న నాదగ్గరికివచ్చి మెల్లిగా తలనిమిరారు. నాకు నోటమాటరాలేదు. ఆయనకూడా మాట్లాడలేకపోయారు. మాట్లాడకుండా బయటికివెళ్లారు.

## 2

రోజులు గడుస్తున్నాయి... చీకట్లు వస్తున్నాయి, పోతున్నాయి. వెన్నెలలు వస్తున్నాయి... పోతున్నాయి. క్యాలెండర్లలో కాగితాలు చినిగిపోతున్నాయి. ఏమార్పూ లేకుండా యాంత్రికంగా గడచిపోతోంది నాజీవితం. ఒకరోజున ఏం తోచక పత్రిక తిరగేస్తున్నాను అందులో ఒకప్రకటన కనుపించింది. "ప్రఖ్యాత చిత్రకారుడు రవికుమార్ గారికి, చదువు, సంస్కారంగల వివాహయోగ్యయైన వధువు కావాలి. రవికుమార్ గారికి ఫోటోలు వివరాలతోసహా పంపితే, వారి కిష్టమైన కన్యను ఎన్నుకుంటారు" అని ఉంది. ప్రకటన ప్రక్కన అతని ఫోటో కూడా ఉంది.

రవికుమార్ గొప్ప చిత్రకారుడనీ, అతని చిత్రాలు చాల మనోజ్ఞంగా ఉంటాయనీ, అతని చిత్రాలు చూస్తూంటే, మన మనస్సు ఏదో ఊహాలోకంలో విహరించినట్టుంటుందని, చాలమంది చెప్పగా విన్నాను. అతని చిత్రాలు రెండు, మూడు నేను చూచాను కూడా! నేను చూచిన రెండు చిత్రాలు: మనుచరిత్రలోని కవితాపితామహుని రెండు పద్యాలకు ప్రతిసృష్టి! రూపకల్పన! ప్రవరాఖ్యుడు పాదలేపం ప్రభావంవల్ల హిమవత్పర్వతప్రాంతాలకి వచ్చి, అచ్చటగల ప్రకృతిసౌందర్యానికి ముగ్ధుడవుతాడు. తరువాత ఔషధహీనుడై, దారి తప్పి వరూధిని ఉన్నచోటికి వస్తాడు. అచ్చటి ఉద్యానవనంలో తీయమావిగున్నవద్ద, చంద్రకాంతశిలా వేదికపై కూర్చుని, వీణవాయిస్తూ, తన గానమాధుర్యంతో మైమరచి, కన్ను లరమోడ్చి, ఉన్న సురలోకసుందరిని,... వరూధినిని,... చూస్తాడు. ఇది మొదటి చిత్రం. రెండవది; అబ్బురపాటుతో, విశాలమైన కళ్ళతో, మనసులో ఏవో కోరికలు ఊరుతూంటే, వయ్యారంగా, వెన్నెలలు ప్రసరిస్తూన్న చూపులతో వరూధిని పురుష సౌందర్యమంతా మూర్తీభవించిన ప్రవరుని చూచింది. ఆమె శరీరం మన్మథాగ్ని ప్రభావంవల్ల పులకరించింది. కస్తూరిబొట్టు కరిగిపోయినది! మోహవిభ్రాంత అయింది!!

ఆ చిత్రాలు చూస్తూ, నన్ను నేను మరచిపోయాను. ఊహాలోకపు సౌందర్యంలోని లోతుల్ని వెలికితీసి, అసమానమైన తన భావనాశక్తివల్ల వాటికి రూపాన్ని కల్పించాడు, రవికుమార్. సౌందర్యానికి ప్రాణంపోశాడు. అలాంటి సౌందర్యారాధకుడు, కళాపిపాసి, కోరితే, నిండుహృదయంతో ఏ యువతి అతన్ని వరించడానికి ప్రయత్నించదు.

ఇలా, నే నాలోచిస్తూండగా నాన్న వచ్చారు. ఆయన చేతిలో చూసిన అదే పత్రిక ఉంది.

"అమ్మాయి...శారదా. ఈ ప్రకటన చూశావా" ...అన్నారు.

"చూశాను నాన్నా" అన్నాను.

"నీ ఫోటో చూసి ఒకటి పంపుదాం" అన్నారు.

నేను మౌనంగా ఊరుకున్నాను ..నాన్న కేమో ఆశ. పదిరాళ్ళు వేస్తే.. ఏదో ఒకటి తగులుతుందని... నా ఫోటో ఒకటి ఫుల్ సైజులోను, మరొకటి బస్టు వరకు,... రెండూ పంపాము.

ప్రఖ్యాత చిత్రకారుడు...ఎలాంటి స్త్రీనైన చలింపజేయగల రూపం గల రవికుమార్, అందరిచేత నిరాకరింపబడ్డ నన్ను వరిస్తాడని నే నెలా అనుకోను!

వారంరోజులు గడిచాయి. ఆ రోజు ఆదివారం. అప్పుడే స్నానంచేసి, హాల్లో ఈజీచైర్ లో కూర్చుని, నవల, "అరతుణీయు" చదువుకున్నాను. 'జ్ఞానద' పడే బాధలకి నా మనసు చలించింది. "ఎంత నిండైన హృదయము మామెది......! నేను కూడా జ్ఞానదవంటి దాన్నే. కాని ఆమెకు ప్రేమించడానికి 'అతులు' డున్నాడు. నిర్భాగ్యురాల్ని !...నా కెవరూ లేరు," అని ఆలోచిస్తూ కథాగమనంలో మునిగిపోయాను.

"టెలిగ్రాం" అన్న కేకతో నేను పుస్తక ప్రపంచంలోనుంచి బయటపడ్డాను. ఎక్కడినుంచి వచ్చిఉంటుందా అని ఆలోచిస్తూ, టెలిగ్రాం చించి చూశాను. ఆశ్చర్యంతో నా నోట మాట రాలేదు. "ఇది సంభవమా" అనుకున్నాను. కళ్ళు నులుముకుని మళ్ళీ చూశాను....అదే......"సంతృప్తుడను....ఈ రోజు మెయిలులో వస్తున్నాను......రవికుమార్" అని ఉంది.

నాన్న వచ్చాడు. నా చేతిలోవున్న టెలిగ్రాం తీసుకుని చదివాడు...ఆయన ఆశ్చర్యానికి మేర లేదు. నాకు ఒకవైపు అవ్యక్తమైన ఆనందము.. మరోవైపు కించిత్ భయము కలుగుతున్నాయ్. నాలో ఏం చూసి నన్ను ఎన్నిక చేసుకున్నాడు...అతడు నా నిజ స్వరూపాన్ని చూశాడంటే....ఇంకేముంది...తిరుగు రైలుకే వెళ్ళిపోడూ! ఈ విషయం తెలుసుకున్నప్పుడు బాధ కలిగింది...అతన్ని మోసం చేశామేమో...అని. రైలుకు వేళ అవుతూన్న కొద్దీ...నా గుండె వేగంగా కొట్టుకోవటం ప్రారంభించింది.

రైలు వచ్చింది. రవికుమార్ రానేవచ్చాడు! ఇంట్లోకి రాగానే...మా నాన్న వారికి స్వాగతం చెప్పారు. ఇద్దరూ హాల్లో కూర్చున్నారు. నేను నాగది లోనుంచి బయటికిరాలేదు. ఏదో చెప్పలేని సిగ్గూ, భయమూ నన్నావరించివేశాయి. ఆక్షణంలోని మానసికస్థితిని వర్ణించలేను. మనసు ఉయ్యాలలా ఊగుతోంది. ఒక రక్తపుచుక్కని మైక్రోస్కోప్ లో చూస్తే...అందులోని వేలకొద్దీ కణాలు...ఒకదాని నొకటి గుద్దుకొని ఎలా వేగంగా, ముందుకి, వెనక్కి తిరుగుతూంటాయో...అలా నా మనస్సులో అస్పష్టమైన భావాలు అనేకం సంచరిస్తున్నాయి.

ఈ వ్యధలోనుంచి తేరుకుని...ద్వారానికున్న తెర కొద్దిగా పక్కకు తొలగించి చూశాను...అబ్బ! ఎంతందంగా ఉన్నారు. అబద్ధ మెందుకు చెప్పాలి... ఆయన్ని చూచిన ఆ క్షణంలో నే...ప్రవరాఖ్యుని చూచిన వరూధినిగా అయిపోయాను! నాన్న నన్ను గమనించి...

"శారదా!...బయటికి రామ్మా" ... అన్నారు.

నేను సిగ్గుపడుతూ ... భయంతో ... మెల్లిగా అడుగులోఅడుగు వేసుకుంటూ వచ్చాను ... నేను గదిలోనుంచి వస్తూంటే రవి...నా వైపు చూశాడు... అమ్మో...సిగ్గుతో, భయంతో చచ్చిపోయినంత పనైంది నాకు. ఆయన రెప్పవాల్చకుండా ఆపాదమస్తకమూ నన్ను పరిశీలించారు.

నాన్న ప్రక్కన కుర్చీలో కూర్చున్నాను. ఆయన తన చూపుల్ని నా వైపునుంచి మరల్చలేదు. ఆయన కళ్ళు మెరుస్తున్నాయి. తలెత్తి ఆయనవైపు చూశాను. ఆయన మొహంలో అనాదరభావం గోచరించలేదు. అసహ్యత కనపడలేదు. నే ననుకున్నట్టు అతడు నన్ను చూచి నిశ్చేష్టితుడు కాలేదు. పరవశుడైనట్టు కనిపించాడు. కారణ మేమిటో...నాకు బోధపడలేదు. ఒక మహాశిల్పి హస్తాల్లో తయారైన శిల్పాన్ని చూచినట్టు నన్ను చూస్తున్నాడు.

నాన్న టైం చూచుకొని..."భోజనానికి లేవండి పన్నెండు కావస్తూంది" అన్నాడు. ముగ్గురం లేచాం. వాళ్ళిద్దరికి నేనే వడ్డించాను. భోజనాలైనయ్. ఆయన, మానాన్న వరండాలో కూర్చుని తాంబూలం వేసుకుంటున్నారు. నేను ఇంట్లో సర్దవలసినవి సర్ది...అప్పుడే బయటికి వస్తున్నాను. రవికుమార్ మాటలు వినిపించి

నయ్. అక్కడే ఆగి విన్నాను. "రిజిష్టర్ మ్యారేజి అయితే బాగుంటుందండి. మామూలు అట్టహాసాలు నాకు అంతగా నచ్చవు" అన్నాడు.

"మీ యిష్టం? అలానే కానిద్దాం. నేనుకూడా ఆడంబరాలు వాంఛించేవాణ్ణి కాను" అన్నారు మా నాన్న.

అబ్బ! నాకూ పెళ్ళి జరుగబోతుంది. చీకటే... నిరాశా తప్ప మరొకటి లేదనుకొన్న నాజీవితంలోనే.. వెలుగు రాబోతోంది... క్రొత్త ఆశలు చిగురిస్తున్నాయి. శిశిరం వెళ్ళిపోయింది. వసంతం రాబోతోంది. ఆనందం పట్టలేక... గదిలోకి వెళ్ళి పరుపుమీద పడుకుని దొర్లాను. ఆ సంతోషంలో అన్నం, నీళ్లుకూడా మరిచాను.

## 3

నా పెళ్ళి నిరాడంబరంగా జరిగిపోయింది. మర్నాడే, నేనూ, రవీ బెంగుళూరుకి బయలుదేరాము. ఫస్టుక్లాస్ కంపార్టుమెంటుని, స్టేషన్‌మాస్టర్‌కి ఫోను చేసి రిజర్వు చేశాడు రవి. ఆశ్రునయనాలతో నాన్న దగ్గర సెలవు తీసుకున్నాను.

రైలు వెళుతోంది. కంపార్టుమెంటులో మేమిద్దరమే ఉన్నాం. రవి నావైపు తిరిగి......

"శారదా" అన్నారు.

"ఊ" అన్నాను తలవంచుకొని. నాకు యింకా వారితో మాట్లాడాలన్నా, వారివంక చూడాలన్నా సిగ్గుగా ఉంది. నాదగ్గరకు వచ్చి, ప్రక్కన కూర్చుని నాచేతిని తన చేతిలోకి తీసుకున్నారు. నాభుజంమీద చేయివేసి..."వెన్నెల చూడు ఎంత అందంగావుందో" అన్నారు. ఒక్క క్షణం ఆయనవేపు తన్మయత్వంలో చూశాను. అప్పుడు నాకు ..లతకు మహావృక్షము వంటి వారిని... నేను.. గాలుద్ధతికి కంపించే లతనని అనిపించింది. ఆ వృక్షం, లతకి ఆశ్రయమిచ్చింది. లత వృక్షాన్ని గట్టిగా పెనవేసుకుంది. నాహృదయం చాలా సున్నితమైంది... ఆనందాన్ని గాని, దుఃఖాన్ని గాని... దేన్నీ... భరించలేను. దుఃఖంలో ఉన్నప్పుడు ...తుఫాను ధాటికి ఆగలేక... చిగురాకు లాగ విలవిలా కొట్టుకుంటాను. మహావాయు తీవ్రతకు ఆగలేక... ఏక్షణంలోనో... ఆరిపోవడానికి... సిద్ధంగావున్న... జ్యోతిలాగ బాధపడతాను.

అదే...ఆనందంలో ఉన్నప్పుడు.....ఈతరాక ...నీళ్ళలో మునిగి...అవస్థపడుతూన్న వ్యక్తివలె ఉక్కిరిబిక్కిరవుతాను.

అలాంటి సమయంలో...మరో వ్యక్తి...మరో హృదయం...మరో మనస్సు...ప్రక్కన ఉండి... దుఃఖాన్ని గాని... సంతోషాన్ని గాని...పంచుకుంటే ...నాకు...ఏదో భారం తగ్గినట్టు.. ఏదో పెన్నిధి లభించినట్టు తోస్తుంది. రవిని కౌగిలించుకొని...కిటికీలోనుంచి బయటకుచూశాను. శీతల చంద్రకిరణాలు ...పినాకినదిలో ప్రతిబింబిస్తున్నాయి. క్షీర సాగర తరంగాల నుంచి ఎగిరివస్తున్న తుంపురులవలె, ... విశ్వకర్మ ... దేవేంద్రుని నాట్యశాలా ప్రాంగణంలోని రజత స్తంభాలకి మెరుగులు పెడుతోంటే.. రాలిన పొడివలెఉంది...వెన్నెల.

తెల్లని వెన్నెలను కల్మషం చేస్తూ ..నల్లనిపొగని విడుస్తూ...దూసుకుని వేగంగా పరుగెత్తోంది రైలు. ఇంజనువదలినపొగలు... మేఘాలతో కలసి...చంద్రుని మీద దండెత్తడానికి పరుగెత్తుతున్నాయి...! చంద్రుడు తప్పించుకునిపోకుండా ఉండటానికి......మేఘాలు వ్యూహాలు పన్నుతున్నాయి. వాటి వ్యూహాలనుంచి తప్పించుకొని అతడు బయటకి వస్తూనే ఉన్నాడు.

నా బుజంమీద చల్లగా ఏదో తగిలినట్టయింది. ఉలిక్కిపడి చూశాను!...రవి పెదవులు నా బుగ్గల్ని తడుపుతున్నాయి. నా నరాలు స్తంభించిపోయినై. రైలు ఏదో స్టేషన్‌లో ఆగి మళ్ళీ కదిలింది...

"ఏస్టేషనండీ" అని అడిగాను.

"అనంతపురం" అన్నారు రవి.

కిటికీలోనుంచి చూశాను...కొద్దిదూరంలోనే పెద్దభవనాలు కనబడుతున్నాయి. అవి ఏమిటని అడిగాను. "అవి గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి భవనాలు." వెన్నెల్లో ఆ భవనాలు చాలా అందంగా కనబడుతున్నాయి. కొద్దినిమిషాలలో.. ...అనంతపురం వెనకే ఉండిపోయింది. మేము ముందుకు వెళ్ళిపోతున్నాం. చెట్లు, గుట్టలు మమ్మల్ని ఆహ్వానించటానికేమో అన్నట్టు దగ్గరకువస్తున్నాయి. మా రైలు వాటినేమీ గమనించకుండా పరుగెడుతోంది. అవి పాపం...నిరాశతో.....మావైపే చూస్తూ వెనక్కి వెడుతున్నాయి.

నిద్రవస్తూంటే......బ్లాంకెట్ తీసి కప్పుకుని, నిద్రపోయాను. మేము బెంగుళూరు చేరేటప్పటికి... తెల్లవారి...ఆరున్నర అయింది. టేక్సీలో ఇంటికి వెళ్లాము.

ఇల్లు చామరాజ నగర్‌లో ఉంది. ముచ్చటగా మాకు సరిపోయే డాబా. ఇంటిముందు...చిన్నతోట ఉంది. తోటలో రెండు పాలరాతి అరుగులు కూడా ఉన్నాయి. ఇల్లు నాకు బాగా నచ్చింది.

నేనావూరికి క్రొత్తగాబట్టి...నాకు ఊరంతా చూపించాడు, రవి...రోజులు ఆనందంగా గడుస్తున్నాయ్. కాని మొదటి నుంచీ నామనసులో దాక్కొని ఉన్న...ఆత్మక్లేశం...నేను అందవిహీనను అనే బాధ నన్ను వదలలేదు ... అదొక పెద్ద వ్యాధిలా లోపల పట్టుకుంది. నేను రోజూ రవి గదిలోకివెళ్ళి ..అతని కుంచెలు శుభ్రపరిచేదాన్ని. అత నెప్పుడూ ఏవో బొమ్మలు గీస్తూ కూర్చునేవాడు. మధ్యాహ్నం వేళ రంగులను కలుపుతూ...రవికి సాయపడేదాన్ని.

"శారదా...నేను చిత్రం గీసేటప్పుడు నీవు నా ప్రక్కన ఉంటే నాకు ఎంతో ఉత్సాహంగా ఉంటుంది" అనేవాడు. చిత్రం గీస్తూ మధ్య మధ్య నావేపు చూసేవాడు. నన్ను చూస్తే తనకి 'ఇన్స్పిరేషన్' వస్తుందనేవాడు.

మధ్యాహ్నంపూట ఎప్పుడైనా రవి నిద్రపోయేవాడు. నాకు మధ్యాహ్నం నిద్రపోయే అలవాటు లేదు. పుస్తకాలు చదువుతూనో, లేక.. 'ఆల్బం' చూస్తూనో కాలంగడిపేదాన్ని. ఆల్బం చూసేటప్పుడు మాత్రం...అణగిపోయి ఉన్న నాలోని ఆత్మక్లేశం మళ్లీ తలయెత్తేది.

ఒకరోజు మధ్యాహ్నం...నేను పత్రిక చదువుకుంటున్నాను. రవి మంచంమీద నిద్రపోతున్నాడు.అతని వైపు చూశాను. ప్రశాంతంగా నిద్రపోతూ ఉన్నాడు. ఏ ఊహాసుందరిని కల్పించుకుంటున్నాడో!...నిద్రలోనే నవ్వుతున్నాడు! అతని అందం...ఎలాంటి స్త్రీనైనా సమ్మోహపరుస్తుంది. ఈ మన్మథాకారుడు కోరి నన్ను పెళ్లి చేసుకున్నాడు. ఒకోసారి...ఇదంతా నిజమేనా! అన్నంత భ్రాంతి కలుగుతుంది నాకు. ఆల్బం చూశాను. దాన్లో ... ఎంతోమంది...సుందరాంగుల ఫోటోలు అంటించబడి ఉన్నాయ్. అవన్నీ అతని ప్రకటనకి సమాధానంగా వచ్చినవే...ఒకరిని మించి మరొకరు అందంగా ఉన్నారు.
సారి తిరగేస్తే కన్ను చెదిరిపోతుం,
అందులో ఉంచలేదు. దాన్ని ప్ర
చేయించి, తన క్యాన్‌వాస్ పక్క
మీద ఉంచాడు...తన కెప్పుడూ
సాక్ష్యం చాలు...రవి నన్నెంతగా ప్రేమిస్తున్నదీ తెలియచెయ్యడానికి. అతనిదగ్గర నాకేలోటు లేదు. అతని ప్రేమలో, అతను నాకందించే సౌఖ్యంలో... ఆనందంలో...కొరత లేదు. నాకోసం...కొరుకూడి కొంటానన్నాడు!

నా జీవితం యింత ఆనందమయంగా ఉన్నా... నాబాధ నన్ను వదలిపోలేదు.వచ్చినకొత్తలో...అంతగా అనుకునేదాన్ని కాదు.అద్దంలో నన్ను నేను చూసుకున్నప్పుడు...నేనెంతో తక్కువదాన్నని...నన్నెందో ఉద్ధరించడానికి...రవి పెళ్ళి చేసుకున్నాడేమోనని అనిపించేది. స్త్రీలను చపలచిత్తలన్న మహాకవులు నిస్సందేహంగా పొరబడలేదు. మరో స్త్రీ అయితే...తనకికోరికిన పెన్నిధానంతో హాయిగా జీవితాన్ని గడిపేది... నాలాగ ... ఆత్మ హీనతాభావంతో...బాధపడి... సౌఖ్యమయజీవితాన్ని విషాదమయంగా ఎవరు చేసుకుంటారు!

## 4

రవి నన్ను నిజంగానే ప్రేమిస్తున్నాడా...! అప్పుడప్పుడు ఈ ప్రశ్న మనసులో ఉదయించేది. ఈ ప్రశ్నకి అర్థమేలేదు. నన్ను పెళ్ళిచేసుకున్నందుకు ... అతను ... విచారిస్తున్నాడేమో అనుకునేదాన్ని. కాని...అతను నిరుత్సాహంతో ఉండగా... నేనెప్పుడూ చూడలేదు. విసుక్కోవడమనేది లేనేలేదతనికి. అనేక ప్రదర్శనలలో అతనిచిత్రాలకి వెండి కప్పులు...పతకాలు...బహుమానాలువస్తే..."ఇవన్నీ నీవే...శారదా...నీవు లేకపోతే నాకివన్నీ లభించేవి కావు" అనేవాడు.

"ఏమండీ!...నేను నిజంగా మీకంటికి బాగున్నానా" అని అడగాలనుకునేదాన్ని. కాని అడగడానికి ధైర్యంచాలదు. అతని చిత్రాలని... జమీందార్లు...డబ్బుగలవాళ్లు కొనేవారు. ఒకో చిత్రానికి ... వెయ్యి...పదిహేనువందలు ... వచ్చేవి. ఒకోచిత్రం అమ్ముడుపోయినప్పుడల్లా నాకు బహుమానం తప్పదు నెక్‌లేసో — టాయిలెట్ సెట్టో పట్టుకొచ్చేవాడు. నేను నిద్రపోయేటప్పుడు...

నెక్ లేస్ నా కంఠానికి అలంకరించేవాడు. ఉదయం నేను లేచినపుడు... మెడకి ఏదో బరువుగా ఉంటుంది. ఏమిటా అని చూసుకుంటే హారం! ఇలా ఉంటుంది... అతని బహూకరణ. నాపైన అతని ప్రేమ నిత్య నూతనంగా ఉండేది. అతను నన్ను తన ప్రేమతో, ఉక్కిరిబిక్కిరి చేసేటప్పుడుకూడా... ఆ ప్రశ్న నన్ను వదిలిపెట్టి పోయేదికాదు. సంతోషమనే అమృతపు సముద్రంలో ఒక విషబిందువులాగ .. ఆ ప్రశ్న నన్ను నా మనస్సుని కల్మషపరిచి బాధించేది.

ఆ రోజు... లాల్ బాగ్ కి షికారు వెళ్ళాము. అతని ప్రక్కనే .. నేను నడుస్తున్నా. అతని అంద మెక్కువ ... నా అందమెక్కువ ...! దారిలో అందరు... మమ్మల్నే చూస్తున్నారేమో అనిపించింది. అందమైన ఆడవాళ్ళు...మావైపు పరకాయించిచూచి... నవ్వుతున్నట్లు తోచింది. వాళ్ళ నవ్వు నన్ను వెక్కిరిస్తున్నట్లుంది. అంత అందగానికి...ఈమె ఎక్కడ దొరికిందా...అని ఆశ్చర్యపోతున్నారేమో! గ్లాస్ హౌస్ దగ్గర...ఒకచోట కూర్చున్నాము...మా చుట్టూ అందమైన పూల్లు ... రంగురంగుల పూలు...లతలు ఉన్నాయ్. మేము కూర్చున్నచోట గడ్డి, తివాసీ పరచినట్లుంది...మెత్తగా. ఎక్కడ చూసినా అందమే...!

"ఏమండీ...' అన్నాను, అదోలాంటిభయం... ఏమనుకొంటాడోనని.

"ఏం? శారదా" అన్నాడు.

"నేను, మీకు......"

"చెప్పు భయపడతావేం?..." అన్నాడు.

"నేను...మీ కంటికెలా ఉన్నాను..." అని ధైర్యం తెచ్చుకుని అడిగాను.

"ఇప్పుడెందుకుశారదా...ఈ ప్రశ్న" అన్నాడు.

"నేను నల్లగా ఉన్నానుకదా ..మీ కెలా నచ్చాను."

రవి నవ్వాడు.. నన్ను దగ్గరకు తీసుకున్నాడు. నేను సిగ్గుతో, భయంతో కుంచించుకుపోయాను.

"శారదా...నువ్వు...ఎంత అమాయకురాలివి! చిత్రకారుడికి ... నలుపురంగంటే ఎంత ఇష్టమో తెలుసా!" అన్నాడు.

ఈ జవాబు నన్ను తృప్తిపరచలేదు. చిన్న పిల్లల్ని మభ్యపెట్టినట్టుంది...!

అమాయకంగా...అర్థంకానట్టు ... అతనివైపు చూశాను.

"శారదా...నీలో ఉన్న సౌందర్యం సామాన్యమైందికాదు. నీ నలుపులోపల...ఎంత సౌందర్యం నాకు కనుపిస్తోందో...తెలుసా! నీ శారీరకరేఖలపై... అంగసౌష్టవంపై ... అంతసౌందర్యకాంతులు ప్రతిఫలిస్తున్నాయ్. నీలోని కళ నలుపుకాదు...నీ భావాలు నల్లనివికావు.. నీ గుణం నల్లనిదికాదు...నీవొక శిల్పసుందరివి! నీవు ... శాపవశాత్తు ... అచేతనత్వాన్ని పొంది...శాపావసానసమయంలో.. చేతనత్వాన్ని పొందిన పుత్తడిబొమ్మవు!

నీవు తెల్లగా ఉండి...బంగారపు రంగుతో నిగనిగలాడుతోంటే...అద్వితీయ సౌందర్యరాశివైన నీవు ఏ మహారాజుల అంతఃపురంలోనో...ఉండిపోయేదానివి. నా అదృష్టంవల్లనల్లనిదానవై...నాకు లభించావు. నాకు మహాసౌందర్యరాశి లభించింది...పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు...వెర్రిదానా!...నీ నిజమైన రూపాన్ని చిత్రించానంటే...నిద్రిస్తున్న నీ సౌందర్యప్రభని మేల్కొల్పితే......లోకం విభ్రాంతమై మైమరచిపోతుంది..."

నాకు నోట మాట రాలేదు. అయినా గట్టిగా కౌగిలించుకున్నాను...అబ్బ!...నా అనుమానం పటాపంచలైపోయింది...హృదయం తేలికపడింది

ఆ రాత్రంతా రవి అన్నమాటలే చెవిలో గింగురుమంటున్నాయి. రాత్రంతా నిద్రపట్టలేదు. రవిని చూస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాను ... తెల్లవారింది. నాకళ్ళు ఎర్రగా ఉన్నాయ్. ఇన్నిరోజులుగా నా మనసులో ఉన్న అనుమానం నివృత్తి అయింది. కాని ఒక కొత్తకోరిక చిగిర్చింది. కాని ఆ పాడుకోరికే నా జీవితాన్ని నాశనంచేస్తుందని నాకేం తెలుసు !

రవి నిద్రనుంచి లేవగానే "ఏమండీ నా బొమ్మని అహా...నా నిజమైనసౌందర్యాన్ని చిత్రించరూ?..." అనడిగాను.

రవి...నా కేసి...చూశాడు. అతనిచూపుల్లో సానుభూతి ప్రదర్శిత మౌతోంది.

"వద్దు. శారదా!...అలాంటి పిచ్చికోరిక కోరకు. లేనిపోని అనర్థాలు ప్రాప్తిస్తాయి. నీసౌందర్యము నీలోనే ఉండనీ," అన్నాడు.

ఎన్నోవిధాల...వద్దని రవిచెప్పినా నేను వినలేదు... స్త్రీచాపల్యం!...నాసౌందర్యం.....ఎలాఉంటుందో

చూడాలనే కోరిక కొంత... వీటిని అణచుకోలేకపోయాను. నా చిత్రం గీయమని బ్రతిమాలాను. బాధించాను, విసిగించాను. రవికూడా తన మనస్సును తాను అరికట్టుకోలేకపోయాడు. నా మనోవీధి తేజోమయమై పోయేలాగా వెన్నెలాలా ఒక చిరునవ్వు నవ్వి, కుంచ తీసుకుని నిగనిగలాడుతున్న వన్నెరంగులో కుంచ ముంచాడు.

## 5

నా జీవితంలో మరో ఘట్టం...అప్పటి నుంచే ప్రారంభం అయింది. నన్నొక వింతభంగిమలో నిలబెట్టి...అనేక కోణాలనుంచి చూస్తూ...నన్ను చిత్రింపసాగాడు రవి. ఆ చిత్రంలోని సౌందర్యానికి మెరుగులు దిద్దటంలో నిమగ్నుడైపోయాడు. అన్నం, నీళ్లు మరిచాడు. ఆ చిత్రానికి ఎంత మెరుగులు దిద్దినా...అతనికి తృప్తిలేదు...రానురాను...అతను.. మాట్లాడ్డంతగ్గించాడు. ఎప్పుడూ ఆలోచిస్తూ...వింతగా ...పిచ్చిగా...బొమ్మకేసి చూస్తూ కూర్చునేవాడు. ఏవో ఉన్మత్తభావాలలో పరవశుడైపోయేవాడు. చిత్రం నించి చూపు మరల్చి నావైపు పిచ్చిగా చూసేవాడు. మళ్లీ చిత్రరచనలో...నిమగ్నుడైపోయేవాడు. నిద్రపోవటంకూడా తగ్గించాడు. ఎప్పుడూ ఆ చిత్రం ముందే కూర్చోవటం.. తనలో తాను నవ్వుకోవటం......మొదలైనవన్నీ ప్రారంభమైనయ్!

నా మనసులో భయాందోళనలు...కలుగసాగినయ్. రెండునెల్లకి...చిత్రం పూర్తయింది.

"శారదా" అని గట్టిగా అరిచాడు నన్ను చూసి. చిత్రాన్ని చూశాను.

అబ్బ!...ఎంత సౌందర్యం! నేను నమ్మలేకపోయాను. అది నా చిత్రమేనా...అని! నా బాహ్య శరీరాన్ని దూసుకునివచ్చి ఆత్మసౌందర్యం...రూపం దాల్చినట్లుంది. అద్భుతం ... సాక్షాత్ జగన్మోహిని ఆ చిత్రంలో అవతరించింది! నీలనీరదశుభాంగి! ఇంత సౌందర్యం...నాలో ఉందా! నాకు నాకే విభ్రాంతి!

కాని, ఆ రోజునుంచీ...నాకు మనశ్శాంతి పోయింది. సుఖంలేదు. రవి మాట్లాడటం పూర్తిగా తగ్గించివేశాడు. ఎప్పుడూ ఆ చిత్రం ముందు కూర్చుని...ఏదో ఆలోచిస్తూ...కాలం గడిపేవాడు. ఉత్సాహంతో ఇతర చిత్రాలు గీయటానికి... అతనికి మనసురాలేదు. నిరంతరం ఆ చిత్రంలో సౌందర్యరసాస్వాదనమే ... తప్ప ... అతను వేరే పనిచేయడంలేదు. అతన్ని మామూలు స్థితిలోకి ఎలా తీసుకురావాలో నాకు తోచలేదు. భయంతో నా గుండె కొట్టుకోసాగింది. అతని దగ్గరకు వెళ్లటానికి... మాట్లాడటానికి...భయం.

"ఏమండీ ... లాల్‌బాగ్‌కి వెళ్దాం రండీ... మీకు హాయిగా ఉంటుంది" అన్నాను ఎలాగో. రవి గట్టిగా నవ్వాడు.

"ఇంకా ఏం లాల్‌బాగ్. ఎందుకు వెళ్లాలి... అక్కడికి? ఏముందక్కడ, ఇంతకుముందు సౌందర్యాన్వేషణకై వెళ్లేవాడిని. ఇప్పుడు ప్రపంచంలో ఎక్కడా లేని సౌందర్యం...నాదగ్గరే...నాయింట్లోనే ఉంది! నేను రాను...కావలిస్తే...నువ్వు వెళ్లు అన్నాడు.

ఏమనటానికి నాకు మాటరాలేదు. ఎప్పుడూ అతన్నిగురించి ఆలోచిస్తూ కూర్చునేదాన్ని. ఒక రోజున ఒక జమీందారు...తను కొత్తగా కొన్న భవనంలో అలంకరించడానికి...ఏవైనా చిత్రాలు కొందామని వచ్చాడు. గదిలోని నా చిత్రాన్ని చూచి... ముగ్ధుడై...ఎంత వెల అయినాసరే...ఆ చిత్రాన్ని కొంటానన్నాడు. రవి అతనివైపు పిచ్చిగా చూశాడు. "ఏమిటీ...... నా భార్యని......అమ్మమంటారా! నాభార్యను కొనకు అడుగుతారా ... ఇక్కడనుంచి ముందు బయటికి వెళ్ళండి" అని అరిచాడు. అతని కేకతో ఇల్లు ప్రతిధ్వనించింది. ఆ జమీందారు భయపడి ... బయటికి పరుగెత్తాడు. ఇలానే ... ఇంకా కొంత మంది ఆ చిత్రంకోసం వచ్చి...రవిచేత బాగా తిట్లు తిన్నారు.

ప్రసిద్ధ చిత్రకారుడు....రవికుమార్‌కి....తాను రచించిన చిత్రంవల్లనే మతిభ్రమించింది...అని అక్కడక్కడ అనుకోవడం మొదలు పెట్టారు.

ఏమ్చేసేది అపుకోలేకపోయాను. రవిని...ఎలా తీసుకురావాలి...మామూలుస్థితికి? ఒక ఆలోచనతట్టింది. ఆ చిత్రాన్ని నాశనంచేస్తే?..కాని నాశనం చేయటంకన్న ..ఆరోజువచ్చిన జమీందారుగారికే... లేక మరెవరికో అమ్మివేస్తే...బాగుంటుంది. ద్రవ్యలాభమూ ఉంటుంది ...అనుకున్నాను.

వెంటనే జమీందారుగారికి...కబురు పంపించాను. నా భర్తకి మతిస్థిరం తప్పిందనీ...ఆయనకు

తెలియకుండా - చిత్రం తీసుకువెళ్ళమనీ.. వ్రాశాను. ఆ చిత్రం ఎదురుగా లేకపోతే...అతను బాగుపడ తాడని ఆశించాను.

అదేవిధంగా ఒక రోజు రాత్రి...జమీందారు వచ్చారు. రవి నిద్రపోతున్నాడు. నేను...నా అద్భుత చిత్రాన్ని...జమీందారు కిచ్చేసి...పదివేల రూపాయలు పుచ్చుకున్నాను. ఆయన చిత్రాన్ని తీసుకొని వెళ్ళిపోయాడు. ఇక రవికి...ఏమని సమాధానం చెప్పాలి? అతను ఎలామార్గానికి వస్తాడు. ఈ ఆలోచనలతోనే గడుపుతున్నాను...

ఇంతలోనే...రవి లేచాడు. చిత్రంకోసం బల్ల వైపు చూశాడు. అది కనుపించకపోయేటప్పటికి ... "ఏదీ? నా సౌందర్యరాశి ... నా ప్రియురాలు ఎక్కడ?... నా చిత్రసుందరి...ఏది?" అంటూ గదంతా వెదుకుతున్నాడు. గబగబా వెళ్ళి అతనిని పట్టుకుని...మెల్లగా "పోతేపోయింది లెండి...అంతకన్న మంచిచిత్రం...మరొకటివ్రాయవచ్చు...ఇదో! యిలా చూడండి.. పదివేల రూపాయలు..." అన్నాను.

"ఆ! ఎక్కడివి?"

"ఆ చిత్రానికి...ఒకరు...ఇచ్చారు" అన్నాను.

రవి మండిపోయాడు: "ఒసే రాక్షసీ!...నా భార్యను అమ్మివేశావా? ఎవరువాడు...వాడిని చిత్రవధచేస్తాను. నా సౌందర్యాధిదేవతకి...ఒకధరా? ఛీ ఛీ నీచురాలా!...అసలు నీకు దాని నమ్మడానికి చేతు లెలావచ్చాయి" అని రవి రౌద్రాకారంతో అరుస్తూ కనిపిన్నవాట్లన్నీ ఇష్టమొచ్చినట్లు గదంతా విసిరేశాడు.

అమితమైనభయంతో నేను గట్టిగా అరిచాను. ఆఅరుపు విని చుట్టుప్రక్కలవాళ్ళంతా వచ్చారు. రవి యింకా "నారాణి, నా సౌందర్యం...నా చిత్రం అంటూ అరుస్తూంటే వాళ్లు అతన్ని పట్టుకున్నారు. అంతే ... అప్పటినుంచీ ... నా రవికి ... నేను నా సర్వస్వము...అనుకున్న రవికి, పిచ్చాసపత్రి శరణ్యమైంది. నేను చేసిన పనికి ఎంత విచారిస్తే ఏం లాభం చేతులారా... నేనే...నా జీవితాన్ని పాడుచేసుకున్నాను. నారవిని పోగొట్టుకున్నాను. గుప్తంగా ఉన్న నా సౌందర్యాన్ని చిత్రించమని అతన్ని ఎందుకు బాధించానాఅని అహోరాత్రాలుఏడ్చాను. హాస్పిటల్ నివాసం ఆ సుకుమార దేహం భరించలేకపోయింది. నిరంతరమూ ఆ చిత్రాన్నిగురించి కలవరించేవాడు. గోలగా కేకలువేసేవాడు. ఒకరోజున అతనికి తీవ్రంగా జ్వరంవచ్చింది. నేను...అతని ప్రక్కనే కూర్చుని... పాలు పట్టిస్తున్నాను...

"శారదా" ... అన్నాడు-అలా పిలిచి ఎన్నాళ్ళయింది!

అతని వైపు ఆశగా చూశాను. దీనంగా ఉంది అతని ముఖం. ఒకనాడు ఎంతో సౌందర్యంతో వెలిగిపోయిన ఆ ముఖం...అప్పుడు...ఎంతో దీనంగా... మాసిపోయిన గడ్డంతో ఉంది. నాగుండె తరుక్కుపోయింది. కన్నీళ్లు ఆపుకోలేకపోయాను -- అతను నూతిలోనుంచిలా మంద్రస్వరంలో:

"నీ సౌందర్యాన్ని చిత్రించమని ఎంత కష్టిగావు శారదా!...ఎంతో శ్రమించి ... రేయింబవళ్లు కృషి చేసి...చిత్రిస్తే...దాన్నెందుకు నానుంచి.. దూరం చేశావు?..."

"నన్ను...క్షమించండి...క్షమించరూ?...మీ పాదాలు పట్టుకుంటాను ... క్షమించరూ?... మీకు త్వరగా బాగవుతే.. చాలు" అన్నాను ఉద్వేగంతో.

"అహ్హాహ్హా...శారదా...పిచ్చిశారదా...ఇంకా నాకక్కడేముంది...అదో...చూడు...ఆ సౌందర్యలోకం...అక్కడినుంచి...నాకు పిలుపువచ్చింది... వెళ్ళిపోతా...వెళ్ళిపోతా...మళ్ళీ అక్కడ కలుసుకుందాంలే...ఏమనుకోకు...నిన్ను వదలిపెట్టి ముందు వెళ్తున్నందుకు!... శారదా!...భగవాన్!..." అంటూ కళ్ళుమూశాడు. అంతే! నా జీవనజ్యోతి ఆరిపోయింది. లతకి ఆశ్రయమిచ్చిన మహావృక్షం కూలిపోయింది.

ఆయన్ని ఆ సౌందర్యలోకంలో కలుసుకునే ఆ శుభసమయాన్ని నాకు భగవంతుడెప్పుడు ప్రసాదించుతాడో!...కాచుకుని ఉన్నాను.

# విచిత్ర ప్రసవము

## శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఇటీవల వార్తాపత్రికలలో ప్రకటించబడిన వింత వార్త నొకదానిని పాఠక మహాశయులు గమనించి యుందురు. పూర్వ సముద్రతీరమందలి పుదుచ్చేరి పట్టణ సమీపమున, కోసపాళెయమను గ్రామమునందలి శ్రీ రాధ అను గృహస్థునిభార్య శ్రీమతి కమలమ్మకు ఈలోగా పురుడువచ్చినది. ఆ కుటుంబినికి ఇది అష్టమ గర్భమట? శ్రీకృష్ణజననమువలన దేవకీవసుదేవులకు సంభవించిన తొందరలను స్మరించుటచే కాబోలు, ఎనిమిదవ మారు కలిగినప్పుడు, సాధారణముగా, దానిలో ఏదో వైశిష్ట్యము ఉండునని గర్భిణులు మనదేశమున కొంతభయపడుట వాడుక. ఈ దుర్ముఖ సంవత్సర మార్గశీర్ష కృష్ణద్వాదశీ శుక్రవారమునాడు, అనూరాధా నక్షత్రమున, (1956, డిశెంబరు, 28 వ తేదీన) రాత్రి రమారమి 1-30 గంటల కాలములో ఆ ఇల్లాలు ప్రసవించినది. ఆ ప్రసవములో, అత్యాశ్చర్యకరముగా, ఒకరివెనుక నొకరుగా, వెనువెంటనే అయిదుగురు స్త్రీ శిశువులు జనించిరట! ఆ శిశువులందరు బాగుగా పెరిగి, శేరిఅయిదుపౌనులు తూకముతో, ఆరోగ్యముగా నుండిరట! ఆ కుటుంబిని ఆరోగ్యముతో సుఖముగ నున్నది. ఖండాంతరములలో ఇట్టివింతలు అపుడపుడు వినవచ్చుచున్నవి. కాని, మన భారతదేశములో పంచ శిశు ప్రసవములు లోగడ మనము విన్నవి కావు. కాని, మూడవదినమున ఒకశిశువు, మరుసటదినమున (1-1-1957) మరి ఇగువురు, జీవితమును చాలించుకొనిరని తరువాతివార్తలు చెప్పుచున్నవి. దైవచిత్రము!

జ్యోతిశ్శాస్త్రదృష్టిలో ఈ విచిత్ర సంఘటనకు గొప్పవిలువకలదు. అనగా, పరిశోధనదృష్టిగల విద్యార్థుల కనుట. తాత్కాలిక గ్రహభావాదిస్థితి ఎట్టిదో, ఈ అపూర్వ ప్రసవమును అది ఎట్లు సూచింపగలదో, అందలి వైశిష్ట్యమేమో, గమనించుటకై ప్రయత్నింతము.

ఉపదిష్టమైన ప్రసవకాలము (1-30 A. M.) నిష్కర్షగా స్పష్టకాలమనలేము—జన్మకాల శోధన పద్ధతుల నుపయోగించి స్పష్టపరచినచో, 1-33-14 (A. M.) (I. S. T.) శుద్ధకాలమని ఏర్పడగలదు. వ్యత్యాసము అతిస్వల్పమగుటచే, దీనిలో అసంభవము చూపట్టదు.

ఈ కాలమునకు గుణించిన సాయనకుండలి ఈ క్రింద నున్నది.

| | | | |
|---|---|---|---|
| | కు 11-54 | కే 26-53 | |
| | జన్మకుండలి<br>—<br>[సాయనము]<br>... | | X 25-52 |
| బు 26-18<br>రవి 7-6 | | | వరుణ 6-4<br>(వ) |
| శు 11-16<br>శ 8-57<br>చ 0-20 | ఇంద్ర 2-18<br>రా 26-53 | గు 1-15<br>I 27-38 | |

ద్విస్వభావరాసులలో మిథున, ధను, మీనములు, గ్రహములలో బుధుడు, ఇట్టి జన్మముల విషయములో ప్రాధాన్యము వహించుననుట జ్యోతిశ్శాస్త్ర మర్యాద. ఈ కుండలిలో, చంద్ర, శని, శుక్రులు ధనుస్సులో నున్నారు. లగ్నము తులారాశిలోని మిథునాంశలో నున్నది. ఇతర గ్రహములలో, రవి మీననవాంశలో, శని మిథుననవాంశలో నుండుట, ఈ కారణములకు తోడు లగ్నముపై గల బుధ కేంద్రదృష్టిని చేర్చినచో, ఒక విధముగా కార్యకారణ సమన్వయము చేయవచ్చుననుకొందును. కాని, ఇంచుక విమర్శించితిమేని, ఇంతటి స్వల్పసామగ్రి ఆ దినమునందే ఎన్నియో వేళలలో సిద్ధముగ నుండునని సులభముగా గ్రహింపగల్గు

దుము. అంత ఏల? లగ్నము సయితము ద్విస్వభావ రాశిలోనే, అందులో ద్విస్వభావ నవాంశయందే, ఉండగల కాలము ఇంతకంటే అధికముగా ఇట్టి ప్రసవములకు అనుకూలముగా నుండునుగదా? అట్టి నవాంశలు 12 కలవు. వానిలో కన్యా నవాంశలు వదలినా, మిగిలిన 9 టిలో ఆనాడు అథమపక్షము 5000 శిశువులు జనించియుండగలరు. దినమున సరాసరి అరువది వేల శిశు జననములు కలుగుచున్నవని గణితశాస్త్రవేత్తలు అంచనా వేసియుండుట సుప్రసిద్ధ విషయము కదా? అగుటచే, అయిదు వేల శిశువులకు పై యోగము అన్వయించవచ్చును. అనగా, వేయిమంది స్త్రీలు ఆనాడు ఇట్టి శిశు పంచక ప్రసవ మహోత్సవమును అనుభవించి యుండవలయుననుట! ఇది అసంభవమని వేరుగా విన్నవించుట అనవసరము. ఖండాంతరములలోనైనా, ఇన్ని వింత జననములు సంభవించియుండినచో, కొన్నింటినైనా వార్తాపత్రికలలో ప్రకటించి యుండకపోరు.

పోనిండు. కవల జన్మమునకు కాని, బహు శిశు ప్రసవమునకు కాని, కారణములను సూచించు గ్రహసంపత్తి ఆధానకాలములో చూపట్టవలయునే కాని, జన్మకాలములో కాదు. ఇట్టి జననములను సూచించు యోగము లన్నియు, ఆధానకాలపు గ్రహస్థితికి సంబంధించినవేయని 'సారావళి' మున్నగు గ్రంథములు చెప్పుచున్నవి. కనుక, ప్రశంసలోనున్న ప్రసవమునకు ఆధానకాలమును సాధించవలసియున్నది.

జన్మకాలమునుండి ఆధానకాలమును సాధించు పద్ధతి యొకటి 'బృహత్ పరాశర హోరాసారము' అను గ్రంథములో చెప్పబడియున్నది.

"యస్మిన్ భావే భావవిస్థః,
తస్య మాందే ర్యదంతరం,
లగ్న భాగ్యాంతరం యోజ్యం,
యచ్చ రాశ్యాది జాయతే."

"మాసాది స్త నిమ్మితం జ్ఞేయం,
జన్మతః ప్రాక్ని షేకజం.
యద్యద్ద్ద్రుక్ష్య దశాంగేశః,
తదేందో ర్భుక్తభాగయుక్."

"తత్కాలే సాధయే ల్లగ్నం,
శోధయే ద్ద్వాదశ త్రిశః"

ఇవి అందలి ముఖ్యసూత్రములు.

ఈపద్ధతియొక్క ప్రయోగ రహస్యము అగమ్యగోచరముగ నున్నది. ప్రాచీన సంప్రదాయజ్ఞులగు పండితు లెవరైనా, ఈ రహస్యమును విద్యార్థుల ఉపయోగముకొరకై ప్రకటించగలరను గంపెడాసతో, 1945 వ సంవత్సరమున 'భారతి'లో విన్నవించుకొంటిని.* నా ప్రార్థనము నేటిదాక సఫలము కాలేదని తెలుపుటకు విచారమగుచున్నది.

సమరసింహుడను హోరాశాస్త్ర నిపుణుడు రచించిన 'మనుష్యజాతక'మను ప్రాచీనగ్రంథములో యవనసంప్రదాయమునుండి స్వీకరించిన పద్ధతి యొకటి క్లుప్తముగా నిర్వచించబడి యున్నది. ఇట్టి అంశము నే పాశ్చాత్యశాస్త్రవేత్తలు చర్చించి, విపుల పరిశోధనలతో విమర్శించి, అనుభవములవలన కను గొన్న విషయములను క్రోడీకరించి, సమగ్రమయిన పద్ధతి నొక్కదానిని సాధించి వ్యాప్తికి తెచ్చియున్నారు. దీని ననుసరించి సాధించగల కాలమునకు "ప్రినేటల్ ఎపోక్" (Pre-natal Epoch) అని వారు వ్యవహరించుచున్నారు. లగ్నశోధనమునకు, జాతకఫల సమన్వయమునకు సహా, ఈపద్ధతి ఎంతో ఉపయోగపడుచున్నది.

పై సంప్రదాయమున ప్రశంసలో నున్న జన్మములకు కారణమైన ఆధానము 1956, మార్చినెల 27 వ తేదీనాడు 8—54 A. m. (G. M. T.) కాలములో జరిగియుండవలెనని తేలుచున్నది. అనగా, మొత్తపు గర్భకాలము 277 దినములగును. పది నాక్షత్ర మాసములు, లేక తొమ్మిది సౌరమాసములు, కడచిన తరువాత నాల్గుదినములకు ప్రసవము జరిగినదనుట. ఇది, సాధారణముగా, యుక్తకాలమే. కాని, కడపటి శిశువు ఏకాలమునకు ప్రసవమైనదో, తెలియదు. శిశువులందరు వరుసగా వెనువెంటనే జనించిరని వింటిమి. కనుక, ఈజననములన్నియు రమారమి 15 నిమిషముల కాలములోనే జరిగియుండునని మనము భావించుట నిర్హేతుకముగా నుండదు. ఈ సమన్వయమును ఆధారముగా గ్రహించినచో, ఈశిశువులందరికిని ఆధానకాలమొక్కటే అనియు, ఒకటే క్షణమునందు

(*)తారణ సంవత్సర మాఘమాసపు 'భారతి' సంచికలో 184 వ పుట చూడుడు.

అయిదు విధములుగా జరిగిన శుక్రశోణిత సంయోగపు ఫలముగా ఆధానములు జరిగియుండుననియు, ఏర్పడు చున్నది.

పైన చెప్పిన కాలమునకు సరి అయిన స్థానిక మధ్యమ కాలము 9-18'-12'' A. M. (L. M. T.) అగును. ఇది సంభవమా అని శంకించువారుందురు. నిషేకక్షణము వేరు, ఆధాన కాలము వేరు. ఈ రెండింటికి కొంత కాలవ్యవధియుండుట అసంభవము కాదు. ప్రశంసలో నుండునది ఆధానకాలము. అప్పటికి సాధించిన సాయనకుండలి ఇదే:

| | | | |
|---|---|---|---|
| బు 27-55 | ర 7-8 | శు 22-9 | I 0-20<br>కే 11-30 |
| X 21-16 | ఆధానకాల<br>కుండలి<br>—<br>[సాయనము] | | వరుణ 28-15 |
| కు 18-18 | | | గు 22-9<br>(వ) |
| రా 11-30<br>శ 2-36<br>(వ) | చ 27-33<br>ఇంద్ర 29-39<br>(వ) | | V 24-17 |

ఇపుడు ఆధానలగ్నము ద్విస్వభావరాశి మిథున మైనది. లగ్నాధిపతి బుధుడు మరియొక ద్విస్వభావ రాశియగు మీనములో, అందులో మీననవాంశయందే నిలిచియున్నాడు. నవమదశమాధిపతి అగుటచే యోగ ప్రదుడైన శని వేరొక ద్విస్వభావరాశియగు ధనస్సును చేరుకొన్నాడు. ఈ శనికిని, లగ్నమునకుసహా, తోడుగానున్న ఛాయాగ్రహములు (రాహుకేతువులు) సైతము ద్విస్వభావ రాసులలోనే. ఇంతే కాదు. శని, శుక్ర, గురువులు తప్ప ఇతర గ్రహములన్నియు ద్విస్వభావరాసులగు మిథున మీనములలో ఏదోయొకదానిని నవాంశలో ఆశ్రయించియుండుట గొప్ప విశేషము. అనేక శిశు ప్రసవములకు కారకుడగు బుధుడు వర్గోత్తమాంశలో నుండి, లగ్నమును కటాక్షించుచున్నాడు. ఈ కుండలిలో, లగ్నాధిపత్యము మాత్రమే కాక, పంచమ (సంతాన) స్థానాధిపత్యము సయితము ఈ బుధుడికే సంక్రమించుట మరింత విశేషము. బహు శిశుప్రసవమునకు కారణమైన ఆధానము జరుగుటకు అప్పటి ఖగోళ స్థితి ముఖ్య హేతువని మనము సులభముగా విశ్వసించ వచ్చును.

మరియొక్క విశేషము చిత్తగింపుడు. గర్భోత్పత్తి హేతువులగు శుక్రశోణితముల స్వభావమును సూచించు 'బీజము' 'రక్తము' అను బిందువులు కలవు. శుక్రరవులయొక్కయు, కుజచంద్రులయొక్కయు, స్థానములకు సంతానకారకుడగు బృహస్పతి తోడి సంబంధము ననుసరించి ఈ బిందువులు ఏర్పడుచున్నవి. ఆధాన కాలపు కుండలిలో 'బీజము' తులారాశి 21°-26' లో, 'రక్తము' మకరములో 8°-0' లో, ఉన్నవి. బీజాధిపతి శుక్రునికి స్వక్షేత్రబలమున్నది. అభివృద్ధి కారకుడగు బృహస్పతినుండియు, సత్త్వకారకుడగు ప్రబల (ఉచ్చ) కుజునినుండియు, ఈ శుక్రునిపై దృష్టి కలదు. ఇట్టిశుక్రుడు కళకళలాడుచు లగ్నములో ఉదయోన్ముఖుడై యుండుటచే, ఈ బిందువు ప్రభావ సంపన్నమైనది. ఈ గురుశుక్రుల మధ్యమందే రక్త బిందువు ఉన్నదని చదువరులు కనుగొనియే యుందురు. ఇట్టి సౌభాగ్యముతో ఈ బిందువు శిశుబాహుళ్యమును సూచించు మీననవాంశలోనుండుట గమనించదగినది. కలిగిన ఫలమునకు ఈ బిందువుల స్థితి ఎంతో రమ్యముగా తగియున్నది కదా? ఈ బిందుద్వయము సూచించు శుక్రశోణితముల సంయోగమునకు ఆవశ్యకమైన పరస్పరాకర్షణశక్తి ఈ బిందువుల మధ్యప్రదేశమునందు కేంద్రీకృతముగా నుండుట అస్వాభావికము కాదు. అట్టి కేంద్రస్థానము సంతాన బాహుళ్యమునకు పేరుమోసిన వృశ్చికరాశిలో 29°-43' లో నున్నది. అందులోనూ, మీననవాంశం పైగా, బుధ వరుణుల పరిపూర్ణ త్రికోణదృష్టి! ఆ బుధుడో, శిశుబాహుళ్యకారకుడు; వరుణుడు అఘటనఘటనాచాతుర్యముగల గ్రహము. ఈ ఇరువురు మీననవాంశములోనే నిలిచియుండుట! ప్రశంసలోనున్న ఆధానమునకు ఈ బిందుధర్మము వ్యాపించుట న్యాయముకదా?

సరేకాని, ఈ ఆధానచక్రము కవలపిల్లలను తెలుపకూడదా? శిశుత్రయమును సూచించరాదా? అట్లు కాక, ఐదుగురు శిశువులకు ఆధానము జరిగినదను సూచన దీనిలో ఎచటనున్నది? అను ప్రశ్న రావచ్చును.

చాలాసమంజసమైనదే ఈప్రశ్న. ప్రత్యుత్తరమిచ్చుట సులభముకాదు. తగిన సమాధానము ఈ కుండలియందే లభించవలయునని నాహృదయము చెప్పుచున్నది. కాని అది స్ఫురించలేదు. ఒక్కఊహ. ఈ కుండలిలో సంతాన (పంచమ) భావము కన్యారాశిలో సింహ నవాంశలోనున్నదికదా! భచక్రములో సింహము ఐదవ రాశి అగుటచే, ఆసంఖ్యయొక్క ప్రభావము ఆధానమునకు వ్యాపించెనేమో? అవుననుటకు ధైర్యముచాలదు; మరి, కాదనుటకు మనస్సురాదుకూడ. రాశిచక్రమందలి 360 భాగలలో ఒక్కొక్కదానిలో ఒక్క విశిష్ట ధర్మమున్నదని పాశ్చాత్యపండితులు కొందరు నిర్వచించియున్నారు. మారిస్ వెమిస్ పండితుని మతమున, కన్యారాశిలో 25 వ భాగకు 'బహుత్వము' (plurality) అను ధర్మమున్నది. ఈకుండలిలో పంచమభావ మధ్యబిందువు నికరముగా ఆ విశిష్టభాగలోనే ఉన్నదనుట ఈ ఆధానకాలపు విశేషము. మరియు, ఈరక్తబీజ మధ్యకేంద్రమునకు శనిసంయోగము, బుధ వరుణుల త్రికోణదృష్టి, శుక్ర, గురువుల కేంద్రవీక్షణము, కలవని గమనించితిమేని, మనప్రశ్నకు సదుత్తరము లభించినదనవచ్చును. ఆబిందువుల పరస్పరాకర్షణము ఈ గ్రహపంచక ప్రభావముతో జరిగెను. కనుక పంచశిశు ప్రసవము కలిగినది. ప్రకృత మింతటితో తృప్తిచెందుదము గాక.

ఆధానకాలములో చంద్రుడు స్త్రీలింగజ్యోతిక ఖగోళభాగలోనుండి, నిర్లింగప్రదేశములోనున్న లగ్నములో స్త్రీగ్రహము శుక్రుడు ఉదయించుచున్న కారణమున, అందరు స్త్రీ శిశువులే జనించిరి. ఆధానకాలమున లగ్న చంద్ర స్థానములనుండి లింగ నిర్ణయము కావలయుననుట ఈ పద్ధతిలోని ముఖ్య సూత్రములలో నొక్కటి. వసంత విషువద్బిందువునుండి 28 తారా ప్రదేశములుగా భచక్రమును విభజించు సంప్రదాయముపైన ఆధారపడినదే ఈ లింగవిభాగము. అది యట్లుండె.

ఈ చక్రములో చంద్రునిస్థితి శుభకరముగాలేదు. గండసంధిలోనున్న విప్లవకారియగు వరుణ మహాశయుని క్రూరదృష్టిపాతమునకు చిక్కి, మాయలమారి ఇంద్రుని సంయోగమును ఆత్రముతో అభిలషించుచు ఈ చంద్రుడు ఆరవభావములోనుండి బాలారిష్టమును సూచించుట విషాదకరము. లగ్నముపైన శనికిగల ప్రబల సమసప్తక విషమదృష్టి రూపమగు దైవ దుర్విపాకము సయితము శిశువులకు ఆరోగ్యభంగమును తెలుపజాలినదే.

ఈ ఆధాన చక్రమునకు 31-12-1956 నాటికి దైనిక జాతకమును సాధించినచో, దైనిక లగ్నము కుంభరాశిలో 22½ భాగలో రాగలదు. అనగా, ఆధానకాలములో అష్టమ (మృత్యు) భావాధిపతియగు బృహస్పతి స్థానమునకు ఒక రకముగా ఎదుట (సమసప్తకముగా) నిలిచినదనుట! మృత్యుదేవతను ఆహ్వానించుటయే ఇది. ఆ కాలములోనే ముగ్గురు శిశువులు మృత్యువువాతబడినారని విన్నాము. సాధించిన ఆధానకాలము సాధువనుటకిది యొక్క తార్కాణ.

ఇంత చాలును. కాని, నిరయనపద్ధతిలో సాధించిన గ్రహాదులనుండియే ఫలముల నూహించుట సహేతుకమనియు, సశాస్త్రీయమనియు, విశ్వసించువారు మన జ్యోతిశ్శాస్త్రవేత్తలలోనే పలువురున్నారు గదా! వారి సౌకర్యార్థమై, నిరయన జన్మకుండలి ఈ క్రింద చూపితిని.

కాని, ఇప్పటికి అయనాంశలిన్ని అను విషయమున నిరయనవాదులలో ఐకమత్యము కుదరలేదనుట అందరు ఎరుగుదురు. ఎన్నటికైనా, ఇది సర్వసమ్మతముగా, నిర్ణయము కాగలదో, లేదో, ఆ భగవంతునికే ఎరుక. కేతకీ 'జ్యోతిర్గణిత' గ్రంథానుసారముగా, ఈ జన్మకాలమునకు 23 భాగలు, 14 కళలు, అయనచలనమని ఏర్పడును. ఈ అయనాంశలను సాయన స్థానములలో తీసివేసి, ఈ క్రింది నిరయనకుండలి సాధించ

| | | | |
|---|---|---|---|
| కు 18-40 | · | కే 3-39 | |
| | (నిరయన) — జన్మకుండలి — | | X 12-38<br>వ 12-48 |
| బు 2-59 | | | |
| ర 18-20 | రా 8-39<br>చ 6-34<br>శ 15-48<br>శు 18-2 | I 4-19<br>ఇ 8-27 | గు 7-29 |

# విచిత్ర ప్రసవము

బడినది. వేరు వేరు అయనాంశలను ఉపయోగించువారు తగిన మార్పులు చేసుకోవలసి యుండునని మనవి.

బహు శిశుప్రసవమును సూచించు ప్రబలయోగము లేమియు నాకిందు కానరావు. జన్మచక్రమునుబట్టి, అట్టి యోగము లిచట చూపట్టుట, నా దృష్టిలో అనవసరమే. పాఠక మహాశయులు సయితము పరిశీలింతురు గాక.

వాడుకలోనున్న పద్ధతితో, చంద్రనక్షత్రమునకు వింశోత్తర (ఉడు) దశను గుణించినచో, జన్మకాల శని మహాదశాశేషము 14 సం॥ 4 నెలలు, 21 దినములగును. బుధాంతరములో, రాహువుయొక్క విదశలో ఈ ప్రసవము కలుగుట. ఈ దశల కధిపతులగు శని, బుధ, రాహువులలో ఒక గ్రహమైనా, ద్విస్వభావరాసులలో కాని, కనీసము ద్విస్వభావ నవాంశలలో కాని లేకుండుట వింతగా చూపట్టుచున్నది. కాని, వేరు అయనాంశల నుపయోగించువారికి దశాశేషము భిన్నముగా వచ్చును కదా! అయనాంశలలో ఒక్కకల మార్చినచో, ఈ దశాశేషములో 8¼ దినములు భేదము వచ్చుటంజేసి, భిన్నసంప్రదాయములవారిగణితములో అంతర్దశా, విదశలు విశేషముగా మార్పుచెందగలవు. ఇప్పటి నిరయన పద్ధతిలో ఇదియొప్ప అవ్యవస్థ.

అదియట్లుండె. ఈ జాతకమునకు పాశ్చాత్యపద్ధతి నుపయోగించి ఆధానకాలమును సాధింపజూచుట హాస్యాస్పదము. ఆపద్ధతి రాశిచక్రముపై నాధారపడినది కాని, జ్యోతిశ్చక్రములపై కాదు. ప్రాచీన సంప్రదాయములో ఆధానకాల సాధనము జ్యోతిశ్చక్రముపై నాధారపడినదని భావించువారు దానిననుసరించి ఆధానకాలనిర్ణయ మొనరించినచో, అంచలి గ్రహస్థితిలో యోగములు తగినవి కలవేమో, పరిశీలించవచ్చును. ప్రాచీన సంప్రదాయవేత్తలు ఇది సాధించవలసి యున్నది. వారి అనుగ్రహముకొరకై మనము వేచి యుందముగాక.

ఒక్కమాట. మునుపటికాలములో మూడు తొమ్మిదులని, గజగర్భమని, వ్యవహరించబడుచుండిన దీర్ఘకాల ప్రసవములు ఉండెడివట! ప్రాచీన వైద్య, జ్యోతిష, గ్రంథములలో వానికి సూచనలు కలవు. కాని, ఇప్పటికాలమున మనకు అట్టి విచిత్రములు కానరాకున్నవి. అంతేకాదు. అట్టిప్రసవములు అసహజములని, అసంబద్ధములని, అభిప్రాయపడుట ఇప్పటివాడుక. పోగా, రానురాను, బహు శిశుప్రసవముల సంఖ్యమాత్రము హెచ్చుచున్నట్లు క్రమక్రమముగా చూపట్టుచున్నది. సృష్టిలో, ఈ మార్పునకు హేతువేమో? ప్రపంచహితమునకై ప్రజాబాహుళ్యమును తగ్గించగోరు రాజనీతి విద్యావిశారదుల ఉపదేశముల మూలముగానేమి, హితకాంక్షులగు పాశ్చాత్య వైద్య విద్యాప్రవీణుల సలహావలననేమి, ఆధునిక నవనాగరక తరుణీతరుణులు కొందరు స్వభావవిరుద్ధములు, ధర్మదూరములునగు కృత్రిమోపాయములవలన సంతాన నిరోధమును సాధించుచుండుటచే, యుక్తికి ప్రతియుక్తిగా, సృష్టికర్త ఇట్టి బహుశిశుప్రసవములకు హెచ్చుగా ఇపుడు అవకాశమును కలిగించు వాతావరణమును సృజించినాడు కాబోలు! ఏల కారాదు? మొదటి ప్రపంచ సంగ్రామమువలని ఘోరపరిణామపు ఫలముగా, యూరోపుఖండమందలి జర్మనీదేశమున పురుషులసంఖ్య అపరిమితముగా తగ్గిపోయినదికదా? ఈలోటు పూర్తియగుదాక, తరువాతి కొన్ని సంవత్సరముల కాలము, ఆదేశములో కలిగిన ప్రసవములలో, సరాసరి, ఒక స్త్రీశిశుజననమునకు అయిదుగురు వంతున పురుషశిశువులు పుట్టుచుండిరని వింటిమి. సృష్టికర్తయొక్క మహత్తరశక్తిముందు మన కొంటె యుక్తు లెందుకు పనికివచ్చును?

"ఈశ్వరో రక్షతు."

---

# కలగూరగంప

## నాట్యధర్మి

### శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

లోకధర్మి, నాట్యధర్మి అను రెండు ధర్మములు గలవని నాట్యశాస్త్రమున భరతుడు చెప్పినాడు. ఈ ధర్మములు లోకస్వభావము ననువర్తింప జేయునవి. లోకశబ్దమునకు జనపదములందు నివసించు ప్రజలు అని అర్థము చెప్పవలెను. ఈ ప్రజల ప్రవృత్తులకు యోగ్యములగు వాచికాహార్యాది విషయములను చెప్పు ప్రసంగమున లోక, నాట్య ధర్మముల విచారణను భరతుడు గావించెను.

లౌకికధర్మమునకు వ్యతిరేకమైన ధర్మము నాట్యమున కన్పించ వీలులేదని భరతుని ప్రధాన సిద్ధాంతము. ఈ సిద్ధాంతమే అరిస్టాటిల్ లోగూడ కన్పించును. ఈ లోకగతమగు ప్రక్రియాక్రమము కవి, నట వ్యాపారమున వైచిత్ర్యమునందుచు రంజనాధిక్యప్రాధాన్యము నందగా రూపకమున నాట్యధర్మి కలదని యనుచున్నాము.

స్వభావభావోపగతం శుద్ధం తు వికృతం తథా
లోకవార్తాక్రియోపేత మఙ్గలీలా వివర్జితమ్
స్వభావాభినయోపేతం నానాస్త్రీ
పురుషాశ్రయమ్
యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు
సా స్మృతా.

అని భరతుడు ముందు లోకధర్మిని వివరించెను. స్వాభావికముగానున్న స్థాయి సంచారిభావాదిభావములతో నున్నది, శుద్ధము, స్వవికల్పితవ్యామిశ్రితము, లోకప్రసిద్ధమగు వ్యవహారముచే సుద్ధము, వర్తనాద్యంగలీలారహితము, స్వాభావికమగు బలపతనప్రహారాద్యభినయములతో గూడినది, నానాస్త్రీపురుషాశ్రయము నైన నాట్యమున లోకధర్మి కన్పించును.

యథావృత్తవస్తుమాత్రము కవి వర్ణించగా, నటుడు ప్రయోగించగా లోకధర్మి ప్రతీతమగును. ఇట్టి ప్రయోగమున భావనావ్యాపారముగాని, రంజనావైచిత్ర్యముగాని కన్పించవు. కాని ఇచట లోకధర్మాశ్రయత్వ ముండుటచే నిది లోకధర్మి యనబడుచున్నది.

అతివాక్య క్రియోపేత మతిసత్త్వాతిభావకమ్
లీలాఙ్గహారాభినయం నాట్యలక్షణ లక్షితమ్
స్వరాలఙ్కార సంయుక్త మస్వస్థ పురుషాశ్రయమ్
యదీదృశం భవేన్నాట్యం నాట్యధర్మీ తు సా
స్మృతా.

అని తర్వాత నాట్యధర్మి చెప్పబడినది. ఇతిహాసాది వాక్య విలక్షణముగా గావించబడు ఈ చితరంజకేతివృత్తికల్పనాత్మకమగు క్రియ ఇచట కన్పడును. స్వాభావికచిత్తవృత్తికి విలక్షణమగు కవికల్పితచిత్తవృత్త్యంతరముతో గూడినది, శోభా ప్రధానముగా మనోహరములగు అంగహారములతో గూడిన అభినయము, నాట్యలక్షణలక్షితమగు ప్రయోగము, స్వరాలంకార సంయోజనతో గూడినది, స్త్రీపురుషాన్యోన్యవిభావాత్మకమునై కన్పించునది నాట్యధర్మి.

లోకే య దభియోజ్యంచ పద మత్రోపయుజ్యతే
మూర్తిమత్సాభిభావంచ నాట్యధర్మీ తు సా
స్మృతా.
ఆసన్నోక్తం చ యద్వాక్యం నశృణ్వంతి పరస్పరమ్
అనుక్తం శ్రూయతే యచ్చ నాట్యధర్మీ తు సా
స్మృతా.
శైలయాన విమానాని చర్మవర్మాయుధ ధ్వజాః
మూర్తిమంతః ప్రయుజ్యంతే నాట్యధర్మీ తు సా
స్మృతా

లోకమున గర్హింపతగిన విషయమును పదమాత్రమున తెలియజేయునది, లోకమున శిల్పకల్పనా కలితమైన విషయమునుగూడ మూర్తిసంపాదనవశమున ప్రయోగయోగ్యముగా జేయునది నాట్యధర్మి. దగ్గరగా నున్న ఒకపాత్ర జనాంతికముగా పలుకు వాక్యమును రెండవపాత్ర వినజాలకపోవుట, ఆకాశభాషణాదికమున అనుక్తమగు వాక్యమును వినగల్గుట నాట్యధర్మిలో కన్పించగలవు. శైలము, యానము, విమానము చర్మవర్మాయుధధ్వజములు సాక్షాత్తుగా కన్పించకపోయినను, రూపవంతములుగా భావించునట్లు నాట్య

ధర్మియం దభినయింపబడుచున్నవి. దారువస్త్ర చిత్రాది రూపములతో ఖేటకాదులు అభినేయములు కాగలవని భావము.

లలితై రఙ్గవిన్యాసై స్తథోత్క్షిప్తపదక్రమైః
నృత్యతే గమ్యతే చాపి నాట్యధర్మీతు సా స్మృతా.
యోఽయంస్వభావో లోకస్య సుఖదుఃఖ
క్రియాత్మకః
సోఽఙ్గాభినయసంయుక్తో నాట్యధర్మీ ప్రకీర్తితా.
యశ్చ కక్ష్యా విభాగోఽయం నానావిధిసమాశ్రితః
రఙ్గపీఠ గతః ప్రోక్తో నాట్యధర్మీ తు సా భవేత్.

ఆవేష్టితాది చతుర్విధకరణములలో స్వీకరింపబడిన వర్తనాదులయందు వ్యాపృతములైన లలితాంగ విన్యాసములతో, చతుస్తాలాద్యుత్క్షిప్తములగు పద పరిక్రమములతో పోవుచున్నట్లు, నర్తించుచున్నట్లు నటీనటులను భాసింపజేయునది నాట్యధర్మి. ఏతత్ప్రాణితమగు నాట్యము సుఖదుఃఖక్రియాత్మకమగు లోకస్వభావము నంగాభినయసంయుక్తముగా జూపగా నాట్యధర్మి సంవలితమగుచున్నది. అంగాభినయమనగా లోద్యాదికముతో కూడిన అభినయమని అర్థము. ఈ అభినయము లోకస్వభావమును తెలుపునది. కాగా లోకస్వభావత్వము, అనుభావవిలాసోపేతత్వము అనునవి నాట్యధర్మివిధాయకము లగుచున్నవి.

నాట్యధర్మి సర్వాభినయ ప్రకాశసారము. నానావిధసమాశ్రితమగు కక్ష్యావిభాగమున, రంగపీఠగతమై అభినేయమగునదియే నాట్యధర్మి యని ఇంతటితో స్పష్టమగుచున్నది.

నాట్యధర్మీ ప్రవృత్తం హి సదా నాట్యం
ప్రయోజయేత్
నహ్యఙ్గాభినయాత్కిఞ్చి దృతే రాగః ప్రవర్తతే.
సర్వస్య సహజో భావః సర్వో హ్యభినయోఽర్థతః
అఙ్గాలఙ్కారచేష్టా తు నాట్యధర్మీ ప్రకీర్తితా.

నాట్యధర్మిప్రవృత్తమగు గతివిశేషముగల నాట్యమునే ఎల్లప్పుడు ప్రయోగించవలెను. గీతాతోద్యంగములు, అభినయవిశేషములు లేనిచో సామాజికులకు ప్రీతిగాని, రసాస్వాదముకాని కలుగజాలదు. కవిగతము, నాట్యగతము, నాగంగాలంకారనిష్ఠము, నాట్యధర్మిరూపము, సర్వప్రాణభూతమునగు ప్రయోగము ప్రయోజనాపేతులో ప్రవర్తించుచున్నది. ఈ ప్రయోజనమును నిర్వర్తింపజేయుటకైనను లోకధర్మి పరిత్యాగము కూడదు. సహజమగు భావాదికముతోనున్న లోకధర్మి పునాదివంటిది. దానిపై అంగాలంకారాత్మకముగా యోజింపబడు అభినయము నాట్యధర్మి నిష్ఠమగుచున్నది.

భరతుడు లోకధర్మి, నాట్యధర్మి అని రెండు విధములుగా ధర్మిని స్వీకరించుచు లౌకికజగత్తుకు, కావ్యజగత్తుకు విశిష్టధర్మ శ్రింఖలమునసాదృశ్యమును ప్రతిపాదించుచున్నాడు. లౌకికధర్మజనితములై తదాశ్రితములైనవి అభినయములు. అనగా నాట్య లోక ధర్ములకు విషయసంపద సమానమే. కాని సూత్రబద్ధమై, అభినయాత్మకమై, సత్త్వగుణోపేతమై యుండునది నాట్యధర్మి. కాగా నాట్యమున లోకస్వభావము పరిష్కరింపబడుటయే గాక, కేవలము సత్త్వగుణాత్మకముగా ప్రదర్శింపబడుచున్నది.

స్వభావసిద్ధమైనది లోకధర్మి. తత్సంస్కారరూపమైనది నాట్యధర్మి. మరణవధాదులు నాట్యమున ప్రదర్శింపబడక, కేవలము సూచింపబడుచున్నవి. అనగా రజస్తమోగుణములు నాట్యమున వినబడినను, సత్త్వమే దర్శనయోగ్యము.

నానాభావసంపన్నము, నానాక్రియాత్మకము నైన బాహ్యజగత్తునకు సత్త్వగుణానుస్యూతమగు ఏకత్వానన్యాశ్రయత్వవైశిష్ట్యమును కూర్చునది కావ్యజగత్తు. బుద్ధీంద్రియ వ్యావృతమైన లోకము కావ్యమున భావనాశ్రితమగుచు పూర్ణతను, శుద్ధతను పొంది లౌకికజగదుత్పాదకహేతు వగుచున్నది. నాట్యధర్మి విశిష్టమైనదగు కావ్యజగత్తు దేశకాలాద్యతీతము.

లోకమున మనము నిత్యము చూచునది, అనుభవించునది లోకధర్మి. కాని నాట్యమున నిదియంతయు ఇముడజాలదు గనుక కొన్ని మార్పు లవసరము. ఈ మార్పులను నాట్యధర్మి యందుము. శబ్దమున, గానమున, వేషమున నాట్యధర్మియొక్క వైశిష్ట్యము గలదు. ఉదారములు, మధురములు నగు శబ్దముల నే కవి ప్రయోగించును. ఈ శబ్దము లర్థముతో ననన్వితములై యుండవలెను. అనగా కవి శబ్దస్వరూపమునుజూచి విభ్రాంతుడై శబ్దముల నుపయోగించరాదు. శబ్దము భావార్థద్యోతకమగునా? కాదా? యని విమర్శించి ప్రయోగించవలెను. అర్థవశానుగమమైన శబ్దము కావలెను. భవభూతి యనినట్లు మహాకవులకు, ఋషులకు "వాచమర్థోఽనుధావతి." నా కేశబ్దము నుపయోగించినను, అది వారి భావవ్యక్తీకరణకు యోగ్యముగా కన్పించును. నిగూఢమగు భావమును చెప్పు శబ్దములు పనికిరావు, శ్రీహర్షాదుల కృతులలోని శైలి, వసుచరిత్రాదులలోని పదవిన్యాసము యోగ్యమైనవికావు. విద్వజ్జనులకు సౌఖ్యమొసగునవి, నృత్యమున శుచితమైనవియు నగు శబ్దములు ప్రయోగింపబడవలెనని భావము. కమండలుధారులైన సన్న్యాసులవద్ద వేశ్య లేవిధముగా రాణించజాలరో, అట్లే శ్లేషయమకానుప్రాసాదులతో నిండిన కావ్యనాటకములు శోభించజాలవు. ఇది శబ్దవిషయిక

మైన నాట్యధర్మి. లోకధర్మికి నియమములు, నిబంధనలు లేవు.

వాచికాభినయమున గల సంగీతమును గమనింతము. ఇది నాట్యధర్మిగా పరిగణింపబడవలెనని స్వరాలంకారములతో కూడియుండవలెను. ఇందలి శబ్దములు పైన చెప్పబడిన నిబంధనలచే నియంత్రితములైయుండక తప్పదు.

ఇక రంగస్థలమున్నది. జీవితములోని సన్నివేశములను కవి గ్రహించుచున్నను, రూపకములలోని పాత్రలు రంగస్థలముననే ప్రదర్శింపబడునవి. ఇందుచే జీవితమున గల రంగస్థలము నాట్యములోనికి అనువదింపబడజాలదు. జీవితమున కన్పడు ఇండ్లు, మేడలు, ప్రయాణములు మొదలగు ముఖ్యసన్నివేశములు రంగస్థలమున చూపబడజాలవు. కావున వీటికి ప్రత్యామ్నాయముగా కొన్ని కల్పించబడుచున్నవి. సుమనస్కులగు ప్రేక్షకులు వీటిని భావించుకొనవలెను. శైలయానము, విమానగమనము, ఉయానప్రవహాగణాగులు, మృతి, నిద్ర మొదలగునవి చూపబడలేకపోవుట నాట్యధర్మిలో విశిష్టముగా గలదు.

తర్వాత వేషము గలదు. వేషభాషాదులద్వారా రంగస్థలమున చూపబడినవి, ప్రేక్షకులు భావించుకొనవలసినవి, తెలిసికొనబడుచున్నవి. ఇట్లే స్వగతాకాశభాషితాదులలోని ప్రవృత్తిని అన్వయించుకొనవలసియున్నది. ఇదియంతయు నాట్యధర్మి.

లౌకికధర్మవ్యతిరేకమైన ధర్మమేమియు నాట్యమున లేదు. కాని లోకములోని ప్రక్రియాక్రమము నధికరంజనాత్మకముగా, విచిత్రముగా, విశిష్టముగా జూపునది నాట్యధర్మి. అనగా లోకానుసరణమును వైచిత్ర్యయోగ్యత్వమున విశిష్టముగా కవి ప్రదర్శించవలెను. స్వభావసిద్ధము, స్వతఃసిద్ధము నగు లోకధర్మిని విశిష్టతతో తెలుపునది నాట్యధర్మి. ఈ వైశిష్ట్యమంగాభినయాశ్రితమై కలదు. కాగా కవికి కావలసిన సాధనసామగ్రి జగత్తులో నున్నదని, జగమున కన్పించు ప్రతివిషయము కావ్యజగమును ప్రవేశించలేదని, కావ్యజగములోనికివచ్చు విషయము విశిష్టముగా పరిణమించునని నిశ్చయించవలెను, ఈ వైశిష్ట్యము భావనానుప్రాణితము. భావనావశమున నాట్యము లౌకికపదార్థములకన్న భిన్నమైనదగును. లౌకికజగమునకు కావ్యజగమనుకృతికాదు, ప్రతిబింబము కాదు, చిత్రీకరణకూడ గాదు. వీటికి ఆరోపాధ్యవసాయ సంబంధము కూడలేదు. కావ్య జగముత్ప్రేక్షితము కాదు, స్వప్నతుల్యమైన అసత్యముకాదు. కావ్యవిశ్వము మాయకాదు, ఇంద్రజాలము కూడ కాదు. సమ్యగ్జ్ఞానాకారమై, విజ్ఞానస్వరూపమై, జ్ఞానాస్వాదనద్వారా సంవిత్సంవేద్యమైన రసప్రాణమగునది కావ్య జగత్తు. నాట్యధర్మిద్వారా దేశకాలప్రమాతృభేదానియంత్రితమైనజగత్తు కావ్యమున ప్రతీయమానమగుచున్నది. కావుననే సర్వశాస్త్రార్థసంపన్నము, సర్వశిల్పప్రవర్తకము నైన నాట్యము ముల్లోకములకు భావానుకీర్తనమై విలసిల్లునదని భరతుడనినాడు. లౌకికజగత్తునకు కావ్యజగమే మూలము. భావనావ్యాపారప్రధానమైన కావ్యజగము బహిర్దృశ్యమాననానాత్వభిన్నత్వముల కేకత్వానన్యత్వముల నాపాదించగలుగుచున్నది. కావ్యజగమును ప్రవేశించి పారిశుద్ధ్యమునందని ఏదియు లౌకికజగములో లేదు గనుక బాహ్యజగత్తుకూడ భావనావిశిష్టమైనపుడే వ్యవహారయోగ్యమగునని తేలుచున్నది. కావ్యజగమున లేని జ్ఞానముకాని, శిల్పముగాని, ప్రవృత్తిగాని లౌకికజగమున లేనేలేవు. యాస్కుడనినట్లు మహాకవి సాక్షాత్కృతధర్ముడు.

ఈ సాక్షాత్కారధర్మావాప్తికి ఆత్మసంస్కారమవసరము. మానసికాభివృద్ధి, నైతికబలము, సంస్కృతి కలిగియున్నపుడే బాహ్యజగమును పరిశీలించి, తదంతర్యామిగా నున్న ధర్మమును కవి సాక్షాత్కారగోచరముగా జేసికొనగలుగును. ఇందుచే నైతరేయబ్రాహ్మణము "దేవశిల్పానుకృతివలననే మానవశిల్పము జనించుచున్న"దని పల్కుచు, "ఈ దేవశిల్పము లాత్మసంస్కృతు" లని, "వీటిచేతనే మన ఆత్మసంస్కరించబడుచున్న" దని చెప్పుచున్నది.

# కవికోకిల విజ్ఞాన బహుమతులు

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

నవ్యాంధ్ర సాహిత్యోద్యమాన్ని వలువైపులా వినబడేటట్లు చేసిన వైతాళికుల్లో దువ్వూరి రామిరెడ్డిగారొకరు. రామిరెడ్డిగారు నూతన భావాలను సహితం తెలుగు జాతీయతతో రంగరించి స్పష్టంగానూ, నిర్దుష్టంగానూ వెలిబుచ్చగలరు. తన భావాలను అక్లిష్టంగా పఠిత కందించి నందువల్ల వీరి కవిత్వంలోని ప్రసన్నత "అర్థమ్ముకాని భావగీతమ్ము"ల జోలికి పోనలిచే రసిక హృదయాలను తన వైపుకి ఆకర్షించుకుంటుంది. ఈయన కృషీవలుని జీవిత విధానం వైపు మొగ్గి, గరిక పోచ కదలికతో హృదయం శ్రుతికలిపి, సందెముత్తైదువు సరిగవలిపాన్ని వరి వెన్నులపై పాపలు పట్టి లాగితే వాత్సల్యంతో పైకి వంగిందా అనేటట్లున్న చేలపై అలమిన చెంగావి నిగ్గులలో ఐక్యమై పోగలరు. ఆంగ్ల

పారసీ వాఙ్మయాలని తఱచి, వానిలోని సారాన్ని గ్రహించిన వీరు పారసీ వాఙ్మయపుష్పమైన 'ఉమర్ ఖయాం' ని యథానువాదంగా కాకుండా, తెనుగు జాతీయతా గుణంకలిసిన చక్కని స్వతంత్ర సృష్టిగా రూపొందించి, ఉమర్ ఖయాం భావాలు భావకవులందఱిలోనూ వెదజల్లేసేరు.

కృషీవలుడు, జలదాంగన, నలజారమ్మ అగ్ని ప్రవేశము, నక్షత్రమాల, నైవేద్యం, వనకుమారి, పానశాల—వంటి ఖండకావ్యాలమూలంగా తెలుగు వారు వీరిని కవిగా ఎఱుగుదురేగాని వీరిలో వైజ్ఞానిక తృష్ణ ప్రబలంగా వుందన్న సంగతిని ఎఱుగరు.

దువ్వూరి రామిరెడ్డిగారు పుట్టుకతో వైజ్ఞానికు డనడం సారస్వతప్రియులందరికీ సాహసంలాగే కనబడుతుంది. కాని ఇది పరమసత్యం. పరిస్థితులే ఆయనని కవిగా మార్చేయి. రామిరెడ్డిగారికి చిన్నతనంనుండీ విజ్ఞాన సాధనంమీద తృష్ణహెచ్చు! రెండవఫారం చదువుకొనే రోజుల్లోనే వీరు తనకు కావలసిన సబ్బులు తానే స్వయంగా చేసికొనేవారట. అదే వయస్సులో వీరు అట్టలతో కెమేరా నిర్మించి, దానితో ఫోటోలు తీసి, అవి కడగడానికి సాయంకాలం ఫోటోగ్రాఫరు కిచ్చి, రాత్రి పన్నెండు గంటలవేళకి అవి సరిగ్గా వచ్చేయో లేదో కనుక్కోడానికి వాళ్ళ యింటికి వెళ్ళి తలుపుకొట్టి 'నీకు నిద్రపట్టకపోతే మేము నిద్రపో నక్కరలేదనుకున్నావా?' అని అతనిచేత తిట్లుకూడా తిన్నారట.

ఈ వైజ్ఞానిక దృష్టివల్లనే ఆయన ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాలను నిష్పక్షపాతంగా పరిశోధించి, సమన్వయించి వానిలోని నిజానిజాలు తెలిసికొనే నిశిత విమర్శకులైనారు.



వీరిలోని ఈ తృష్ణ ఎంత బలవత్తరమైనదో అవసానకాలంలో వీరు ఆంధ్ర వైజ్ఞానిక రచయితలకు చేసిన దోహదంవల్ల తెలుస్తోంది. హెచ్చు రక్తపు పోటుతో బాధపడుతున్న వీరు 1947 సెప్టెంబరు పదవ తేదీన వారి మిత్రులైన ఒక న్యాయవాదిని పిలిపించి, తాను స్వశక్తితో సంపాదించినదానిలో పదివేలరూపాయలను ఒక ట్రస్టుగా ఏర్పరచి, దానిమీద వచ్చే మూడువందల రూపాయల వడ్డీని ప్రతిఏడూ తెలుగు విజ్ఞానశాస్త్రం గురించి వ్రాసే ఉత్తమ రచయితకి ఇచ్చేటట్టు ఒక వీలునామా తయారుచేయించేరు. విషయం ఇచ్చి పోటీజరిపించి అందులో గెలుపొందిన వ్యక్తికిగానీ, ఒక నిర్ణాయకసంఘంవారు నిర్ణయించిన రచయితకి గానీ ఆబహుమతి చెందాలని వారి ఆశయం. వారి కుటుంబమంతా ఆయన కోరికకి అంగీకరించేరు. వారు మరణించేరోజులు దగ్గర కొచ్చేయి, ఆ విల్లు ఇంకా రిజిస్టరు కాలేదన్న ఆవేదన వారిని పీడించింది. తత్ఫలితంగా రక్తపు పోటు ఎక్కువై పదకొండవ తేదీ అర్ధరాత్రి వారు కీర్తిశేషులైనారు.

వారి ఆదేశాన్ని వారి కుమారులగు శ్రీ దువ్వూరి వేణుగోపాలరెడ్డిగారు అక్షరాలా పాటిస్తూ, తెలుగు వైజ్ఞానికావరణలో కృషిచేసిన ఒక్కొక్క రచయితకీ ప్రతీ ఏడూ మూడువందల రూపాయల మొత్తం గల ఈ "కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి విజ్ఞాన బహుమతి"ని అందజేస్తున్నారు. గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు, కాళీపట్నం కొండయ్యగారు, వసంతరావు వెంకటరావుగారు, విస్సా అప్పారావుగారు ఇంతవరకూ ఈ బహుమతినందిన ప్రముఖులు. 1955-వ సంవత్సరపు బహుమతి సూర్య కుటుంబము, విజ్ఞానవేత్తలు, శాస్త్రవేత్తలు, వినువీథి అనే పుస్తకాలనీ, విజ్ఞానవీథులు విజ్ఞానదీపిక అనే శీర్షికలలో పెక్కువ్యాసాలని వ్రాసి ఆంధ్రులకి నిర్దుష్టమైన విజ్ఞానాన్ని అందజేసిన ఎ. వి. ఎస్. రామారావుగారికి ఇచ్చినారు.

వాస్తుశిల్పమూ, సాహిత్యమూ మొదలైన కళలను పోషించి అభివృద్ధికి తెచ్చిన రెడ్డిరాజుల వంగడంలో పుట్టిన రామిరెడ్డిగారు కళలనేగాక, విజ్ఞానాన్ని కూడా ఆదరించి, దాని అభివృద్ధికి జీవించియున్నప్పుడేగాక కీర్తిశేషులయికూడా తోడ్పడడం ముదావహం. ఈ సదవకాశాన్ని పురస్కరించుకుని తెలుగు చదువరులపై నిర్దుష్ట విజ్ఞాన జ్యోత్స్నని వెదజల్లడమే కాకుండా, రామిరెడ్డిగారి విజ్ఞానబహుమతిని పొందిన ఆనందాన్ని సాధించడానికికూడా వైజ్ఞానికరచయితలు కలంపట్టాలని హెచ్చరిస్తున్నాను.

# గ్రంథ విమర్శనము

## ఎమర్సన్ వ్యాసావళి

అనువాదం: శ్రీ బి. వి. శ్రీనివాసాచార్య; ప్రచురణ, గుండిమెడాస్, ఏలూరు. వెల 1-14-0.

కావ్యరచనలో ఉన్నంత బలవత్తరమైన సంప్రదాయం మనకు వచనరచనలో లేదు. ముఖ్యంగా వ్యాసరచనలో మనం చాలా వెనుకబడి వున్నామంటే యిందుకు ఎవ్వరూ కించ పడరనుకుంటాను. దీనికి తగిన కారణం లేకపోలేదు. ఈ దేశంలో అనాది కాలం నుంచీ కావ్యరచనకు వున్న గౌరవం వచనానికి లేదు. వచనంలో వ్రాస్తే ఆ వ్యక్తి పండితుడు కానట్లే లెక్క. లేకపోతే వైద్యశాస్త్రాల వంటి గ్రంథాలను కూడా పద్యాలలో వ్రాయవలసిన అవసరం ఎందుకు వస్తుంది? కావ్యరచనకు వుండే అవధులేమిటో, వ్యాసరచనకు వుండే అవధులేమిటో మనం అంచనా వేయగలిగితే, ఈనాడు వ్యాసరచనా సంప్రదాయాన్ని పెంపొందించుకోవలసిన అవసరం ఎంత వున్నదో బోధపడుతుంది. ఒక్కొక్క పాశ్చాత్యదేశంలో ఎంతెంత వ్యాసరచనారూపమైన వాఙ్మయం వున్నదో, ఆ దేశాలను సముద్ధరించటానికి అవి ఎంతెంత కృషి చేసినాయో పరిశీలనచేస్తే మనకు నిజంగా విభ్రాంతి కలుగుతుంది. అలాంటి సంప్రదాయం ఏ ఆధారం లేకుండా ఒక్కసారి జాతిలో పుట్టుకురావాలంటే అసంభవం. ఇందుకు ఆయా దేశాల విజ్ఞానవేత్తలయిన రచయితలు ఈ రంగంలో సాధించిన పరిణామాలను మనం అనుభవానికి తెచ్చుకోవలసి వుంది. ఆ దృష్టితో ఈ ప్రయత్నాన్ని అత్యంతాహ్లాదంతో అభినందించుతున్నాం.

ఒక నూతన శిల్పవిశేషాన్ని వాఙ్మయ రంగంలోకి తెచ్చుకునే ప్రయత్నమలా వుండగా 'ఎమర్సన్' ప్రపంచ పూజ్యపురుషులలో ఒకరు. మానవ విజ్ఞాన వ్యాప్తికి తన జీవిత సర్వస్వాన్నీ ధారవోసినవాడు. ఆయన సందేశాలు మానవజాతికి సర్వదా శిరోధార్యములు. ఎమర్సన్, ఎన్నికలలాంటి ఏవో తాత్కాలిక సమస్యలను గురించి చర్చించినవాడు గాదు. అందుచేత వారి రచనలకు కాలావధులు లేవు. రాజనీతి అనే వ్యాసంలో, నూరు సంవత్సరాలనాడు ఆయన వ్రాసిన ఈ దిగువ వాక్యాలను చిత్తగించితే, అవి యీ నాటికీ ఎలా పరమసత్యాలుగా నిలచివుండి ప్రపంచ రాజకీయ వేత్తలను ఎలా ముఖంమీద బాదుతున్నాయో ప్రతి ఒక్కరూ ఇట్టే గ్రహించగలరు.

'నాకు తగిన పనిలోనే నేను ప్రవర్తించుచు తగనిపనినుండి నివర్తించుచూ ఉన్నంతకాలము నా పొరుగువాడునూ, నేనునూ మా విధానములలో తరచు ఏకీభవించుచూ, ఒకే లక్ష్యముకొరకు కొంతకాలము కలసి పనిచేయగలుగుదుము. కాని, ఎప్పుడైతే నా కార్యాచరణపరిధి నాకు చాలక వానిపరిధిలోనికి గూడా అతిచరింతునో అప్పుడు నేను సత్యపథమును అతిక్రమించినవాడ నగుదును. నా పొరుగు వానితో నాకు గల సంబంధాలలో అసత్యము అడుగుపెట్టును. అతనికంటె నేను యుక్తిశాలిని, బలశాలిని అయి వుండవచ్చును. అతడు తనకు జరిగిన అన్యాయమును తగినవిధముగా ప్రకటింపనుగూడా లేకపోవచ్చును. అయినా అది అసత్యమే! అసత్యము మరి అతనినీ నన్నూ సరిసమానముగ బాధించును. మానవుని స్వభావము ఎంతోకాలము తన అభినయమును కొనసాగించలేదు. అది కార్యరూపము దాల్చిన అసత్యముగా, అనగా దౌర్జన్యముగా వ్యక్తముకాక తప్పదు. ఇట్లు పరుని వ్యవహారాలలో జోక్యము కలుగజేసుకొనుటే

# గ్రంథ విమర్శనము

ప్రపంచ ప్రభుత్వా లన్నిటిలోను అత్యంత వికృతంగా కనుపించే మహాపరాధము. ఇద్దరి మధ్యఅది ఎంత తప్పో, చాలామంది విషయంలో కూడా అంతే తప్పు !———

నేటి అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యా ఇది ఎలాంటి ఆశ్చర్యకరమైన హెచ్చరిక !

ఈ సంపుటిలో (1) రాజనీతి (2) కళ-విమర్శ (3) సత్యము, (4) మహాపురుషులూ, అనే నాలుగు ప్రధాన వ్యాసాలున్నాయి. కళ - విమర్శ అనే వ్యాసంలో సాహిత్య సంప్రదాయాలనూ, విమర్శ సంప్రదాయాలనూ నిర్మించుకోవడానికి ఉపకరించే విషయ సంచయం ఎంతో జిజ్ఞాసువుకు లభించుతుంది.

సరళమైన గ్రాంధికంలో, అనువాదం ప్రసన్నమై హృద్యంగా వుంది. ఎమర్సన్ వంటి మహా మహుని గంభీరభావనను, ఇలా సువ్యక్తం చేయగలిగిన అనువాదకులను నిజంగా అభినందించవలసి వుంది. అనువాదకులు, గ్రంథాంతంలో ఎమర్సన్ జీవితచరిత్రను సంగ్రహంగా యిచ్చారు.

* * *

## మొదటి మెట్టు

వివిధరచనా సంపుటి : ప్రచురణ : అభ్యుదయ సాహితి, సమితిస్థానం రాధారమణ్ కార్యాలయం పాలకొల్లు : వెల. 0-8-0.

దీల్లో శ్రీయుతులు తంగిరాల వెంకటేశ్వరరావు, కోరళ్ళ వెంకటేశ్వరరావు, బి. వి. రాధారమణగుప్త, రామకృష్ణ యల్. యస్., ఆరేటి, 'జానకి', కె. పి. బాబు, దంతులూరి సుబ్బరాజు, పోలా ప్రగడ గోపాల కృష్ణ, కె. వి. యస్. యస్. రాజు, పెన్మరాజు రామ సుబ్బారావు, మొదలైన యువరచయితల రచనలు పదిహేనువరకూ వున్నాయి. వీటిలో కొన్ని పద్యాలూ, కొన్ని గేయాలూ, కొన్ని కథలు, కొన్ని వ్యంగ్యరచనలు ఇత్యాదయః రకరకాలుగా వున్నాయి.

ప్రాథమిక రచయితల పురోగమనానికి దోహదంగా ఇలాటి గ్రంథాలను ప్రకటించటం వగైరా కార్యక్రమంకొరకు అభ్యుదయ సాహితీసమితి స్థాపించ బడినట్లు ప్రకాశకులు పరిచయ వాక్యాలలో తెలియ జేశారు. ఈ యువరచయితలు త్వరలో విఖ్యాతులు కాగలరనీ, ఆంధ్రసాహిత్యరంగంలో సుసంప్రదాయాలను స్థాపించగలరనీ ఆశించుతున్నాం.

'ప్రేయసీ ! ప్రేయసీ !
పలుకవే ప్రేయసీ !
చిరునవ్వు చిలుకవే
మనసార పలుకవే
ప్రేయసీ ! ఊర్వసీ.'

మొదలైన వచ్చురకం అనుకరణలు, 'ప్రణయంలో ప్రళయం' మొదలైన శీర్షికలలో కనుపించే చవుకపారు అభిరుచులూ పురోగమన కాంక్షులైన ఈ రచయితలకు అవశ్యం పరిహార్యాలు.

* * *

## గాథా సప్తశతి

అనువాదకులు : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి; ప్రాప్తిస్థానముకూచి బొట్ల వీరరాఘవశాస్త్రి కళ్యాణీ ప్రెస్, తెనాలి. వెల రు. 3-0-0.

ప్రాకృతభాషా వాఙ్మయంలో గాథా సప్తశతి, మహత్తర గ్రంథంగా ప్రపంచ విఖ్యాతిని ఆర్జించుకుంది. ఆంధ్ర సామ్రాజ్య సంస్థాపకుడైన హాల సాతవాహనుడు ఈ గ్రంథాన్ని సంపుటీకరించినట్లు, వాటికి దశదిశా వ్యాప్తంగా చెల్లాచెదరైయున్న అనేకమంది మహాకవుల రచనలను ఆయన అనేకమంది పండితులద్వారా కృషిచేసి సంపాదించి గ్రంథస్థం చేసినట్లూ చెబుతారు. ఈ గ్రంథం ఆనాటి మన నాగరకతా సంస్కృతులను సువ్యక్తం చేస్తుంది.

ఇది ముక్తక వాఙ్మయశాఖకు చెందింది. అంటే ఇతర పూర్వోత్తర గద్యపద్యాదికముల అవసరకత

కానిది లేదు. చెప్పదలచిన గాథను స్వతంత్రముగా చెప్పివేయగలదు. ప్రతిపద్యమూ స్వతంత్రంగా ఒక కావ్యం - ఇది అభినవ గుప్తాచార్యుల నిర్వచనం. ముక్తక వాఙ్మయం శృంగారసాన్ని ఆశ్రయించి వుండటం గమనార్హం.

శ్రీ లక్ష్మీ నరసింహ శాస్త్రిగారు సంస్కృతాంధ్ర ప్రాకృతములలో విశేష పాండిత్యంగల ప్రతిభావంతులు, వీరి సంస్కృతానువాదాలు ఇదివరకే మనం చాలా చవిచూచియున్నాం. ఈముక్త కానువాదానికి పద్యనిర్మాణదక్షత ఎంతో అవసరం. ముచ్చట గొలిపే తెలుగుపదాలతోనూ తెలుగు సమాసమేమోనని భ్రమగొల్పే సంస్కృత సమాసతోరణాలతోను రచన వెల్లి పందిరిలా కళకళలాడుతోంది. ఉదాహరణకు :

"పాప మాపిల్ల నీకునై రేపుమాపు
గ్రంకుకొని గృహద్వారతోరణమునందు
బొందుపడియు వంచినమాల చందమునను
వాడిపోవుచున్నది యొల్లపవలు గుజ్జి"

ప్రతి పద్యంముందూ, ఆ పద్యంలో చెప్పబోయే గాథను, చక్కని తెలుగు వచనములో టూకీగా వివరించారు. గ్రంథానికి అత్యంత ప్రయోజనకరమైన పీఠికను కూడా స్వయంగా సంపుటీకరించారు.

* * *

## అ వి మా ర క ము

మహాకవి భాసుని రూపకమునకు ఆంధ్రానువాదము : అనువాదకులు శ్రీ బలుసు సీతారామశాస్త్రి గారు. ప్రాప్తిస్థానము : రచయిత 22/234 ఇన్నీసుపేట రాజమహేంద్రవరము : వెల 1-4-0.

## సం పూ ర్ణ నీ తి చం ద్రి క

మిత్రలాభము—మిత్రభేదము, ప్రథమభాగం, సంధి—విగ్రహము. రెండవభాగం. రచన : శ్రీ బలుసు సీతారామశాస్త్రిగారు. పబ్లిషర్సు : అడ్డేపల్లి అండ్ కో సరస్వతీ పవర్ ప్రెస్ రాజమహేంద్రవరము. వెల : ఒక్కొక్క భాగం ఒకరూపాయి. వీరు తొలివాటి, ప్రసిద్ధులైన నీతిచంద్రిక రచయితలను, చిన్నయసూరి, వీరేశలింగం ప్రభృతులను సంస్కరించవలసినది. ఏలకో అట్లు చేసినారుకాదు.

## వి దు ర

పద్యకావ్యం : రచన : శ్రీ అకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు. ప్రాప్తిస్థానం : విమాతక విద్వాన్ అకుండి వెంకటశాస్త్రి. కొండూరివారి వీధి, తాడేపల్లి గూడెం. వెల : రు 0-6-0.

ఈ కథను సంస్కృత మహాభారతంలోని ఉద్యోగపర్వంనుంచి సేకరించి పద్యరచనగా సంఘటించారు. తిక్కన ఈ భాగాన్ని అనువాదం చెయ్యకుండా వదలివేశారు.




**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

Bharathi 7th February 1957 Regd. No. M. 1856